# నిరుద్యోగుల పాలిటి ఆశా కిరణం

ఇది స్వయం ఉపాధి సాధించుకోవటానికి ఉపయోగపడే మహత్తరకోర్స్
'బిజినెస్ అకౌంట్స్'

Acc.no. 28242


ఎన్.కె. విశ్వేశ్వరరావు
Tax-Consultant
Practical Account Tutour
(A.By.C. సర్వీసెస్)



సరస్వతి పబ్లికేషన్
సత్యనారాయణపురం - విజయవాడ - 520 011

బిజినెస్ అకౌంట్
By
A.By.C సర్వీసెస్ ఆధ్వర్యంలో N.K.విశ్వేశ్వరరావు
41-18-13, తిరుమలరావుస్ట్రీట్
కృష్ణలంక, విజయవాడ

First Edition: ఏప్రియల్ 2001

Price: 100/-

Cover Page : Ramana

Printed at SWAMY OFFSET: VIJAYAWADA

**D.T.P.**
Lakshm Grap cs
S.N.Rao ✆ 6243 5
V ayawada- 1

P b shed By
సరస్వతి పబ్లికేషన్
సత్యనారాయణపురం, విజయవాడ - 11

విన్నపము:

ఈ కోర్సు ఎంతో శ్రమతో నిరుద్యోగులకు ఉపయోగపడేలా తయారు చేసినది. కాలక్రమేణా మార్పులు ఉండవచ్చును. అలాగే ఎంత జాగ్రత్తగా చేసినా పొరపాట్లు రావచ్చు దయచేసి తెలియజేసిన మలిముద్రణలో సరిచేసుకోగలం.

# ఈ కోర్సుపై అభిప్రాయాలు

## వ్యాపార మార్గదర్శిని!

'చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటే ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిదనే' సూక్తిని ఆదర్శంగా తీసుకుని, నిరుద్యోగ కోటిలో కొంతమందికైనా స్వయం ఉపాధి కల్పించాలనే సదుద్దేశంతో మిత్రులు శ్రీ ఎన్.కె. విశ్వేశ్వరరావు బిజినెస్ అక్కౌంట్స్ పేరుతో రూపొందించిన ఈ కోర్సు అత్యంత ప్రయోజనకరమని చెప్పడం అతిశయోక్తి కాదు. నిరుద్యోగులకే కాక చిరుద్యోగులకు, విద్యార్థులకూ ఈ స్టడీమెటీరియల్ ఎంతో ఉపయోగపడుతుంది. కొత్తగా వ్యాపారం ప్రారంభించిన వారికి ఈ పుస్తకాలు మార్గదర్శకాలుగా దోహదపడతాయి. అవసరమైనంత వరకే అయినా రకరకాల యాక్ట్‌లనూ టాక్సులనూ ఒక్కచోట కూర్చి, విషయ వైవిధ్యంతో కోర్సును తయారు చేసిన మిత్రులు శ్రీ నందిగామ కాశీ విశ్వేశ్వరరావు కృషి అభినందనీయం.

**SHIVAJI B. PRASAD,** F.C.A,
F-4- Sravya towers,Polyclinic Road, Gayatri Nagar
Vijayawada - 520 008. Ph: 473393

## నిరుద్యోగులకు ఆశాదీపం!

నిరుద్యోగుల పాలిటి వరంగా, ఆశాదీపంగా - మిత్రులు శ్రీ ఎన్.కె. విశ్వేశ్వరరావుగారు రూపొందించిన అకౌంటెన్సీ కోర్సును అభివర్ణించవచ్చు. ప్రాక్టికల్ నాలెడ్జిని కలిగించే ఈ కోర్సు ప్రయోజనం అనంతమని చెప్పవచ్చు. ఈ కోర్సు ద్వారా బిజినెస్ అకౌంట్స్‌లో కీలకాంశాలనూ, మెళకువలనూ పూర్తిగా నేర్చుకొని పరిపూర్ణ అకౌంటెంట్‌గా తయారుకావచ్చు. ప్రతి సంవత్సరం లక్షలాదిగా నిరుద్యోగులు పుట్టుకొస్తున్నారు. వారందరికీ ప్రభుత్వం ఉద్యోగాలు చూపడం అసాధ్యం. అందుకనే ఎవరికివారే ఉపాధి మార్గాలను ఎంచుకోవడం తప్పనిసరి. ఈ నేపథ్యంలో - స్వయం ఉపాధి కల్పించుకునేందుకుగాను బిజినెస్ అకౌంట్స్‌లో శిక్షణ పొందడం శ్రేయోదాయకం. అకౌంటెంట్లకు మంచి డిమాండు ఉన్న నేటి పరిస్థితులలో ఆ వృత్తిని చేపట్టడం మంచిదని వేరే చెప్పక్కర్లేదు. ఉత్తమశ్రేణి అకౌంటెంట్‌గా ఈ కోర్సు తీర్చిదిద్దుతుంది. ఉజ్వల భవిష్యత్‌ను ప్రసాదిస్తుంది. గంగను భూలోకానికి రప్పించడానికి చేసిన భగీరథ ప్రయత్నంలా ఈ కోర్సు రూపకల్పన చేసిన శ్రీ నందిగామ కాశీ విశ్వేశ్వరరావుగారి కృషి శ్లాఘనీయం.

**J.SATYANARAYANA**
(Satya Krishna Paints Stores)
President: The Vijayawada Paints Merchants Association,
29-1-22, Seshadri Sastry Street, Governor pet,
Vijayawada - 520 002. Ph : 436049.

# విషయ సూచిక

# ధైర్యం వల్లనే సగం విజయం

"ధైర్యే సాహసే లక్ష్మీః" అన్నారు పెద్దలు. ధైర్యవంతులనే లక్ష్మి వరిస్తుంది. కనుక భయం విడనాడండి. సంశయాలతో కాలం వృధా చేయకండి. అదృష్టం తలుపు తట్టి నప్పడే ఆహ్వానించడం విజ్ఞులు చేయతగ్గపనికదా! వాయిదాల బలహీనత నుంచి బయటపడి వాస్తవ ప్రపంచంలోకి ఆత్మవిశ్వాసంతో దూసుకుపోండి.

"అమ్మో! ఇంత సిలబస్సా? ఇన్నియాక్టులా? ఇన్ని టాక్సుల గురించి చదవాల్సిందేనా? గవర్నమెంట్ రూల్సంటేనే తలనొప్పికదా- వాటినన్నింటినీ బట్టీ పట్టాలా? వీటితో రోజల్లా శిగపట్లు వేయాల? బాబోయ్! అక్కౌంట్సు రాయాల్లంటే ఇంత కోర్సునూ అధ్యయనం చేయాల్సిందేనా?" ఈ విధంగా శరపరంపరగా సందేహాలను సృష్టించుకుంటూ బెంబేలుపడి పోకండి. నీరుగారి పోకండి. ఉద్యోగం, స్వయం ఉపాధి వేటలో ఉన్నవారికి శక్తి, సమయం వృధాకాకుండా - మహాపర్వతాన్ని అద్దంలో చూపే ప్రయత్నమే ఈ కోర్సు అక్కౌంట్స్ రాయడానికి ఏవేవి ఎంతెంత అవసరమో ఆ మేరకు మాత్రమే స్టడీమెటీరియల్‌లో చోటు చేసుకున్నాయి. కనుక ఆ భయాన్ని వదిలేయండి.

పరోపకారమే పరమావధి మరో ముఖ్య విషయం - "పుస్తకం హస్త భూషణమ్" అనిసూక్తి. మంచిపుస్తకం నిజంగా అలంకారమే. ఈ స్టడీ మెటీరియల్‌ను మంచి పేపరుపై, కంప్యూటర్‌తో అచ్చొత్తించి పదికాలాలపాటు మీ వద్ద భద్రంగా ఉండేలా తీర్చిదిద్దాము. విషయ సేకరణకు ఎన్నో వ్యయప్రయాసలకోర్చి సిద్ధంచేసిన ఈ కోర్సుకు రేటు స్వల్పంగానే నిర్ణయించాం. లాభాల దృష్టితో కాకుండా తెలిసిన విద్యను నలుగురికీ నేర్పడం ద్వారా - నిరాశతో కొట్టుమిట్టాడుతున్న యువతకు ఓ 'మార్గం' చూపుదామనే సుదుద్దేశంతోనే ఈ అక్కౌంట్స్ శిక్షణకు శ్రీకారం చుట్టాం.

## ఏ వ్యాపారం చేపట్టినా ప్రయోజనకరం

ప్రస్తుతం ఏదో ఒక వ్యాపారం చేస్తూండవచ్చు. మా శిక్షణ పొంది అకౌంట్స్ నాలెడ్జిని పెంపొందింపచేసుకోవచ్చు. చేసే వ్యాపారానికి తగిన విధంగా శిక్షణ పొందాకనే రేపు మరో వ్యాపారం ఆరంభిస్తే ఎలా? అనే సందేహం అక్కరలేదు. మా కోర్సు పూర్తి మెటీరియల్ మీ వద్ద భద్రంగా ఉంచుకుంటే భవిష్యత్తులో వ్యాపారం మారితే దానికి తగిన విధంగా మెటీరియల్ నుంచి రిఫర్ చేసుకోవచ్చు. అంటే అన్ని రకాల వ్యాపారాలకు సంబంధించిన అకౌంట్స్ పాఠాలు మెటీరియల్‌లో ఉంటాయి. హైస్కూలులో విద్యమానుకున్నాక టెక్ట్స్ పుస్తకాలను ఒదిలివేసి డిక్షనరీ వంటి వాటిని భద్రపరచుకుంటాం ఎందుకు? కాలేజిలోనూ, యూనివర్శిటీలోనూ అది ఉపయోగ పడుతుంది. భవిష్యత్‌లో ఎప్పుడైనా ఆ డిక్షనరీ అవసరానికి ఆదుకుంటుంది. ఈ కోర్సు మెటీరియల్ కూడా డిక్షనరీవంటిదే. ఎప్పుడు అవసరమొచ్చినా వ్యాపారపరంగా తగిన మార్గం సూచిస్తుంది.

### • "కాం"గా ఉండిపోతారా? చైతన్యవంతులౌతారా?

నిర్ణయం మీదే. బి.కాం. చదువుకుని అక్షరాలా "కాం"గా ఉండి పోతారా? (బి.కామ్) నిస్తేజులైపోతారా? సైలెంట్‌గా మిగిలిపోతారా చెప్పండి! బి.ఏ. బి.ఎస్సీ తదితర కోర్సులు పూర్తిచేసిన వారికి పెద్దల ప్రోత్సాహంతో ఉన్నత విద్యను పొంది సైంటిస్టులుగానో, ఇంజనీర్లుగానో, డాక్టరుగానో రూపొందే అవకాశం ఉంది. మరి ఏడేళ్ళు కామర్సు కోర్సు చదివి ఏడ్పు మొహాలతో అలా నిస్తేజంతో నీరుగారిపోవలసిందేనా? ఒక్కసారి ఆలోచించండి. మీ చదువును ఆచరణలో పెట్టాలని లేదు. మీకు సంఘములో ఒక స్టేటస్ కావాలని పేరు ప్రత్యేకతలు పొందాలని, కన్నవారికి మంచిపేరు తేవాలనిలేదు! సొంత కాళ్ళమీద నిలబడి మీకున్న నైపుణ్యాన్ని, మేధాశక్తిని బహిర్గంతంచేసి నలుగురికి ఆదర్శప్రాయంగా ఉండాలని లేదు! ఎందుకు ఉండదండీ అంటే గౌరవమర్యాదలంటే ఎవరికి చేదు చెప్పండి! అందుకనే కామన్ సెన్స్‌తో ఆలోచన సాగించండి. కమర్షియల్ (వాణిజ్య) పరంగా దృష్టి సారించండి.

ఎందెందు వెదకినా అందందే "లెక్కలు"

"టైము ఎంతయిందండి" ఉదయం లేవగానే ఒక గృహిణి ప్రశ్న. " ఆ చీర ఖరీదెంతండీ?" టెక్స్టైల్ షాపులో ఓ వనిత మరో ప్రశ్న. కాకినాడ నుండి ఖమ్మం ఎంత దూరమండి? ఓ బాటసారి సందేహం. "ఐదువేల నాలుగు వందలకు నాలుగువేల ఐదువందలే యిచ్చారేమిటండి?" బ్యాంకులో ఓ కష్టమరు ఆందోళన. " ఎనిమిది మడుగులకు రెండు మానికల విత్తనాలు ఎలా సరిపోతాయ్" ఒక రైతు తర్జన భర్జన. " రెండువందల పేజీలవి నాలుగు నోట్సు పుస్తకాలు కావాలి డాడి" ఓ స్కూలు బుడతడి డిమాండు.

" అమ్మాయి పెళ్ళికి కట్నాలు, కానుకలు, ఎంత ఖర్చయిందేమిటి?" పక్కింటి కుచేలరావు ధర్మసందేహం. " పూటకు రెండు చొప్పున మూడు పూటలు ఈ గొట్టాలు వేసుకో" ఓ రోగికి డాక్టరుగారి సలహా. ఇలా దైనందిన జీవితంలో ప్రతి సంఘటనలోను లెక్కల ప్రభావము తప్పనిసరి. అమ్మవంట సంగతినుంచి అమెరికా రాజ్యాంగ సమస్యల వరకు లెక్కల అవసరం కనిపిస్తుంది. వంట చేసేటప్పుడు ఎంతమందికి ఎన్ని డబ్బాల బియ్యం వండాలో గృహిణి లెక్కకట్టి చేస్తుంది. ఇది సహజంగా తెలియకుండా జరిగిపోయేదయినా లెక్కలెక్కే! ఇదే లెక్కల తడాఖా! మరి లెక్కల ప్రాధాన్యం, వ్యాపారాలకు మరింత ఎక్కువ వుంటుంది కదా. ఇటువంటి లెక్కలన్ని క్రమబద్ధంగా నిర్వహిస్తేనే వ్యాపారలోటుపాట్లు తెలిసేది. వ్యాపారానికి కీలకమైన ఈ అకౌంట్స్ విలువ ఇంతని చెప్పలేముకూడా.

సదా మార్గ దర్శకత్వం

బల్లిని చూచిన ఒక అయిదేళ్ళ బాలుడు భయంతో " అమ్మా" అంటూ కేకవేస్తాడు. వంటింట్లో ఉన్న ఆ తల్లి వెంటనే పరిగెత్తుకొస్తుంది. అమ్మదరిచేరిన ఆ బాలుడు భయం మరిచిపోయి ఆ బల్లిని అదలించ చూస్తాడు. దానిని తరిమికొట్టడానికి ప్రయత్నిస్తాడు. ఆ బాలుడికా ధైర్యం ఎక్కడినుండి వస్తుంది? అప్పటి వరకు భయంతో వణికిపోయిన ఆ బాలుడికి యిప్పడు భయపెట్టే స్థాయి ఎలావచ్చింది? ఈ ప్రశ్నలకు సమాధానం సులువే. వెనకాల అమ్మ ఉండడమే అతని ధైర్యానికి కారణం. నిజమే ఎలాంటి వారికి అయినా "వెనుకదన్ను" వుంటే అసాధ్యమనేది ఉండదు.

సంఘంలో గౌరవప్రదమైన హోదా

తల్లిదండ్రుల ఆశలన్నీ తమ బిడ్డలపైనే, పిల్లలు పైకి రావాలని, ఉన్నత శిఖరాలు అందుకుని నలుగురిచేతా 'భేష్' అనిపించుకోవాలని వారు కలలు కంటుంటారు. కన్నవారి ఆ కలలను నిజం చేయాలంటే కృషి, పట్టుదల, దీక్షా వగైరాలు ఉంటేమాత్రమే చాలదు. వాటిని ఏమార్గంవైపు గురిపెట్టాలో తెలియాలి. ఏం సాధిస్తే సమాజంలో గౌరవప్రదమైన హోదా లభిస్తుందో గుర్తించాలి. దీనికి ఏ వృత్తి లేదా ఏ ఉద్యోగం అనుకూలమైనదో అర్థం చేసుకోవాలి. తదనుగుణంగా కార్యాచరణకు సిద్ధం కావాలి. ఇవేళ అందరి దృష్టి "వ్యాపారం" మీద పడుతోంది. ఎందుకంటే వ్యాపారంలో విజయం సాధిస్తే తక్కువ సమయంలో కోట్లు గడించవచ్చునని. అందుకే అనేక మంది వారివారి స్థాయిల్లో వ్యాపారాలు కొనసాగిస్తున్నారు. ఏ వ్యాపారికైనా అకౌంట్స్ అవసరం తప్పనిసరిగా ఉంటుంది. చిన్న వ్యాపారి మొదలుకొని పెద్ద వ్యాపారుల వరకూ అందరి తలలో నాల్కలా మసలుకునేవాడే అకౌంటెంట్. పూర్తి స్థాయి అకౌంటెంట్‌కి విలువా గౌరవం అపారమైనది.

సందర్భ శుద్ధి - సమయస్ఫూర్తి

"అవసరాన్ని గుర్తించు - లోటును భర్తీ చెయ్యి" ఇది కీలకమైన వ్యాపార సూత్రం. ప్రపంచంలోని ఏ వ్యాపారమైనా ఈ సూత్రం మీదే ఆధారపడి కొనసాగుతుంది. సమాజంలో ప్రజల అవసరాలు ఏమేమిటో మొదట గుర్తించాలి. దైనందిన జీవితంలో సామాన్యుల నుంచి మాన్యుల వరకూ ఎవరెవరికి ఏఏ వస్తుసేవలు అవసరమో తెలుసుకుని వాటిని తీర్చేమార్గాన్ని ఎంచుకోవాలి. ఇలా ప్రతిరోజు అప్రమత్తంగా ఉండాలి. ఈ క్రమంలో చేసేదే అసలైన వ్యాపారం. ఇటువంటి వ్యాపారమే కలకాలం లాభాలను తెచ్చి పెడుతుంది. డిమాండ్‌నూ మార్కెట్ ట్రెండ్‌నూ దృష్టిలో పెట్టుకుని తదనుగుణంగా వ్యాపారంలో మార్పులూ చేర్పులూ చేసుకుంటూవెళ్తే అధిక లాభాలు సుసాధ్యమని సారాంశంగా చెప్పేమాట. ఇవన్నీ వ్యాపార సూత్రాలు. వ్యాపారానికి జవం జీవం ప్రసాదించేది ప్రాణనాడిగా చెప్పదగిందీ ఒక ప్రక్రియ ఉంది. అదే "అకౌంటింగ్ సిస్టం". ప్రతి వ్యాపారానికి ఈ అకౌంట్స్ విధానం

ఎంతగా అవసరమో ఈపాటికే మీకందరకూ అర్థమయ్యే ఉంటుంది. కనుక అకౌంటింగ్‌లో ఓనమాల నుంచి ప్రారంభించి అంతర్జాతీయ వ్యవహారాల వరకూ నేర్చుకోవాలనుకోవడమే సందర్భశుద్ధి.

ఇక్కడ మరో విషయం - వ్యాపారం చేసేవారికి అకౌంటింగ్‌లో పరిజ్ఞానం లేకపోవచ్చు. కానీ పరిపూర్ణుడైన అకౌంటెంట్‌కి వ్యాపారంలో మెళకువలు తప్పకుండా తెలుస్తాయి. వ్యాపారజ్ఞానం బాగా ఉంటుందతనికి. దీనిని దృష్టిలో పెట్టుకునే మా కోర్సులో అకౌంటింగ్ విషయాలతోపాటు వ్యాపార అంశాలకు కూడా ప్రాధాన్యం కల్పించాం.

**వివరణః**

ప్రాక్టికల్ బిజినెస్ అకౌంట్సు కోర్సుకు సంబంధించిన పాఠాలు అన్నీ పూర్తి సబ్జెక్టును కవర్ చేస్తాయి. ప్రాక్టికల్ నాలెడ్జ్ కలిగే విధంగా ఉదా హరణలతో పూర్తిగా విశదీకరించాం. అంతేకాక సందర్భానుసారంగా లేటెస్ట్ జీవోల వివరణ కూడా ఉంది.

**తేలిక భాషలో బోధనః**

పాఠాలు అందరికీ అర్థమయ్యే వాడుక భాషలో రూపొందించాము. అకౌంట్స్ వ్రాయడంలో వాడే సాంకేతిక పదజాలాన్ని అదే విధంగా వాడుతూ అవసరమైన చోట్ల ఇంగ్లీషు భాషను ఉపయోగిస్తూ వివరణలు సాగించాము. కనుక ఈ పద్ధతిలో అకౌంట్స్ వ్రాయడం నేర్చుకొంటే దేశంలో ఎక్కడైనా అకౌంట్స్ రాయవచ్చు. ఒక్క భాషను మినహాయిస్తే విదేశాల్లో కూడా అకౌంట్స్ రాసే విధానం ఇలాగే వుంటుంది. ప్రస్తుత కంప్యూటర్ యుగానికి అను గుణంగా మాకోర్సును రూపొందించడం జరిగింది.

**కోర్సు ప్రయోజనంః**

ఈ కోర్సు విద్యార్థులకు, చిరు, నిరుద్యోగులకు ఎంతో ప్రయోజనకరం. ఏదో ఒక రకం అకౌంట్స్ ఇప్పటికే రాస్తున్నవారికి కూడా అన్నిరకాల అకౌంట్సు నిర్భయంగా రాయగలిగేందుకు ఈ కోర్సు దోహదం చేస్తుంది. వ్యాపారులకు

కూడా తమ అకౌంట్స్‌ను పరిశీలించుకునేందుకు, పలురకాల 'వ్యాపార సరళి'ని అర్థం చేసుకునేందుకు ఈకోర్సు బాగా ఉపయోగపడుతుంది.

**ఉపాధి అవకాశాలు:**

ఏ వ్యాపారమైనా దినదినాభివృద్ధి పొందాలంటే సరైన ప్రణాళిక అవసరం. అది అకౌంట్స్ ద్వారానే సాధ్యమౌవుతుంది. ఏ వ్యాపారానికైనా అకౌంట్స్ కీలకాంశం. కనుక ప్రాక్టికల్‌గా అకౌంట్స్ వ్రాయడంలో నిష్ణాతులైతే ఉజ్వల భవిష్యత్‌కు పునాదులు పడినట్లే. అకౌంట్స్ వ్రాయడంద్వారా స్వయం ఉపాధి కల్పించుకోవడమేగాక ఇతర చిరుద్యోగులుకూడా తమ ఆదాయాన్ని పెంచుకోవచ్చు. సారాంశంగా - స్వశక్తితో - తనకాళ్ళమీద తాను నిలబడేందుకు ఈ కోర్సు ఉపయోగపడుతుందని నిస్సందేహంగా చెప్పవచ్చు.

**ఆకాంక్ష:**

శాఖోపశాఖలుగా - విస్తృతమవుతున్న నేటి వ్యాపార రంగానికి పరిపూర్ణులైన అకౌంటెంట్ల ఆవశ్యకతలను గుర్తించి ఈ గ్రంథ రూపకల్పన గావించడం జరిగింది. ప్రాక్టికల్‌గా బిజినెస్ అకౌంట్స్ వ్రాయడంలో నైపుణ్యం సాధించి నూతన భవిష్యత్తుకు పర్వరచుకోవలసిందిగా ఆకాంక్షిస్తున్నాం. మరోమాట - బిజినెస్ మేగ్నెట్‌ల దృష్టిలో మంచి పరిజ్ఞానం కలిగిన అకౌంటెంట్‌లంటే అపరిమితమైన గౌరవం ఉంటుంది. కనుక ఈ సబ్జక్టులో పరిపూర్ణత పొందాలంటే ఈ గ్రంథాన్ని సమూలంగా ఆకళింపుచేసుకొని, ఆదర్శవంతమైన వ్యక్తిత్వంతో జీవనం సాగించండని కోరుతున్నాం.

**పరిపూర్ణత :**

భోజనంలో సమతుల్య ఆహారం ఉంటే ఆరోగ్యంతో పాటు జ్ఞాన సంపదా పెరుగుతుంది. అలాగే మెటీరియల్‌లో అన్ని అంశాలూ ఉంటే కోర్సు పరిపూర్ణమై విశేష ప్రయోజనాలను అందిస్తుంది. ఈ దిశగా మా కోర్సు రూపొందింది.

ఇక కోర్సు వివరాలలోకి వెళ్దాం.........

# కంపెనీలు

ఇంత వరకు మనం Trading కు చెందిన Accounts లో Proprietory Concerns, Partnership Firms, Manufacturing Industries గురించి తెలుసుకున్నాం. ఇప్పుడు Companies గురించి పరిశీలిద్దాం.

Companies Act 1966 కింద Registrar of Companies లో రిజిష్టరైన సంస్థను Company అంటారు. ఇది రెండు విధాలు (1) Private Limited Company, (2) Public Limited Company.

## ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీ :

ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీలో సభ్యుల సంఖ్య 50కి పరిమితం. పెట్టు బడులను Share Capital గా చూపుతారు.

Share Transfer కు సంబంధించి Articles లో పరిమితిపై నియంత్రణ ఉంటుంది. Shares కొనడానికి పబ్లిక్‌ను ఆహ్వానించకూడదు.

## పబ్లిక్ కంపెనీ లిమిటెడ్:

ప్రైవేట్ లిమిటెడ్ కానివన్నీ Public Limited కిందికు వస్తాయి. Shares ద్వారా పెట్టుబడి పెట్టినవారిని Share Holder అని Director అనీ పిలుస్తారు. Active Director కు రెమ్యూనరేషన్ చూపడం జరుగుతుంది. Profit & Loss లో వచ్చిన లాభాన్ని ఏ ఏడాదికా ఏడాది Directors కి పంచకుండా Reserves & Surplus అనే హెడ్ ఆఫ్ ఎక్కౌంటులో బ్యాలెన్సుగా చూపుతూ తదుపరి వచ్చే లాభాలను వారి వారి షేర్సు నిష్పత్తిని బట్టి డివిడెండ్‌గానూ, బోనస్‌గానూ పొందుతారు.

Company ని Incorporation చేయడమెలా ?

ఇద్దరుగాని, అంతకన్నా ఎక్కువ మందిగాని కలిసి సంబంధిత Registrar of Companies (A.P. అయితే Hyderabad) కి Form No.1A ద్వారా Name Availability కోసం అప్లై చేయాలి. దీనితోపాటు ఫైలింగ్ ఫీజు రు. 500/-లు చెల్లించాలి. మనం సెలక్ట్ చేసుకున్న పేరు రిజిస్ట్రారు అప్రూవ్ చేసిన తర్వాత ఆ పేరుతో Company Memorandum of Association, Articles of Association ను ప్రింటింగ్ చేయాలి. వీటిని సబ్ రిజిస్ట్రార్ ఆఫీసులో స్టాంపింగ్ చేయించి ప్రమోటర్స్ (షేర్ హోల్డర్స్) వారి వారి స్వహస్తాలతో సంతకాలు చేసి, వీటి మూడు కాపీలను, ఫైలింగ్ ఫీజును రిజిస్ట్రార్ ఆఫ్ కంపెనీస్‌లో దాఖలు చేయాలి. వీటితోపాటు ఫారం నెం.1 (అన్నీ సరిపోయాయి అని) ఫారం నెం.18 (Address of Registered Office), Form No.32 (Particulars of Directors in Duplicate) లను ఫైల్‌చేయాలి. అంతేకాక Original Letter of Name Availabilty ని కూడా జతచేయాలి. వీటిని పరిశీలించిన తర్వాత Registrar of Companies సంస్థను నమోదు చేసి Registration Certificate ఇస్తారు.

ఈ విధంగా కంపెనీ నమోదు పొందిన తర్వాత ప్రతి సంవత్సరం Accounts Books ను Chartered Accountant చేత Audit చేయించి Auditor Report ను, R.O.C. కి దాఖలు చేస్తూ ఉండాలి.

**Note:-** Partnership Firm అయితే Register of Firms వద్ద Register చేయించవచ్చు. లేదా ఊరుకోనూవచ్చు. Registration గనుక చేయించు కున్నట్లయితే ఫరమ్‌కు రావలసిన రుణాలకై Legal గా Proceed అవవచ్చు.

Registration కాకపోతే ఆ అవకాశం లేదు. అదే కంపెనీ అయితే Company Act కింద రిజిష్టర్ అయి తీరవలసిందే.

## చిట్ ఫండ్ కంపెనీ

Non Trading కు సంబంధించి చిట్‌ఫండ్స్ కంపెనీ గురించి తెలుసుకుందాం.

చిట్‌ఫండ్స్‌కు సంబంధించిన Act 19th August 1982 న అమలులోకి వచ్చింది. అందుకు ఈ యాక్టును "చిట్‌ఫండ్స్ యాక్ట్ 1982" అని పేర్కొంటారు. చిట్‌ఫండ్ కంపెనీలన్నీ ఈ యాక్టు పరిధిలోకి వస్తాయి. ఇక చిట్ ఫండ్ వ్యవహారాలు ఎలా సాగుతాయో పరిశీలిద్దాం.

చిట్ ఫండ్ కంపెనీవారు కొంత మంది సభ్యులను సమీకరించి ఒక 'గ్రూప్'ను తయారుచేస్తారు. ఉదాహరణకు- కంపెనీవారు లక్షరూపాయల చిట్‌ను ప్రారంభించారనుకుందాం. అందులో 25 మంది సభ్యులుంటే కాలపరిధి 25 నెలలుగాను, 40 మంది సభ్యులుంటే 40 నెలలుగాను, 50 మంది సభ్యులుంటే 50 నెలలుగాను కాలపరిధి ఉంటుంది. అలా ఈ లక్ష రూపాయల చిట్‌ను మూడు గ్రూపులుగా విభజించి ప్రతి నెలా 'పాట' (Auction) నిర్వహిస్తుంటారు. పాడుకున్న సభ్యుడికి పాట మొత్తం పోను మిగతా సొమ్ము అప్పగిస్తారు. ఈ సభ్యుడు కూడా మిగతా నెలలకు అందరిమల్లేనే చిట్ మొత్తం చెల్లిస్తుండాలి. ఎన్నినెలల గ్రూపు అయితే అన్ని నెలలు ప్రతి నెలా ఇలానే జరుగుతూ ఉంటుంది. ఇక్ చిట్ చెల్లింపు విషయానికి వస్తే లక్ష రూపాయల చిట్ 25 నెలల వ్యవధి గలగ్రూపులోని ఒక సభ్యుడు ప్రతి నెలా చెల్లించాల్సిన మొత్తం రు.4,000 అయితే ఆ నెలలో

నిర్వహించిన పాటలో పాడుకున్న మొత్తాన్ని 25 మంది సభ్యులకూ పంచుతారు. ఒక్కొక్కరికి ఎంత వచ్చిందో ఆ మొత్తం రు.4,000/- లనుంచి తగ్గిస్తారు. అలా తగ్గించిన మొత్తమే సభ్యుడు చెల్లించ వలసిన సొమ్ము. ఈ వ్యవహారం ప్రతి నెలా సాగుతుంది. చిట్ పాడదలచుకున్న సభ్యులు పాటలో పాల్గొంటారు. తమ అవసరాన్ని బట్టి పాట రేటును పెంచుకుంటూ పోతారు. అత్యధికంగా పాడిన వ్యక్తికి లక్ష రూపాయలలో ఆ పాట మొత్తాన్ని తగ్గించి ఇస్తారు. ఇది స్థూలంగా చీటి పాటల వ్యవహారం. అయితే సభ్యుల సౌలభ్యం కోసం అనేక విధానాలను కంపెనీలు అనుసరించవచ్చు. చిట్‌ఫండ్ కంపెనీ తాను పాటించదలచిన విధానాలు, చీటీల వివరాలు, గ్రూపులు తదితరాలను పేర్కొంటూ చిట్ నిర్వహణకు ముందుగానే సంబంధిత రిజిస్ట్రార్ వద్ద బైలాను రిజిష్టరు చేయించవలసి ఉంటుంది. కంపెనీ వారు 25 మంది సభ్యులనుంచి అప్లికేషన్స్ సేకరించి ఆ గ్రూపునకు సంబంధించిన వివరాలన్నింటినీ సబ్ రిజిస్ట్రార్ ఆఫీసులో దాఖలు చేస్తూ యూనిట్ వాల్యూలో 50% ఎమౌంట్‌ను ఏదైనా నేషనలైజ్డ్ బ్యాంక్‌లో ఫిక్స్‌డ్ డిపాజిట్‌చేసి, వివరాలతోపాటుగా ఈ డిపాజిట్‌ను కూడా పై కార్యాలయంలో దాఖలు చేయవలసి ఉంటుంది. బైలా రిజిస్ట్రేషన్‌కు కూడా కొంత రుసుం చెల్లించాల్సి ఉంటుంది. ఆ తర్వాత చిట్ గ్రూపు రన్ చేయడం జరుగుతుంది.

కంపెనీకి వచ్చే బెనిఫిట్స్ గురించి చూద్దాం. లక్షరూపాయలు చిట్‌పై కంపెనీకి 5% కమీషన్ వస్తుంది. అంటే లక్షరూపాయలకు 5% చొప్పున రూ. 5000/- నెలకు ఆదాయమన్నమాట. ఇలా 25 నెల్లకు రూ.1,25,000/- కంపెనీ ఆర్జించవచ్చు. ఈ విధంగా కంపెనీ ఎన్ని రకాల గ్రూపులు రన్ చేస్తే అన్ని రకాల గ్రూపుల మీదా 5% కమీషన్ లభిస్తుంది. అన్ని గ్రూపుల మీదా 10 లక్షల వ్యాపారం

జరుగుతుందనుకుంటే నెలకు రు. 50,000/-, సంవత్సరానికి 6,00,000/- అవుతుంది. ఇదంతా కంపెనీ ఆదాయం కిందికే వస్తుంది. ఈ రకంగా బెనిఫిట్ పొందాలంటే అన్ని గ్రూపులకు సభ్యులను చేర్చుకోవడం, వారి నుంచి ప్రతి నెలా ఇన్స్టాల్మెంట్ ఎమౌంట్ను కలెక్ట్ చేయడం, పాట నిర్వహించడం సక్రమంగా సభ్యులకు పేమెంట్ ఇవ్వడం మొదలైనవన్నీ నిరాటంకంగా సాగుతూ ఉండాలి. దీని కోసం ప్రతి చిట్ ఫండ్ కంపెనీ సభ్యులను ఆకర్షించేందుకు అనేక పథకాలు ప్రవేశపెడుతుంది. ఇవన్నీ కంపెనీకి లాభాలు. మరి సభ్యులకు కూడా చిట్స్ వల్ల ప్రయోజనం, లాభాలు ఎలా ఉంటాయో గమనిద్దాం. చీటి పాట పోను మిగతా సొమ్ము చెల్లిస్తే సరిపోతుందని ఇంతకు ముందు తెలుసుకున్నాం. దీని గురించి మరికొన్ని వివరాలు - లక్ష రూపాయల చిట్, 25 నెలల కాల పరిమితి అనుకుందాం. కంపెనీ ఈ చిట్ వాల్యూలో సీలింగ్ నిర్ణయిస్తుంది. 35% సీలింగ్ నిర్ణయిస్తే ఇచ్చే మొత్తం నుంచి 35% చొప్పున 35,000/- తగ్గించి సభ్యుడికి 65,000/- మాత్రం చెల్లిస్తారు. ఈ పద్ధతి మొదటి 10 నెలలు అమలులో ఉంటుంది. ఇందులో పాట నిర్వహించడం ఉండదు. లాటరీ ద్వారా సభ్యుడిని ఎంపిక చేస్తారు. గ్రూపులోని మొత్తం 25 మంది సభ్యులకు టోకెన్ నెంబర్లు కేటాయిస్తారు. ఈ నెంబర్లను డ్రా తీస్తారు. డ్రాలో వచ్చిన సభ్యుడికి చిట్ లక్ష రూపాయలలో 35,000/-లు తగ్గించి 65,000/- పే చేస్తారు. ఇక 35,000/- లో కంపెనీ కమీషన్ 5,000/- పోను మిగతా 30,000/- సభ్యులకు పంచుతారు. ఒక్కొక్కరికి 1200/- తగ్గించి 2,800/- కంపెనీకి చెల్లిస్తే సరిపోతుంది. ఈ లాటరీ పద్ధతి మొదటి 10 నెలలు జరగ్గా మిగతా 15 నెలలు ఓపెన్ ఆక్షన్ పద్ధతి సాగుతుంది. ఇందులో ఎవరి అవసరాల మేరకు వారు పాడుకుంటారు. పాట మొత్తం పోను మిగతాది చెల్లిస్తే సరిపోతుంది.

ఆక్షన్ ద్వారా కలిగే లాభాలేమిటంటే - దీని ద్వారా ముందుగానే సొమ్ము చేతికందుతుంది కనుక సభ్యులు తమ అవసరాలకు ఉపయోగించుకోవచ్చు. తర్వాతి నెలల్లో కేవలం ఇన్‌స్టాల్‌మెంట్ చెల్లిస్తే సరిపోతుంది. ఈ ఆక్షన్ పద్ధతిలో ఎక్కువ మొత్తానికి పాడుకున్నట్లయితే ఆ మేరకు సభ్యుడికి లాభమే. కట్టవలసిన ఇన్‌స్టాల్‌మెంట్ అమౌంట్ బాగా తగ్గుతుంది. ఇదే గాక మొదటి పది నెలలు సీలింగ్ విధానంలో ప్రతి నెలా 1200/-లు చొప్పున 12,000/- వచ్చినట్లే. ఆ తర్వాత 15 నెలల్లో 1200/-లు తగ్గుతూ చెల్లించాల్సిన ఇన్‌స్టాల్‌మెంట్ అమౌంట్ పెరుగుతూ వస్తుంది. ఈ రకంగా చీటీ పాట ద్వారా సభ్యులకు ఏరకంగా చూసినా మంచి లాభా లుంటాయి.

చిట్ ఫండ్ కంపెనీకి మరో సౌలభ్యం కూడా ఉంది. తాను నిర్వహించే ప్రతి గ్రూపులోను కంపెనీ కింద ఒక నెంబరు నమోదు చేసుకోవచ్చు. సభ్యుడు పొందే లాభాలను కంపెనీ పొందవచ్చు. ఈ కంపెనీ 5వ నెల ఆక్షన్ నిర్వహించ కుండా చిట్ వాల్యూ ఎంతో అంత మొత్తం కంపెనీ తీసుకుంటుంది. ఆరు నెలల్లో సభ్యులందరూ మొదటి నెల చెల్లించినట్లు 4,000/-లు చెల్లిస్తారు. చిట్ వాల్యూ లక్షరూపాయలైతే 5వ నెలలో కంపెనీ తీసుకుని ఇతరులకు చెల్లించ నవసరంలేదు. కాబట్టి ఆ మొత్తాన్ని కంపెనీ పెంపుదలకి అభివృద్ధికి వాడుకోవడం జరుగుతుంది.

ఈ రకంగా చిట్స్ నిర్వహించడం ద్వారా అటు చిట్‌ఫండ్ కంపెనీలకు, ఇటు సభ్యులకు ఎన్నో విధాలుగా లాభాలు ఉండడం వల్ల ఎందరో చిట్ ఫండ్ కంపెనీలను నిర్వహిస్తున్నారు. అలాగే ఆయా కంపెనీలలో ఎంతో మంది ఉద్యోగులు, వ్యాపారులు, సామాన్యులు కూడా సభ్యులుగా చేరుతున్నారు. అనేక ప్రయోజనాలు పొందుతున్నారు. కాకపోతే - నిజాయితీగా వ్యవహరించే

కంపెనీలను ఎన్నుకోవడం సభ్యుల పని. అలాగే నిబంధనలకు కట్టుబడి ఉండే సభ్యులను చేర్చుకోవడం కంపెనీల విధి.

ఈ విధంగా కొనసాగే చిట్ ఫండ్ కంపెనీలో జరిగే ట్రాన్సాక్షన్స్‌ను ఏవిధంగా ఎకౌంట్ బుక్స్‌లో రాస్తారో పరిశీలిద్దాం. ఈ ఎకౌంట్స్‌కి డబుల్ కాలమ్ క్యాష్ బుక్ ఉపయోగిస్తే ప్రయోజనకరంగా ఉంటుంది. కాగా చిట్ ఫండ్ కంపెనీకి కావలసిన ఎకౌంట్ బుక్స్:

(1) క్యాష్ బుక్, (2) లెడ్జర్, (3) జర్నల్.

ఇప్పుడు - గౌతమి చిట్ ఫండ్ (ప్రై) లిమిటెడ్ అనుపేరుతో ప్రవీణ్, రాగిత, శోభిత అను ముగ్గురు షేర్ హోల్డర్స్‌గా క్యాష్ షేర్ రూ. 100/- విలువగా 50, 30, 20 షేర్ కేపిటల్ ఇన్వెస్ట్ చేశారనుకుందాం. వీటిని మనం క్యాష్ బుక్‌లో ఈ క్రింది విధంగా రాస్తాం. మొదటగా కంపెనీ ఇన్‌కార్పోరేషన్ నిమిత్తం ఖర్చులను (కంపెనీ రిజిస్ట్రేషన్ ఫీజు, ఆర్టికల్స్, కంపెనీ కామన్ సీల్, ఆడిటర్ ఫీజు, ట్రావెలింగ్ మొదలగు) Preliminary & Preoperative Expenditure అనే హెడ్ క్రింద రాసుకోవాలి.

| Date | Particulars | Cash | Bank | Date | Particulars | Cash | Bank |
|---|---|---|---|---|---|---|---|
| | Share Capital A/c | | | | Preliminary | | |
| | By Praveen | | | | & Pre-opera- | | |
| | 50 shares 100/- | 5,000 | | | tive Exp. | 10,000 | |
| | Rajita 30 shares | 3,000 | | | | | |
| | Sabita 20 shares | 2,000 | | | | | |

ఈ విధంగా రాసిన Preliminary Expenditure నుంచి ప్రతి సంవత్స రాంతంలో 1/10గా ఎమౌంట్‌ను Written off చేస్తూ అట్టి ఎమౌంట్‌ను చూపాలి. మిగిలిన ఎమౌంట్‌ను కంపెనీ Asset లో Preliminary Expenses Written off అనే హెడ్‌లో చూపి Next Year Carry Forward కు చేయాలి.

ప్రారంభంలో చిట్ గ్రూపులు ఏర్పాటు చేసుకుని కంపెనీ నడపడం జరుగుతుంది. గౌతమి చిట్ ఫండ్ వారు రెండు గ్రూపులతో వ్యాపారం ప్రారంభించారనుకుందాం. వాటికి రెండు పేర్లు : (1) GCS/A1, (2) GCL/A1 ఇందులో GCS అంటే Gowtham Chitfunds Short Term అని అర్థం. షార్ట్ టర్మ్ అంటే 25 నెలలని భావం. అలాగే 1 అంటే రు. లక్ష విలువది ఒకటవదని అర్థం. ముందు ముందు ఇటువంటి చిట్‌లు ప్రారంభించినపుడు A2, A3, A4 అంటూ పేర్కొంటారు. అదే విధంగా GCL/A1 అంటే Gowtham Chitfunds Long Term అని అర్థం. లాంగ్ టర్మ్ 40 లేదా 50 నెలల కాలవ్యవధి కలిగిన చిట్‌లన్నమాట. ఇక్కడ కూడా మరి కొన్ని చిట్స్ తర్వాతి కాలంలో ప్రారంభిస్తే A2, A3 ... ఇలా సూచిస్తారు. ఈ విధంగా గ్రూప్‌ల పేర్లు నిర్ణయించుకుని మొదటగా చిట్ ఫండ్ రిజిస్ట్రేషన్ చేయవలసి ఉంటుంది. ఈ ఖర్చులను చిట్ రిజిస్ట్రేషన్ ఎకౌంట్ అనే హెడ్ కింద చూపాలి.

పై రెండు గ్రూపులకు కలిపి రిజిస్ట్రేషన్ ఎక్స్‌పెన్సెస్ రు. 50/- అయ్యాయి. దానిని ఈ కింది విధంగా రాయాలి.

| Date | Particulars | Cash | Bank | Date | Particulars | Cash | Bank |
|---|---|---|---|---|---|---|---|
| | | | | | Chit Regn.Fee A/c | | |
| | | | | | To Regn. EXp. | 50 | |

ఈ రకంగా ప్రారంభమైన చిట్‌ఫండ్ కంపెనీ అభివృద్ధి చెందుతూ మరికొన్ని గ్రూపులు ప్రారంభిస్తుంది. రు. 50,000/-, రు. 25,000/- చీటీలు కూడా నిర్వహిస్తుంది. అప్పుడు ఎ1కి బదులుగా బి1 అని సి1 అనీ ఆయా గ్రూపుల పేర్లలో పేర్కొంటారు. పై మాదిరిగానే ఈ చిట్‌లలో కూడా బి2, బి3 అనీ, సి2, సి3 అనీ పెంచుకుంటూ వెళ్తారు.

వసూలయ్యే కలెక్షన్ ఒకే గ్రూపునకు చెందినదైతే కలెక్షన్స్ ఎ/సి అనే హెడ్‌లో చూపాలి. అలా కాక వివిధ గ్రూపులున్నప్పుడు ఏ గ్రూపుకా గ్రూపు కలెక్షన్స్‌ను విడివిడిగా రాయాలి. అవి క్యాష్ అయితే క్యాష్ కాలమ్‌లోనూ, బ్యాంక్ చెక్ / డిడి అయితే బ్యాంక్ కాలంలోను చూపాలి.

ఈ కింది రశీదుల ద్వారా అయిన వసూళ్ళను పరిశీలిద్దాం.

| Chit Group | Rt.No. | Cash/Cheque | Amount | Tocken No. |
|---|---|---|---|---|
| GCS/A1 | 2241 | Cash | 4000 | 16 |
| GCS/A1 | 2242 | Cash | 2500 | 33 |
| GCS/C2 | 2243 | Cheque | 1000 | 5 |
| GCS/A1 | 2244 | Cash | 4000 | 21 |
| GCL/C2 | 2245 | Cash | 1250 | 36 |
| GCL/A1 | 2246 | Cheque | 2500 | 12 |
| GCS/C2 | 2247 | Cash | 1000 | 14 |
| GCL/A1 | 2248 | Cash | 2500 | 9 |
| GCS/C1 | 2249 | Cheque | 1000 | 20 |

| | | | | |
|---|---|---|---|---|
| GCS/C2 | 2250 | Cheque | 1000 | 24 |
| GCS/B2 | 2251 | Cash | 2000 | 25 |
| GCS/B2 | 2252 | Cheque | 1250 | 31 |
| GCS/B2 | 2253 | Cheque | 2000 | 4 |
| GCS/B2 | 2254 | Cheque | 1250 | 39 |
| GCS/B2 | 2255 | Cheque | 2000 | 19 |

ది. 2-4-2001వ తేదీనాపై 15 రశీదుల ద్వారా వివిధ గ్రూపులకు సంబంధించి వచ్చిన కలెక్షన్స్‌ను ఏ గ్రూపును ఆ గ్రూపు హెడ్ ఆఫ్ అకౌంట్ కి క్యాష్ రిసీప్ట్స్ అన్నీ ఒకే మొత్తంగానూ, బ్యాంక్ రిసీప్ట్స్ అన్నీ ఒక పక్కనా దేనికదిగానూ రాయాలి.

| Date | Particulars | Cash | Bank | Date | Particulars | Cash | Bank |
|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | |

ఈ విధంగా ఏరోజుకారోజు కలెక్షన్స్‌ను రాసుకుంటూ నెలకొక పర్యాయం ఆక్షన్ జరిగి దాని ద్వారా చీటీ పాడుకున్న వారికి చిట్ వాల్యూ నుండి పాడిన ఎమౌంట్‌ను తగ్గించి ఇవ్వడం జరుగుతుంది. కాబట్టి తదనుగుణంగా అకౌంట్స్‌లో వివరాలు పేర్కొంటూ ఉండాలి.

GCS/A1 Group లో మొదటి నెల సీలింగ్ విధానం కాబట్టి (ఇలా పది నెలలు) ఒకే విధంగా అమౌంట్ చెల్లిస్తారు. సీలింగ్ 35% నిర్ణయమైపోయింది. కనుక లక్ష రూపాయల చిట్‌లో 35% చొప్పున రు. 35,000/- మినహాయించి

రు. 65,000/- సభ్యుడికి ఇస్తారు. మొదటి నెలలో టికెట్ నెం.5 లాటరీ పద్ధతిలో గెలిచారనుకుంటే ఆ సభ్యుడికి రూ.65,000/- బ్యాంక్ చెక్ ద్వారా చెల్లించడం జరుగుతుంది.

| Date | L.F. | Particulars | Debit | Credit | Date | L.F. | Particulars | Debit | Credit |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | GCS/A Group A/c | | |
| | | | | | | | To Ch.No. | | |
| | | | | | | | Vide T.No.5 | | 65,000 |

JOURNAL

| Date | L.F. | Particulars | Debit | Credit |
|---|---|---|---|---|
| | | GCS/A1 Group | | |
| | | Subscription A/c | 35,000 | |
| | | To Commission A/c | | 5,000 |
| | | To Dividend A/c | | 30,000 |
| | | (1st Auction given to T.No.5) | | |

GCS/A1 Group Chit ద్వారా రు. 65,000/- డెబిట్ చేస్తాము. అట్లాగే జర్నల్ ద్వారా కమీషన్, డివిడెండ్ అని రు. 35,000/- డెబిట్ చేస్తాము. కనుక లక్ష రూపాయల మొత్తంసరిపోయింది. ఈ ఆక్షన్ ద్వారా కంపెనీకి రు.5,000/- కమీషన్ వచ్చింది. ఇది జర్నల్ ద్వారా లెడ్జర్‌లో కమీషన్ ఎ/సి కి రు. 5000/- క్రెడిట్ అవుతుంది. మిగిలిన రు. 30000/- ల డివిడెండ్‌ని మళ్ళీ 25 మంది

సభ్యులకు పంచుతారు. వచ్చే నెలలో చిట్ సభ్యులు వారు చెల్లించవలసిన మొత్తం నుంచి ఈ డివిడెండ్ తగ్గించి చెల్లించడం జరుగుతుంది. కనుక ఈ రు. 30,000/- లను ఈ క్రింది విధంగా జర్నల్ బుక్ ద్వారా రాసి లెడ్జర్ పోస్టింగ్ వేసుకోవాలి.

JOURNAL

| Date | L.F. | Particulars | Debit | Credit |
|---|---|---|---|---|
| | | Dividend A/c Dr. | 30,000/- | |
| | | To GCS/A1 G.Subcri A/c | | 30,000 |
| | | (Earned dividend distributed | | |
| | | to Group holders) | | |

దీని ద్వారా డివిడెండ్ అనే హెడ్ ఆఫ్ అకౌంట్ క్రెడిట్, డెబిట్ సరిసమానమైన బ్యాలెన్సు కూడా సరిపోతుంది. GCS/A1 Group కి రు. 30,000ల డివిడెండ్ క్రెడిట్ చేయబడుతుంది. తదుపరి నెలలో సభ్యులు ఒక్కొక్కరు రూ. 2800/-లు చొప్పున 25 మంది చెల్లించాల్సిన అమౌంట్ రు.70,000/- చెల్లించిన సరిపోతుంది. ఈ విధంగా ఏ నెలకా నెల ఏ గ్రూపుకి ఆ గ్రూపు ట్రాన్సేక్షన్స్‌ను అకౌంట్‌లో రాసుకోవాలి.

ఇక్కడ ఇంకో విషయం గమనించాలి. ప్రతి గ్రూప్‌లో కంపెనీకి సంబంధించిన ఒక చిట్ ఉంటుందని అనుకున్నాంకదా! మిగతా సభ్యులు తాము చెల్లించాల్సిన ఇన్‌స్టాల్‌మెంట్ సొమ్మును క్యాష్ రూపంగానో, బ్యాంక్ చెక్

రూపంగానో చెల్లిస్తారు. మరి కంపెనీ ఎలా చెల్లిస్తుందనేది మనం గుర్తించాల్సిన అంశం. ట్రాన్సక్షన్‌ను రికార్డు ప్రకారం చూపాల్సిందే. వీటిని జర్నల్ బుక్ ద్వారా ఏ నెలకాలనెల ఈ కింది విధంగా రాసుకోవాలి.

కంపెనీ ఓన్ చిట్స్ అనే హెడ్ ఆఫ్ A/C ని పెట్టి ప్రతి నెలా ఇన్‌స్టాల్‌మెంట్ అమౌంట్‌ను ఈ కింది విధంగా రాయాలి.

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Company own Chits A/c Dr. | 4000 | |
| | | To GCS/A1 A/c | | 4000 |
| | | (1st instalment of Company own chit) | | |

దీని ద్వారా కంపెనీ ఓన్ చిట్స్ అకౌంట్‌కి రు.4000/- డెబిట్ అయిన మిగిలిన 24 మంది సభ్యుల మాదిరిగానే GCS/A1 గ్రూప్‌కు రు. 4000/- క్రెడిట్ అవుతుంది. మొత్తం 25 మంది సభ్యుల నుంచి ఇన్‌స్టాల్‌మెంట్స్ వసూళ్ళు జరుగుతాయి.

తదుపరి ప్రతినెలా చిట్ ఆక్షన్ జరిగి ఏ నెలకానెల విన్ అయిన వారికి చెక్ ద్వారా చెల్లింపు జరుగుతుంది. మరి 5వ ఆక్షన్ అమౌంట్ మొత్తం డివిడెండ్ పంచకుండా కంపెనీ తన వద్దే ఉంచుకున్నట్లయితే ఈ కింది విధంగా చూపాలి.

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | GCS/A1 A/c Dr. | 1,00,000 | |
| | | To Company own chits A/c | | 1,00,000 |
| | | (5th Auction amount taken by the Company) | | |

ఇంతకు ముందు కట్టిన ఇన్‌స్టాల్‌మెంట్స్ అన్నీ కంపెనీ ఓన్ చిట్స్‌లో డెబిట్ అవుతూ ఈ 5వ ఆక్షన్ అమౌంట్ క్రెడిట్ అవుతుంది. చివరాఖరుకు ఈ రెండు టాలీ అవుతాయి. అయితే ప్రతి నెలా చిట్ ఇన్‌స్టాల్‌మెంట్ కడుతూ ఉంటారు కదా. అందులో కంపెనీ కూడా తన సొంత చిట్ కూడా కడుతున్నట్లుగా జనరల్ ఎంట్రీ పాస్ చేశాము. రెండో నెల నుంచి డివిడెండ్‌ను మినహాయించి 24 మంది సభ్యులు చెల్లించినట్లుగా దీనిని కూడా చూపుతూ ఇన్‌స్టాల్‌మెంట్‌లో కట్టింది పోగా మిగిలిన డివిడెండ్‌ను ఈ కింది విధంగా ఏ నెలకానెల జర్నల్‌లో చూపాలి. (4000 - 2800 - 1200)

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Company Own Chit A/c Dr. | 1200 | |
| | | To Dividend received from Company own Chits A/c | | 1200 |
| | | (GCS/Ac. Group) | | |

ప్రతి గ్రూప్‌లోను ఏ ఏడాదికా ఏడాది ఈ రకంగా వచ్చే డివిడెండ్ అంతా ఇన్‌కం కింద చూపుతారు.

కంపెనీకి ఇంకోరకమైన ఆదాయం కూడా ఉంది. ఎలా అంటే కొత్త చిట్ గ్రూపులు ప్రారంభమైనప్పుడల్లా సభ్యులను చేర్చుకునే ముందు ఎన్‌రోల్‌మెంట్ ఫీజు అని వసూలు చేస్తారు. దీనినే రిజిస్ట్రేషన్ ఫీజు అని కూడా అంటారు. అదే విధంగా మళ్ళీ పాడుకున్న వారికి పేమెంట్ చేసేటప్పుడు డాక్యుమెంటేషన్ చార్జీల కింద కొంత మొత్తాన్ని కలెక్ట్ చేస్తారు. వీటన్నింటినీ మిస్‌లీనియస్ ఇనకమ్ అనే హెడ్ ఆఫ్ అకౌంట్ కింద చూపాలి.

కేష్ ఎఫెక్ట్ కానటువంటి ఇంకో విషయాన్ని కూడా ఇక్కడ పరిశీలించాలి. ప్రతిగ్రూప్ వాల్యూలో 50% అమౌంట్ బ్యాంకులో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేస్తారు కదా. దానిపై accured Interest ను కూడా లెక్కలోకి తీసుకోవాలి. ఆయా బ్యాంకులనుంచి సంవత్సరానికి వర్తించే వడ్డీ విషయమై స్టేట్‌మెంట్ తీసుకోవాలి. ఉదా: GCS/A1 Group కు 25 నెలలకు రు.50,000/-లు డిపాజిట్ చేసారు. దీనిపై ఏడాదికి 12% ఇంట్రస్ట్ చొప్పున Maturity Value రు.64,000/- అవుతుంది. అంటే 25 నెలలకు డిపాజిట్‌పై వచ్చే వడ్డీ రు.14,000/- అయితే ఆ సంవత్సరానికి ఎంత అనేది బ్యాంకునుంచి కన్‌ఫర్మేషన్ స్టేట్‌మెంట్ పొందాలి. ఇలా ఎన్ని బ్యాంకులలో డిపాజిట్ చేసారో అన్ని బ్యాంకుల నుంచి స్టేట్‌మెంట్ తీసుకోవాలి. తరువాత ఈ కింది విధంగా జనరల్ ఎంట్రీ పాస్ చేసుకోవాలి.

| Date | L.F. | Particulars | Debit | Credit |
|---|---|---|---|---|
| | | Fixed Deposits A/C Dr. | xxx | |
| | | To Interest A/C | | xxx |

ఈ బ్యాంకు డిపాజిట్‌పై బ్యాంకు వారు మన తరపున Income Tax TDS Deduction చేసినప్పుడు ఈ కింది విధంగా చూపాలి.

| Date | L.F. | Particulars | Debit | Credit |
|---|---|---|---|---|
| | | Income Tax TDS A/C Dr. | xxx | |
| | | To Fixed Deposit A/C | | xxx |

ఒక చిట్ గ్రూపులో ఒక సభ్యుడు చేరి కొన్ని నెలలు ఇన్‌స్టాల్‌మెంట్స్ కట్టి తర్వాత అనివార్య పరిస్థితులవల్ల కట్టలేక మానుకోవలసివస్తే ఆ సభ్యుడు కంపెనీకి కట్టిన అమౌంట్ నుంచి కంపెనీ కమీషన్ అయిన 5% తగ్గించి మిగిలింది మాత్రమే చెల్లిస్తారు. ఇలాంటివి కూడా కంపెనీ ఆదాయం కిందకే వస్తాయి.

ఇప్పటి వరకూ కంపెనీ ఆదాయాల గురించి చర్చించుకున్నాం. ఇక కంపెనీ ఖర్చుల గురించి తెలుసుకుందాం. చిట్‌ఫండ్స్ కంపెనీలలో ఎక్స్‌పెండిచర్‌కు సంబంధించి అతి ముఖ్యమైనది ఏజెంట్ కమీషన్. కంపెనీ ఆదాయమనేది వివిధ గ్రూపులలో సభ్యులు చేరడంపై ఆధారపడి ఉంటుంది. సభ్యులను మొబలైజ్ చేసేందుకు, చిట్‌లలో చేరితే కలిగే లాభాలను వివరించేందుకు కంపెనీ తరపున కొంతమందిని నియమించుకుంటూరు. ఈ ఏజెంట్లకు కమీషన్ ఇవ్వాల్సి ఉంటుంది. వారు చేసిన బిజినెస్ మీద 1% గాని, 2%గాని కంపెనీ పే చేస్తుంది ఉదా: ఒక ఏజెంట్ లక్ష రూపాయల చిట్‌లకు ముగ్గురు వ్యక్తులను సభ్యులుగా కంపెనీలో చేర్పించాడనుకుందాం. అతని మొత్తం బిజినెస్ మూడు లక్షలు. 1% చొప్పున రు.3000/-లు ఆ ఏజెంట్‌కు కంపెనీ చెల్లిస్తుంది. ఏజెంట్స్ అందరికి ఇదే పద్ధతి వర్తిస్తుంది. కమీషన్ ఎంత పర్సెంటేజి అనేది ముందుగానే

మాట్లాడుకుంటారు. కంపెనీ ఏజెంట్లకు చెల్లించే కమీషన్ అమౌంట్‌ను ఏజెంట్స్ కమీషన్ అనే హెడ్ ఆఫ్ ఆకౌంట్ కింద నమోదు చేస్తారు.

మిగతా ఖర్చులన్నీ ఇంతకు ముందు అధ్యయనం చేసినట్లుగానే ఉంటాయి. ఆఫీస్‌రెంట్, ఎలక్ట్రిసిటీ, టెలిఫోన్ వగైరా ఖర్చులన్నీ మామూలే. పార్టనర్‌షిప్ ఫరంలోనైతే - పార్టనర్‌లకు ఇచ్చే జీతాలను పార్టనర్స్ శాలరీస్ లేదా పార్టనర్స్ రెమ్యూనలేషన్ అన్ హెడ్స్‌లో చూపేవాళ్ళం. అయితేప్రస్తుతం దీనిని డైరెక్టర్స్ రెమ్యూనరేషన్ చూపడం జరుగుతోంది. పార్టనర్ పెట్టిన పెట్టుబడిపై ఇంటరెస్ట్ ప్రొవిజన్ కూడా ఉంటుంది. అదనంగా వచ్చే మరికొన్ని హెడ్ ఆఫ్ అకౌంట్‌లను పరిశీలిద్దాం.

A) *SPecial Addesive Stamps A/C*

Chit Group లో చేరే ప్రతి సభ్యుని వద్ద నుంచి అప్లికేషన్ ఫారమ్ తీసుకుంటారు. దానిపై స్టాంపు అంటించి ఫైల్ చేస్తారు.

B) Legal & Professional Expenses

సభ్యులు కంపెనీకి చెల్లించాల్సిన ఇన్‌స్టాల్‌మెంట్స్ చెల్లించనప్పుడూ, డిఫాల్టర్ అయినప్పుడు లాయర్‌ను సంప్రదించి కేసు ఫైల్ చేయించడానికి అయ్యే ఖర్చులు ఈ హెడ్ ఆఫ్ అకౌంట్ కింద రాయాలి.

C) Directors Sitting Fee A/c

Directors Genetral Body Meeting Conduct చేసినప్పుడు గాని లేదా మరే యితర సమావేశాలు నిర్వహించినప్పుడుగాని పాల్గొన్న డైరెక్టర్స్‌కు కొంత

అమౌంట్ చెల్లిస్తారు. ఇటువంటి వాటిని హెడ్ ఆఫ్ అకౌంట్ కింద రాయాలి. కంపెనీ స్థాయిని అనుసరించి మరికొన్ని హెడ్ ఆఫ్ అకౌంట్‌లు కూడా ఉంటాయి.

ఈ విధంగా సంవత్సరమంతా అకౌంట్స్ రాసిన తరువాత ప్రతి ఏడాదీ 31వ తేదీకి అకౌంట్స్ బుక్స్ క్లోజ్ చేసే ముందు మరికొన్ని ఎంట్రీస్ పాస్ చేయాల్సి ఉంది. అవి:-

1. చిట్ గ్రూప్‌లోని సభ్యులు ఆ సంవత్సరాంతానికి అప్పటి వరకూ చెల్లించాల్సిన చిట్ ఇన్‌స్టాల్‌మెంట్స్ చెల్లించక కొంత పెండింగ్ ఉన్నట్లయితే ఏ గ్రూపుకా గ్రూపు ప్రకారం ఈ కింది విధంగా జనరల్ ఎంట్రీ పాస్ చేయాలి. Ex:-GCS/A1 లో T.No. 16 దాఖలా రు. 5,200/-, T.No.21 దాఖలా రు. 4,350/-, T.No.24 దాఖలా రు.6,100/- ఈ అమౌంట్స్ వసూలు కావలసి ఉంది. వీటి మొత్తం కలిపితే రు.15,650/-. దీనిని

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Subscriptions to be received A/C Dr. | 15,650 | |
| | | To GCS/A1 A/C | | 15,650 |

అలాగే - ఆ సంవత్సరానికి కాకుండా రాబోయే సంవత్సరానికి సంబంధించి ఇన్‌స్టాల్‌మెంట్ గాని లేదా కొంత అమౌంట్ గాని ముందుగా వసూలై ఉన్నట్లయితే, మరియు వచ్చే సంవత్సరంలో ప్రారంభం కాబోయే గ్రూపునకు సంబంధించి పేమెంట్స్ సంబంధిత సంవత్సరం అకౌంట్ బుక్‌లో నమోదై ఉంటే - అవి GCS A లోనే రూ. [illegible] గా ఉన్నాయనుకున్నట్లయితే దానిని -

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | (GCS/A1 Group) | | |
| | | Subscriptions A/C | 3,500 | |
| | | To Adv. Sub. A/C | | 3,500 |
| | | (Advance Sub. recd.) | | |

ఇక్కడ మరో విషయం - GCS/A1 Group ఆరు నెలలు నడిచిన తర్వాత గ్రూపు సభ్యులలో ఇద్దరు తాము చెల్లించిన రు.10,000/-లను తిరిగి ఇచ్చేయమని సభ్యత్వాన్ని రద్దు చేయమని కోరితే ఆ అమౌంట్‌ను పెండింగ్‌లో ఉంచి వారి స్థానంలో మరో ఇద్దరిని చేర్చుకుని గ్రూపును కంటిన్యూ చేశారనుకుందాం. అప్పుడు ఈ పెండింగ్ అమౌంట్‌ను ఈ కింది విధంగా చూపాలి.

| Date | L.F. | Particulars | Debit | Credit |
|---|---|---|---|---|
| | | GCS/A1 A/c Dr. | 10,000 | |
| | | To Suspense Sub. A/c | | 10,000 |

ఈ విధంగా అకౌంట్స్ నిర్వహించే చిట్ ఫండ్ కంపెనీ స్థాయిని బట్టి పలురకాల హెడ్ ఆఫ్ అకౌంట్స్ కింద అన్ని ట్రాన్సాక్షన్స్ పూర్తి చేస్తూ అకౌంట్ రాయడం పూర్తిచేయాలి.

ఈ విధముగా వ్రాసుకొంటూ ఫైనలైజేషన్ ఎంట్రీస్ కూడా తయారు చేయాలి. యిది Single Coloum Cash వాడడంలో యింతకుముందు వేసుకొన్న తరువాత ట్రైల్ బ్యాలెన్సును నేర్చుకొన్న మాదిరిగానే ఉంటుంది. పెద్ద తేడా లేమీ ఉండవు.

ది. 31-3-2001వ తేదీ నాటికి గౌతమి చిట్ ఫండ్స్ (ప్రై) లిమిటెడ్ వారి అంకణా ఈ క్రింది విధముగా ఉన్నది.

| PARTICULARS | Debit | Credit |
|---|---|---|
| Share Capital | | 10,00,000 |
| Share Application Money | | 1,00,000 |
| Fixed Deposits | 6,75,000 | |
| Telephone Deposit | 13,000 | |
| Furniture & Fixtures | 29,250 | |
| A.C. Mechine | 26,250 | |
| Computer | 58,500 | |
| Scooter | 30,400 | |
| Maruti Car | 2,04,000 | |
| Typewriter | 5,400 | |
| Car Finance | | 1,70,000 |
| Commissions | | 5,50,000 |
| Dividend on own chits | | 95,000 |
| Int. received on Security Deposits | | 65,000 |
| Other Income | | 6,000 |
| Subscription to be received | 6,15,000 | |
| Bid payable | | 2,00,000 |
| Company own chits | | 4,10,000 |
| Liability on forfeited chits | | 55,000 |
| Advance subscriptions | | 25,000 |

| PARTICULARS | Debit | Credit |
|---|---|---|
| Provision for Expenses | | 10,000 |
| Preliminary Expenses | 7,650 | |
| Income Tax TDS | 10,500 | |
| Printing & Stationery | 27,400 | |
| Preliminary Ex. written off | 850 | |
| Rent | 60,000 | |
| Salaries & Other Benefits to Staff | 1,25,000 | |
| Directors Remmunaration | 90,000 | |
| Agents Commission | 2,55,000 | |
| Advertisement | 65,850 | |
| Electricity Charges | 16,000 | |
| Staff Welfare Exp. | 21,500 | |
| Office Maintenence | 23,500 | |
| Travelling | 18,500 | |
| Conveyances | 11,250 | |
| Vehicle Maintenance | 32,500 | |
| Telephone Charges | 12,500 | |
| Spl Adhesive stamps | 20,500 | |
| Bank commission | 3,400 | |
| Interest | 24,500 | |
| Sundry expenses | 2,200 | |
| Posts / Telegrams | 8,400 | |
| Legal & Professional Exp. | 21,000 | |
| Audit Fee | 10,000 | |
| Chit Regn. Exp. | 4,000 | |
| Miscelleaneous exp. | 3,500 | |
| Depreciation | 77,700 | |
| State Bank of India | 45,500 | |
| Cash on hand | 30,500 | |
| | 26,86,000 | 26,86,000 |

GOWTHAMI CHIT FUNDS (P) LTD., VIJAYAWADA

BALANCE SHEET AS ON 31-03-2001

| Particulars | | Annexure | As on 31-3-2000 | As on 31-3-2001 |
|---|---|---|---|---|
| SOURCES OF FUNDS: | | | | |
| a) Own Funds | | I | xx | 10,00,000 |
| (Share Capital) | | | | |
| b) Loan Funds | | | xx | 1,00,000 |
| Application Money | | | | |
| TOTAL | | | | 11,00,000 |
| APPLICATION OF FUNDS: | | | | |
| a) Fixed Assets | | II | | |
| Gross Block | 4,31,500 | | | |
| Less Dep. | 77,700 | | xx | 3,53,800 |
| b) Excess of Current Assets | | III | | |
| over Current Liabilities | | IV | | |
| Current Assets | 13,89,500 | | | |
| Less Curr. L a. | 8,70,000 | | xx | 5,19,500 |
| Preliminary Expenses | | A | xx | 7,650 |
| Profit & Loss A/C | | | xx | 2,19,050 |
| TOTAL | | | xx | 11,00,000 |

GOWTHAMI CHIT FUNDS (P) LTD., VIJAYAWADA

Profit & Loss Account for the year ended with 31st March, 2001

| Particulars | Annexure | As on 31-3-2000 | As on 31-3-2001 |
|---|---|---|---|
| INCOME | | | |
| Commission on Chits | | xx | 5,50,000 |
| Dividend on own Chits | | xx | 95,000 |
| Interest on Chit Security Dep. | | xx | 65,000 |
| Other Income | | xx | 6,000 |
| TOTAL (1) | A | xx | 7,16,000 |
| EXPENDITURE | | | |
| Salaries & Other Benefits to Staff | | xx | 1,25,000 |
| Agents Commission | | xx | 2,55,000 |
| Preliminary Expenses Written off | | xx | 850 |
| Directors Remuneration | | xx | 90,000 |
| Depreciation | | xx | 77,700 |
| Other Expenses | | xx | 3,86,500 |
| TOTAL (2) | B | xx | 9,35,050 |
| Net Loss (II - I) | | xx | 2,19,050 |
| Net Loss Brought forward | | | NIL |
| Net Loss transferred to Balance Sheet | | xx | 2,19,050 |

GOWTHAMI CHIT FUNDS (P) LTD., VIJAYAWADA

Schedules forming part of Profit & Loss Account

| Particulars | Annexure | As on 31-3-2000 | As on 31-3-2001 |
|---|---|---|---|
| *Schedule 'A' Preliminary Expenses:* | | | |
| Regn. Fee | | xx | 2,000 |
| Stamping | | xx | 500 |
| Travelling Exp. | | xx | 2,500 |
| Printing | | xx | 1,500 |
| Audit Fee | | xx | 2,000 |
| Total | | xx | 8,500 |
| *Schedule 'B' Other Expenses :* | | | |
| Rent | | xx | 60,000 |
| Stationery | | xx | 27,400 |
| Advertisement | | xx | 65,850 |
| Interest | | xx | 24,500 |
| Telephone Charges | | xx | 12,500 |
| Electricity Charges | | xx | 16,000 |
| Vehicle Maintenance | | xx | 32,500 |
| Legal & Professional Expenses | | xx | 21,000 |
| Office Maintenance | | xx | 23,500 |
| Bank Commission | | xx | 3,400 |

| | | |
|---|---|---|
| Spl. Adhesive Stamps | xx | 20,500 |
| Chit Regn. Exp. | xx | 4,000 |
| Audit Fee | xx | 10,000 |
| Postage & Telegrams | xx | 8,400 |
| Staff Welfare | xx | 21,500 |
| Travelling Expenses | xx | 18,500 |
| Conveyance | xx | 11,250 |
| Sundry Expenses | xx | 2,200 |
| Miscellaneous | xx | 3,500 |
| | | 3,86,500 |

ANNEXURE FORMING PART OF BALANCE SHEET

| | |
|---|---|
| Authorised Capital | |
| 20,000 Equity shares of | |
| Rs. 100/- each | 20,00,000 |
| *Issued Capital* | |
| 10,000 Equity Shares of | |
| Rs. 100/- each | 10,00,000 |
| *Subscribed & Paidup Capital* | |
| 10,000 Equity Shares of | |
| Rs. 100/- each fully paid-up | 10,00,000 |

By the order of the board

## ANNEXURE II FIXED ASSETS

| Name of Asset | % | WDV 1-4-2000 | Additions | Total | Amount of Dep. | W.D.V 31-3-2001 |
|---|---|---|---|---|---|---|
| Furniture | 10 | - | 32,500 | 32,500 | 3,250 | 29,250 |
| A.C.Machine | 25 | - | 35,000 | 35,000 | 8,750 | 26,250 |
| Computer | 10 | - | 65,000 | 65,000 | 6,500 | 58,500 |
| Scooter | 20 | - | 38,000 | 38,000 | 7,600 | 30,400 |
| Car | 20 | - | 2,55,000 | 2,55,000 | 51,000 | 2,04,000 |
| Typewriter | 10 | - | 6,000 | 6,000 | 600 | 5,400 |
| Total | | | 4,31,500 | 4,31,500 | 77,700 | 3,53,800 |

## ANNEXURE III CURRENT ASSETS

| Particulars | As on 31-3-2000 | As on 31-3-2001 |
|---|---|---|
| Telephone Deposit | xx | 13,000 |
| Fixed Deposits (Pledged as Security to Registrar of Chits) | xx | 6,75,000 |
| Subscriptions to be received | xx | 6,15,000 |
| Income Tax Deduction at source | xx | 10,500 |
| State Bank of India | xx | 45,500 |
| Cash on hand | xx | 30,500 |
| | | 13,89,500 |

ANNEXURE IV CURRENT LIABILITIES & PROVISIONS

| Particulars | As on 31-3-2000 | As on 31-3-2001 |
|---|---|---|
| Subscription received in advance | xx | 25,000 |
| Bid-Payable | xx | 2,00,000 |
| Liability on Co-own Chits | xx | 4,10,000 |
| Forfieted chits | xx | 55,000 |
| provisions for Expenses | xx | 10,000 |
| Car Finance | xx | 1,70,000 |
| | | 8,70,000 |

## NON TAXABLE ITEMS

## పన్ను పోటు లేని వస్తువులు

వ్యాపారానికి సంబంధించిన సమస్త వస్తువులనూ షెడ్యూల్స్ కింద విభజించారు. పన్ను విధించే వస్తువులనూ, పన్ను తగ్గించే వస్తువులనూ, పన్ను నుంచి మినహాయింపు యిచ్చే వస్తువులనూ తేలికగా గుర్తించేందుకుగాను వాటిని వివిధ కేటగిరీల కిందకు చేర్చారు. ఏ ఏ వస్తువులు ఏ ఏ షెడ్యూల్సు కిందకు వస్తాయో వాణిజ్య పన్నుల శాఖవారు వివరంగా మనకు తెలియజేస్తారు. గవర్నమెంటు జివో ప్రకారం అప్పుడప్పుడూ షెడ్యూల్సులోని వస్తువులు, వాటికి విధించే పన్ను శాతం తదితరాలు మారుతూ ఉండవచ్చు. ఈ వివరాలు కావలసివస్తే సంబంధిత అధికారులను సంప్రదించవచ్చు.

కొన్ని షెడ్యూల్సులోని వస్తువులకు పన్నుశాతం అధికంగా ఉంటుంది. మరికొన్నింటికి తక్కువగా ఉంటుంది. ఈ నిర్దిష్ట వస్తువులకు నిర్ణీత పన్ను సకాలంలో వాణిజ్యపన్ను శాఖ వారికి చెల్లించాల్సి ఉంటుంది. కాగా, నాలుగో షెడ్యూలులోని వస్తువులకు పన్ను నుంచి పూర్తిగా మినహాయింపు ఇచ్చారు. అంటే ఈ షెడ్యూలులోని వస్తువులకు అసలు పన్ను చెల్లించనవసరం లేదు.

ఇప్పుడు నాలుగో షెడ్యూలులోని వస్తువుల గురించి తెలుసుకుందాం. వీటిని Non Taxable Items అంటారు.

1. Salt ( ఉప్పు )
2. Electrical Energy ( విద్యుచ్ఛక్తి )
3 Cloths ( వస్త్రాలు )
4. Text & Note Books ( పాఠ్య గ్రంథాలు, నోటు పుస్తకాలు )
5. Tobacco ( పొగాకు, చుట్ట బీడి సిగిరెట్ )
6. Water ( సాధారణ నీరు )
7. Sugar ( పంచదార )
8. Sugar Cane ( చెరకు )
9. తాటికల్లు, సారా
10. కందిపొట్టు

ఇవి గాక మిగతా షెడ్యూల్సులోని కొన్ని రకాల వస్తువులకు పన్ను నుంచి పూర్తిగా మినహాయింపు ఇచ్చారు. వీటికి కూడా పన్ను చెల్లించనవసరంలేదు.

# కోల్డ్ స్టోరేజ్ (COLD STORAGE)

పరిచయం:

రైతులకు చెందిన వ్యవసాయ ఉత్పత్తులను, ఇతర ఆహార పదార్థాలను కోల్డ్ స్టోరేజి యూనిట్లలో భద్రపరుస్తారు. రైతులకు ఈ యూనిట్లు అధికంగా ఉపయోగపడతాయి. రైతులు తాము పండించిన పంటలు తమ ఇళ్ళ వద్ద అట్టే పెట్టుకోవాలంటే వాతావరణ పరిస్థితుల ప్రభావం ఆ పంటలపై పడి నష్టపోయేందుకు అవకాశముంది. కనుక వారు కోల్డ్ స్టోరేజి యూనిట్లను ఆశ్రయిస్తారు. శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానంతో రూపొందించిన ఈ యూనిట్లలో వ్యవసాయోత్పత్తులు, తదితర వస్తువులు నిర్దిష్ట కాలపరిమితిలో నిల్వ ఉంచుతారు. వాణిజ్య పంటలను ఇక్కడ స్టోరేజి చేస్తారు. బహిరంగ మార్కెట్‌లోని వ్యాపారావకాశాలను బట్టి రైతులు ఇక్కడ నుంచి వారి పంటలను మార్కెట్లకు తరలిస్తుంటారు. భద్రపరిచే సరుకును బట్టి, నిల్వ ఉంచాల్సిన కాలపరిధిని బట్టి కోల్డ్‌స్టోరేజి యూనిట్‌దారులు రైతుల నుంచి రుసుము వసూలు చేస్తారు. ఇదీ వ్యాపారం!

కోల్డ్ స్టోరేజి యూనిట్ దారుల రిసీప్టులు, పేమెంట్లను అనుసరించి అకౌంట్సు సాగుతాయి. ప్రధానంగా ఇక్కడ జరిగే వ్యవహారం స్టాకుకు సంబంధించినది కాబట్టి స్టాక్ రిజిష్టరు పూర్తి వివరాలతో మెయిన్‌టెయిన్ చేయాల్సి ఉంటుంది. అకౌంట్స్ రాసేటప్పుడు, జమలు, ఖర్చులు మామూలుగానే ఉంటాయి.

ప్రత్యేకంగా ఇందులో డామేజ్‌కి చెందిన Head of Account వస్తుంది. అంటే - సరుకు స్టోరేజి యూనిట్‌లో భద్రపరిచిన తర్వాత - కాలక్రమేణా - ఏ కారణాల వల్లనైనా సరుకుకు తరుగుదల వస్తే యూనిట్‌దారులు రైతులకు నష్టపరిహారం ఇచ్చుకోవలసి ఉంటుంది. దీనికి సంబంధించిన వ్యవహారాలను Damage అనే Head of Account కింద చూపుతారు. ఈ నష్ట పరిహారం ఎంత అనేది సరుకు విలువను బట్టి, తరుగుదల స్థాయిని బట్టి ఉంటుంది. అందుకనే పూర్తి వివరాలతో స్టాకు రిజిష్టరును మెయింటెయిన్ చేస్తారు. అలాగే సరుకు ఎంతకాలం నిల్వ ఉంచాలో వివరాలతో అగ్రిమెంట్ కూడా రాసుకుంటారు. రైతులు తమ సరుకును తిరిగి తీసుకువెళ్ళినపుడు స్టోరేజిదారులకు రుసుము చెల్లిస్తుంటారు. కొన్ని సందర్భాలలో ముందుగానే బిల్లు పే చేస్తుంటారు. ఇవన్నీ జాగ్రత్తగా గమనిస్తూ అకౌంట్స్ రాసుకుంటూ వెళ్ళాలి.

నిల్వ చేయడానికి సరుకు వచ్చినప్పుడు ఆ సరుకు నాణ్యతను స్టోరేజి దారులు పరిశీలిస్తుంటారు. ఎందుకంటే నాణ్యత బాగ కొరవడిన సరుకు ప్రభావం ఇతర సరుకులపై పడి నష్టాలకు అస్కారం ఏర్పడుతుంది. కాబట్టి అందుకని నాణ్యతను నిర్ణయించేందుకు వారు లాబ్‌టెస్టులు చేయిస్తుంటారు. ఖర్చులు వారే భరిస్తారు. నాన్‌వెజిటబుల్స్‌కు సంబంధించిన వాటికి తప్పనిసరిగా లాబ్‌టెస్ట్ చేయిస్తారు. ఈ ఖర్చులను Lab Fees అనే Head of Account కింద పేర్కొంటారు.

మిగతా జమలు ఖర్చులు సందర్భానుసారంగా ఉంటాయి. ఇవన్నీ మిగతావాటి మాదిరిగానే ఉంటాయి. అక్కడ జరిగే Transactions ను బట్టి Head of Accounts కేటాయించుకుని తదనుగుణంగా అకౌంట్స్ రాయడమే.

ఈ కోల్డ్ స్టోరేజికి సంబంధించిన అకౌంట్స్ కొత్తగా రాస్తున్న వారైతే వ్యాపార లావాదేవీలను, జరిగే తీరుతెన్నులనూ ఒకసారి శ్రద్ధగా గమనించి, లెక్కల పుస్తకాలను ప్రత్యక్షంగా చూసి వివరాలు తెలుసుకోవాలి. ఇలా చేస్తే ఎంతో ప్రయోజనం కలుగుతుంది.

## వర్క్‌షాపులు (WORK SHOPS)

ఈ వర్క్ షాపుల్లో కూడా అమ్మకాలు, కొనుగోళ్ళు ఉండవు. ఇక్కడ ప్రధానమైన రాబడి Job Work Collections. వర్క్ షాపుల్లో ముఖ్యమైన Automobile Engineering పై దృష్టి సారిద్దాం.

వర్క్‌షాపు నడిపేందుకు Sales Tax లైసెన్సు పొందనవసరం లేదు. Income Tax పరిధిలోకి వస్తుంది. మోటారు ఇంజన్లు (ట్రక్కు, కారు, జీప్ మొ.) రిపేరు చేయడం ద్వారా ఆదాయం వస్తుంది. దీనిని JoB Work Bill Book ద్వారా Bills రాసి JoB Work Collections అనే Head of Account కి Credit చేసుకోవాలి. ఖర్చులలో ముఖ్యమైనది Work Shop Maintenance A/C. దీనిలో వర్క్‌షాపు నిర్వహణకు కావలసిన వాటి ఖర్చులన్నీ వస్తాయి. అంటే ఇంజన్లు రిపేరు చేసేటప్పుడు వాడే గ్రీజు, కిరోసిన్, ఇంజన్‌ఆయిల్ మొదలైన వాటితో పాటు క్లినింగ్ పర్పస్‌కై పాతగుడ్డలు, సర్ఫు, సోప్స్ వగైరా ఖర్చులన్నీ ఈ హెడ్ కింద రాయాలి. ఖర్చులలో జీతాలు కూడా ఉంటాయి. అంటే వర్క్ షాపులో కొంతమంది హెల్పర్లను నియమించుకోవలసి వస్తుంది. అలాగే టర్నరు, ఫిట్టరు, వెల్డరు వంటి వారు కూడా పనిచేస్తూండవచ్చు. వీరికి ఇచ్చే జీతాలను Wages A/C కింద రాయాలి. వర్కర్లకు Battas ఏ రోజుకారోజు ఇస్తుంటారు. అలా ప్రతి రోజూ

ఇచ్చే Amounts ను Batta A/C కింద రాయాలి. యంత్రాలు, తరుగుదల A/C అని మరొకటి. దీని కింద వర్క్ షాపులో నిత్యం ఉపయోగించుకునే యంత్ర పరికరాలు వివరాలు వాటి ఖర్చు రాయాలి. అలాగే ప్రతి సంవత్సరం యీ యంత్రాలకు తరుగుదల కూడా పేర్కొనాలి. వర్క్ షాపు స్వభావాన్ని స్థాయిని బట్టి షాపులో వెల్డింగ్ మిషన్, లేత్ మిషన్, డ్రిల్లింగ్ మిషన్‌లతో పాటు ప్రత్యేకమైన టూల్స్ కూడా ఉపయోగిస్తుంటారు. వీటన్నింటినే యంత్రాలు ఖాతాకు ఖర్చు వాటిపై తరుగుదలను, తరుగుదల A/C కిందరాయాలి. అలాగే రిపేరింగ్ మెయింటెన్స్ A/C కింద వెల్డింగ్‌లకు ఉపయోగించే Gas, Oxygen, తదితరాలన్నింటినీ ఈ Head కింద రాయాలి. ఇక Electricity A/C అనే Head కింద విద్యుత్ ఖర్చులు రాసుకోవాలి. మిగిలినవన్నీ మామూలే.

2000 - 2001 సంవత్సరానికి కిషోర్ ఆటో మొబైల్ ఇంజనీరింగ్ వర్క్ వారి అంకణా ఈ కింది విధంగా ఉంది. దీనినసరించి ముగింపు లెక్కలు తయారుచేద్దాం.

| Particulars | Debit | Credit |
|---|---|---|
| K. Badrappa Capital | | 2,28,000 |
| Deposits | 48,000 | |
| Machinery | 2,10,000 | |
| Furniture & Fixtures | 13,500 | |
| Job Work Collections | | 5,04,500 |
| Bank A/C | 25,000 | |
| Stationery | 4,200 | |
| Rent | 24,000 | |

| | | |
|---|---|---|
| Salaries | 18,000 | |
| Wages | 1,38,000 | |
| Work Shop Maintenance | 46,540 | |
| Electricity | 54,000 | |
| Telephone Charges | 15,500 | |
| Income Tax | 3,400 | |
| Travelling Expenses | 4,250 | |
| Postage & Telegrams | 1,150 | |
| Subscriptions | 1,560 | |
| Advertisement | 5,500 | |
| Donations | 5,000 | |
| Repairing & Maintenance | 16,500 | |
| Battas | 18,000 | |
| Sadar | 3,400 | |
| Conveyance | 1,500 | |
| Depreciation | 65,000 | |
| Cash on hand | 10,500 | |
| | 7,32,500 | 7,32,500 |

**KRISHNA AUTOMOBILE ENGINEERING WORKS**

**INCOME AND EXPENDITURE ACCOUNT FOR THE YEAR ENDED WITH 31St MARCH, 2001**

| Expenditure | Rs. | Income | Rs. |
|---|---|---|---|
| To Stationery | 4,200 | By Job Work | |
| To Rent | 24,000 | Collections | 5,04,500 |
| To Salaries | 18,000 | | |
| To Wages | 1,38,000 | | |
| To Work Shop Main. | 46,540 | | |
| To Electricity | 54,000 | | |
| To Telephone Charges | 15,500 | | |
| To Income Tax | 3,400 | | |
| To Travelling Exp. | 4,250 | | |
| To P & T | 1,150 | | |
| To Subscriptions | 1,560 | | |
| To Advertisement | 5,500 | | |
| To Donations | 5,000 | | |
| To Repairs & Main. | 16,500 | | |
| To Battas | 18,000 | | |

| | | | |
|---|---|---|---|
| To Sadar | 3,400 | | |
| To Conveyance | 1,500 | | |
| To Depreciation | 65,000 | | |
| To Net Income | 79,000 | | |
| | 5,04,000 | | 5,04,500 |

**BALANCE SHEET AS AT 31ST MARCH, 2001**

| Liabilities | Rs. | Assets | Rs. |
|---|---|---|---|
| Capital | 3,07,000 | Deposits | 48,000 |
| | | Fixed Assets | 2,23,500 |
| | | Bank | 25,000 |
| | | Cash on hand | 10,500 |
| | 3,07,000 | | 3,07,000 |

*Schedules:*

*Deposits*

| | | |
|---|---|---|
| Telephone | 8,000 | |
| Electricity | 30,000 | |
| Oxygen Cylinders | 10,000 | |
| | | 48,000 |

*Fixed Assets:*

| Particulars | Value | % | Deprecia-tion | W.D.V. as on 31-3-2001 |
|---|---|---|---|---|
| Machinery | 2,50,000 | 25% | 62,500 | 1,87,500 |
| Furniture | 25,000 | 10% | 2,500 | 22,500 |
| | 2,75,000 | | 65,000 | 2,10,000 |

*Capital A/c :*

| | Debit | Credit |
|---|---|---|
| Investment | | 2,50,000 |
| Less: Self Drawings | 22,000 | |
| | 22,000 | 2,50,000 |
| | | 22,000 |
| | | 2,28,000 |
| Add: Net Profit | | 79,000 |
| | | 3,07,000 |

# సర్వీసింగ్ సెంటర్స్

ఆటో మొబైల్ సర్వీసింగ్ సెంటర్స్‌లో వాహనాలను వాటర్‌తో క్లీన్ చేసి ఇస్తుంటారు. ఈ యూనిట్లలో కూడా ఆదాయం సర్వీసింగ్ చార్జెస్ ద్వారా వస్తుంది. ఖర్చులలో సర్వీసింగ్ గేరేజి మెయింటినెన్స్ A/C ప్రధానమైనది. వీటిలో Old Cloth, Grease, Mud Oil, Break Oil, Washing Powder, Kerosene, Soaps, etc., ఖర్చులు వస్తాయి. అలాగే Wages, Batas కూడా ఉంటాయి. ఇక్కడే ఉండే మిషన్లు : Vehicle Lifting Machine, Air Pressure, Water Pumping Engine మొదలైనవి. ఈ సర్వీసింగ్ సెంటర్లలో వాడతారు. వీటన్నిటికి తగిన విధంగా ఖర్చులు రాసుకుంటూ ఉండాలి.

# అసోసియేషన్స్

ప్రత్యేక ప్రయోజనాలను ఆశించి కొంతమంది కలిసి ఒక సంఘంగా ఏర్పడతారు. కమిటీని ఎన్నుకుంటారు. ఇందులో ప్రెసిడెంట్, సెక్రటరీ, ట్రెజరర్, కమిటీ మెంబర్స్ ఉంటారు. కమిటీ తరహానుసరించి, అవసరాన్ని బట్టి వైస్ ప్రెసిడెంట్, యాక్టింగ్ ప్రెసిడెంట్, జాయింట్ సెక్రటరి, ఆర్గనైజింగ్ సెక్రటరీ మొదలైన పదవులు కూడా ఉంటాయి. సాధారణ సభ్యుల కమిటీని ఎన్నుకున్న తర్వాత ఆ అసోసియేషన్‌ను రిజిస్ట్రార్ ఆఫ్ సొసైటీస్ కింద రిజిస్ట్రేషన్ చేయించుకుంటారు. సంఘ సభ్యుల అభివృద్ధి కోసం ఈ కమిటీ అనేక కార్యక్రమాలు చేపడుతుంది. ఈ అసోసియేషన్‌లు అనేక రకాలుగా ఉంటాయి. ఉదా: గోల్డ్ మర్చంట్స్ అసోసియేషన్, టింబర్ మర్చంట్స్ అసోసియేషన్, మోటార్ మర్చంట్స్

అసోసియేషన్, పెయింట్స్ మర్చంట్ అసోసియేషన్, పద్మశాలి సేవా సంఘం, ఆర్యవైశ్య సేవా సంఘం, ఇలా పలు రకాలు. ప్రస్తుతం మోటారు మర్చంట్స్ అసోసియేషన్‌ను పరిశీలిద్దాం. మోటారు వ్యాపారానికి సంబంధించిన కొంతమంది మర్చంట్స్ కలిసి గవర్నింగ్ బాడీని అంటే ప్రెసిడెంట్, సెక్రటరీ, ట్రెజరర్, కమిటీ మెంబర్స్‌ను ఏర్పాటుచేసుకుని రిజిస్ట్రార్ ఆఫ్ సొసైటీస్ కింద రిజిస్ట్రేషన్ చేయించుకుంటారు. రిజిస్ట్రేషన్ నెంబరు వస్తుంది. తర్వాత సభ్యుల ప్రయోజనాలను, సంఘ అభివృద్ధిని కాంక్షిస్తూ సర్వసభ్య సమావేశాలు ఏర్పాటు చేసుకుని నిర్ణయాలు తీసుకుని మినిట్స్‌లో తీర్మానాలుగా రాసుకుని తదను గుణంగా కార్యక్రమాలు నిర్వహిస్తుంటారు. అసోసియేషన్ మెయింటెనెన్స్‌కు, పలు కార్యక్రమాలు చేపట్టేందుకు సాధారణ సభ్యుల నుంచి నెలవారీగాగాని సంవత్సరంవారీగా గాని సభ్యత్వ రుసుం అంటూ వసూలు చేస్తారు. విరాళాలు కూడా సేకరిస్తారు అసోసియేషన్‌లకు ఇవే ప్రధానమైన ఆదాయాలు..బాగా అభివృద్ధి చెంది అస్సెట్స్ సంపాదించుకున్నాక అద్దెల రూపంలో కూడా ఇన్‌కం వస్తుంది. బ్యాంకుల్లో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేస్తే వడ్డీలు వస్తాయి. సంఘ ఆదాయ వ్యయాల వివరాలు, గవర్నింగ్ బాడీలో మార్పులూ చేర్పులూ ఉంటే వాటి వివరాలు ప్రతి సంవత్సరం రిజిస్ట్రార్ ఆఫ్ అసోసియేషన్స్‌కు దాఖలు చేయాల్సి ఉంటుంది. ఈ సంఘాలకు చెందిన అకౌంట్స్ పద్ధతులను ఇప్పుడు పరిశీలిద్దాం.

ఈ అసోసియేషన్లలో సాధారణంగా పెట్టుబడి అంటూ ఏమీ ఉండదు సభ్యుల నుంచి వసూలు చేసిన సభ్యత్వ రుసుములు, విరాళాలే వీటికి ఆదాయాలు వీటి నుంచే ఆఫీసు అద్దెలు, సిబ్బంది జీతాలు, స్టేషనరీ, తదితర ఖర్చులుంటాయి సర్వసభ్య సమావేశాల ఖాతా అంటూ ఒక ఖాతా ప్రత్యేకంగా ఉంటుంది. దీనిలో

సమావేశ సమయంలో అయిన ఖర్చులు, అనగా సాదరు, Invitation వగైరా ఈ సందర్భంగా వచ్చిన వసూళ్ళ నుంచి ఖర్చులు పోను డబ్బు మిగిలితే దానిని బ్యాంకులో జమ చేస్తారు. సంవత్సరాంతంలో మొత్తంగా ఆదాయ వ్యయాల లెక్కలు తేల్చి బ్యాలెన్సు షీట్స్ తయారుచేసి జనరల్‌బాడీ మీటింగ్‌లో ఆమోదం పొందుతారు.

కొన్ని Transactions ను పరిశీలిద్దాం:-

1. సభ్యత్వరుసుం ర.నెం.1 to 10 దాఖలా రు. 1000/- వసూలు
2. విరాళాలు ర.నెం.11, 12 దాఖలా రు.4000/- వసూలు
3. సభ్యుల సమావేశం నిమిత్తం డిన్నర్, మొదలైన్ ఖర్చులు రు. 1000/-
4. ఫొటోస్టాట్ ఖర్చులు రు. 50/-
5. గుమస్తా నెలజీతం రు. 1500/-
6. బ్యాంకులో ఫిక్సెడ్ డిపాజిట్ రు. 20,000/-
7. సంవత్సరాంతంలో డిపాజిట్‌లపై వచ్చిన వడ్డీ రు. 2000/-
8. ఫర్నీచర్ కొనుగోలు రు. 5,000/-
9. టెలిఫోన్ చార్జీలు రు. 100/-

పై ఎంట్రీలను క్యాష్‌బుక్‌లో ఇలా రాయాలి.

| Date | Parituclars | Debit | Credit |
|---|---|---|---|
| | Subscriptions A/c | | |
| | By R.No.1-10 | | 1,000 |
| | Donations A/c | | |
| | By Rt. 11 & 12 | | 4,000 |
| | General Body Meeting Exp. | | |
| | To Dinner Expenses | 1,000 | |
| | Stationery A/C | | |
| | To Photostat | 50 | |
| | Salaries A/C | | |
| | To Clerk Salary | 1,500 | |
| | Fixed Deposits A/C | | |
| | To Deposit No. xxx | 20,000 | |
| | Interest A/C | | |
| | By Int. on F.D | | 2,000 |
| | Fixed Deposits A/C | | |
| | To Interest upto xxx | 2,000 | |
| | Furniture & Fixtures A/C | | |
| | To B.No. xxx | 5,000 | |
| | Telephone Charges A/C | | |
| | To as per Voucher | 100 | |

ఈ విధంగా Cash Book లెడ్జరు మెయింటెయిన్ చూస్తూ ది. 31-3-2001 సంవత్సరాంతానికి ఉన్న Trail Balance నుబట్టి Income & Expenditure A/C, Balance Sheet ని తయారుచేద్దాం.

| Date | Pariticulars | Debit | Credit |
|---|---|---|---|
| | Subscriptions | | 99,100 |
| | Donations | | 25,500 |
| | Interest | | 2,100 |
| | Fixed Deposit | 22,100 | |
| | Furniture & Fixtures | 4,500 | |
| | Bank A/C | 16,150 | |
| | Stationery | 1,150 | |
| | Rent | 18,000 | |
| | Salaries | 36,000 | |
| | General Body Meeting Exp. | 14,500 | |
| | News Paper & Periodicals | 850 | |
| | Telephone Charges | 3,210 | |
| | Sadar | 1,135 | |
| | Conveyance | 960 | |
| | Audit Fees | 2,000 | |
| | Miscellaneous | 1,295 | |
| | Depreciation | 500 | |
| | Cash on hand | 4,350 | |
| | | 1,26,700 | 1,26,700 |

INCOME & EXPENDITURE FOR THE YEAR ENDED WITH 31St MARCH, 2001

| Particulars | Debit | Credit |
|---|---|---|
| *INCOME:* | | |
| Subscriptrions | 99,100 | |
| Donations | 25,500 | |
| Bank Interest | 2,100 | |
| | | 1,26,700 |
| *EXPENDITURE :* | | |
| Stationery | 1,150 | |
| Rent | 18,000 | |
| Salaries | 36,000 | |
| Gen.Body Meeting Exp. | 14,500 | |
| Paper & Periodicals | 850 | |
| Telephone Charges | 3,210 | |
| Sadar | 1,135 | |
| Conveyance | 960 | |
| Audit Fees | 2,000 | |

| | | | |
|---|---|---|---|
| Miscellaneous | 1,295 | | |
| Depreciation | 500 | | |
| | | 79,600 | |
| Net Income Transferred to Capital Fund A/C | | 47,100 | |
| TOTAL | | 1,26,700 | 1,26,700 |

**BALANCE SHEET AS AT 31St MARCH, 2001**

| Labilities | Rs. | Assets | Rs. |
|---|---|---|---|
| Capital Fund | 47,100 | Bank Fixed Deposits | 22,100 |
| | | Furniture & Fix | 4,500 |
| | | Cash at Bank | 16,150 |
| | | Cash on hand | 4,350 |
| | 47,100 | TOTAL | 47,100 |

Note: Balance Sheet లో ఉన్న Items ని మాత్రమే Next Year A/C Book లోకి Carry Forward చేసుకోవాలి.

## ప్రొఫెషనల్ అకౌంట్స్ :

అకౌంటింగ్ విధానాలను ప్రధానంగా ట్రేడింగ్, నాన్ ట్రేడింగ్, ప్రొఫెషనల్స్, మాన్యుఫ్యాక్చరింగ్ అని నాలుగు రకాలుగా విభజించినట్లు గత పాఠాల్లో చెప్పుకున్నాం. ప్రస్తుతం ప్రొఫెషనల్స్‌కు సంబంధించిన అకౌంటింగ్ విధానం గురించి తెలుసుకుందాం.

డాక్టర్లు, యాక్టర్లు, లాయర్లు, చార్టెడ్ అకౌంటెంట్లు, పలు రకాల కన్సల్‌టెంట్స్ మొదలైన వృత్తికి చెందిన వారంతా ఈ ప్రొఫెషనల్స్ అకౌంట్స్ పరిధిలోకి వస్తారు. వీరందరూ ప్రధానంగా డబుల్ ఎంట్రీ పద్ధతిలో అకౌంట్లు నిర్వహిస్తుంటారు. ఈ వృత్తిదారులకు చెందిన అకౌంట్స్ ముఖ్యంగా రిసీప్ట్స్ అండ్ పేమెంట్స్ అకౌంట్లుగా ఉంటాయి. అంటే వసూళ్ళు, చెల్లింపులు ముఖ్యమైన స్థానాలను ఆక్రమిస్తాయి. వస్తువులు కొనడం, అమ్మడం, అరువు అమ్మకాలు తదితర వ్యవహారాలేవీ ఉండవు. ఉదాహరణకు డాక్టర్‌కు సంబంధించిన అకౌంట్ ఎలా ఉంటుందో పరిశీలిద్దాం.

ఆస్పత్రుల ఆదాయల (Receipts) లో ప్రధానమైనవి. Fees Collections. ఇవి ఆస్పత్రి తరహానుసరించి ఉంటాయి. ఆస్పత్రిలో డాక్టరు కేవలం

కన్సల్టింగ్ ఫిజీషియన్ అయితే వచ్చే ఫీజులను Consulting Fee A/C అనే Head of Account కింద చూపాలి. నర్సింగ్ హోమ్ అయితే చెకప్‌కు Fee Collection for outpatients A/C అనే Head గానూ ఆస్పత్రిలో ట్రీట్‌మెంటు నిమిత్తమై నాలుగైదు రోజులుండేటట్లయితే వాటిని Fees Collection from In-Patients A/C అనే హెడ్‌గానూ ఫీజు వివరాలు రాసుకోవాలి. పేమెంట్ విషయానికి వస్తే - 1. Hospital Medicines అనే Head కింద అకౌంట్స్ రాసుకోవాలి. అంటే అత్యవసర సమయాల్లో వాడే మందులు, సెలైన్, పోలియో డ్రాప్స్, తదితరాలు అన్నీపై Head of A/C కింద రాయాలి. 2. Hospital Maintenance A/C దీని కింద Surgical Items, Boil చేయడానికి ఉపయోగించే గ్యాస్ ఖర్చులు ఆపరేషన్ మరియు ఎమర్జెన్సీ సమయాలలో వాడే ఆక్సిజన్, ఫినాయిల్, సబ్బులు, కలరాఉండలు, థర్మామీటర్లు, సిరెంజిలు, వగైరాలన్నీ రాయాలి. మిగతా ఖర్చులన్నీ మామూలే. ఇంతకు ముందు చెప్పుకున్నట్లు సందర్భానుసారంగా వస్తుంటాయి. ఇవన్నీ ఆస్పత్రిలో జరిగే ఖర్చులను బట్టి ఉంటాయి. కాగా నర్సింగ్ హోమ్‌లు తప్పనిసరిగా Patients Register ను మెయిన్‌టెయిన్ చేయాలి. అదెలాగో పరిశీలిద్దాం.

## Form No. 3-C

### [See Rule - 6F(5)]

### FORM OF DAILY CASE REGISTER

[To be maintained by Practitioners of any system of Medical i.e., Physicians, Surgeons, Dentists, Pathologists, Radiologists, etc.

| Date | S.No. | Patient's Name | Name of Professional Services rendered in General, Consultant, Surgeory, etc. | Fees or Charges for Services Rendered | |
|---|---|---|---|---|---|
| | | | | By Cash Rs. | By Cheque Rs. |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |

Daily Collection పై నమూనాలో చూపి దీనితోపాటుగా యితర వివరాలను గూడా పరిశీలిస్తూ Account Books రాసుకోవాలి.

సుధామయి Nursing Home వారి అంకణా ఆధారంతో వారి ముగింపు లెక్కలను తయారుచేసే పద్ధతిని పరిశీలిద్దాం.

| Parituclars | Debit | Credit |
|---|---|---|
| Capital | | 5,10,000 |
| Deposits | 16,000 | |
| Machinery | 1,87,500 | |
| Furniture & Fixtures | 22,500 | |
| Electrical Fixtures | 11,250 | |
| Car | 2,00,000 | |
| Fee Collections from Outpatients | | 2,60,800 |
| Fee Collections from In-patients | | 2,15,000 |
| Agri.Income | | 29,200 |
| Agrl Land | 1,20,000 | |
| Bank | 25,500 | |
| Stationery | 2,550 | |
| Rent | 48,000 | |
| Salaries | 96,000 | |
| Electricity Charges | 24,500 | |
| Telephone Charges | 18,000 | |
| Hospital Medicines | 25,500 | |

| | | |
|---|---|---|
| Hospital Maintenances | 31,500 | |
| News Papers & Periodicals | 3,500 | |
| Donations | 5,000 | |
| Advertisement | 5,500 | |
| Car Maintenance | 27,500 | |
| Taxes & License | 3,100 | |
| Income Tax | 4,2[illegible]0 | |
| Refreshments | 4,1[illegible] | |
| Conveneyance | 2,[illegible]00 | |
| Subscriptions | 1,850 | |
| Sundry Expenses | 2,300 | |
| Miscellaneous | 1,050 | |
| Depreciation | 1,18,750 | |
| Cash on hand | 6,500 | |
| | 10,15,000 | 10,15,000 |

## SUDHAMAYI NURSING HOME

INCOME & EXPENDITURE ACCOUNT FOR THE YEAR ENDED WITH 31St MARCH 2001

| Expenditure | Rs. | Income | Rs. |
|---|---|---|---|
| To Stationery | 2,550 | By | |
| | | Fees Collections: | |
| To Rent | 48,000 | Out Patients | 2,60,800 |
| To Salaries | 96,000 | In Patients | 2,15,000 |
| To Electricity Charges | 24,500 | By Agrl.Income | 29,200 |
| To Telephone Charges | 18,000 | | |
| To Hospital Medicines | 25,500 | | |
| To Hospital Maintenance | 31,500 | | |
| To Paper & Periodicals | 3,500 | | |
| To Donations | 5,000 | | |
| To Advertisement | 5,500 | | |
| To Car Maintenance | 27,500 | | |
| To Taxes & Licences | 3,100 | | |
| To Income Tax | 4,200 | | |
| To Refreshments | 4,150 | | |

| | | | |
|---|---|---|---|
| To Conveyance | 2,800 | | |
| To Subscriptions | 1,850 | | |
| To Sundry Exp. | 2,300 | | |
| To Miscellaneous | 1,050 | | |
| To Depreciation | 1,18,750 | | |
| To Net Income | | 79250 | |
| | 5,05,000 | | 5,05,000 |

SUDHAMAYI NURSING HOME

BALANCE SHEET AS ON 31St MARCH 2001

| Labilities | Rs. | Assets | Rs. |
|---|---|---|---|
| Capital | 5,89,250 | Deposits | 16,000 |
| | | Fixed Assets | 4,21;250 |
| | | Agrl. land | 1,20,000 |
| | | Cash at Bank | 25,500 |
| | | Cash on hand | 6,500 |
| | 5,89,250 | | 5,89,250 |

Schedules:

Deposits :

| | | |
|---|---|---|
| Telephone 2 Nos. | 6,000 | |
| Oxygen Cylinders 2 Nos | 10,000 | 16,000 |

Fixed Assets

| Particulars | Value | Rate of % | Depre-ciation | W.D.V. as on 31-3-2001 |
|---|---|---|---|---|
| Machinery | 2,50,000 | 25% | 62,500 | 1,87,500 |
| Furniture | 25,000 | 10% | 2,500 | 22,500 |
| Electrical & Fixtures | 15,000 | 25% | 3,750 | 11,250 |
| Car | 2,50,000 | 20% | 50,000 | 2,00,000 |
| | 5,40,000 | | 1,18,750 | 4,21,250 |

Capital :

| | |
|---|---|
| Investment | 5,50,000 |
| Less: Self Drawings & LIC Premium | 40,000 |
| | 5,10,000 |
| Add: Net Income | 79,250 |
| | 5,89,250 |

# MED CAL LABS మెడికల్ లాబ్స్

ఈ మెడికల్ లాబ్స్ కూడా సేల్సు టాక్స్ పరిధిలోకి రావు. ఎందుకంటే ఇక్కడ అమ్మకాలు, కొనుగోళ్ళు జరగవు. ఇక్కడ కేవలం Service మాత్రమే జరుగుతుంది. Laboratory Tests ద్వారా రాబడి ఉంటుంది. Blood, Urine analysis తదితర పరీక్షలు ఇక్కడ నిర్వహిస్తారు. ఈ ఆదాయాన్ని Lab Collections అనే Head of Account కింద నమోదు చేయాలి. ఖర్చులలో ప్రధానమైనది Lab Maintenance అనేది. లాబ్ పరీక్షలు నిర్వహించడానికి ఉపయోగించే కెమికల్స్, సిరంజిలు, నీడిల్స్, గ్లాసు, రెగ్యులర్‌గా వాడే ఇతర చిన్న చిన్న వస్తువులు లాంటి ఖర్చులన్నింటిని లాబ్‌మెయింటినెన్స్ అనే Head of Account కింద రాసుకోవాలి. తర్వాత Machinery & Lab Equipments అనే Head పెట్టుకుని లాబ్‌లో ఉపయోగించే Machinery, Microscope and other Lab equipment వగైరాలను దీనికింద చూపి సంవత్సరాంతంలో వీటికి తరుగుదల చూపుతూ లెక్కలు రాయాలి. ఇక మిగతా ఖర్చులన్నీ యధావిధిగా ఉంటాయి. అంటే సిబ్బంది జీతాలు, ట్రావెలింగ్ లేదా ఆస్పత్రులకు వెళ్ళి వచ్చినందుకు కన్వేనియన్స్, ఇతర ఖర్చులన్నీ అన్ని మిగతా అకౌంట్స్‌కు వలెనే ఉంటాయి.

## REAL ESTATE

Real Estate Business లో Land ను Purchase చేసి Plots గా విభజించి Sales చేస్తారు. దీనికి సంబంధించిన అక్కౌంట్స్‌ను పరిశీలిద్దాం. ఈ Real Estate Business చేసేవారు Private Limited Company అనుకుందాం. దీనిని

Entries గురించి తెలుసుకుందాం. ముందుగా భూస్వాములకు కొంత సొమ్ము అడ్వాన్సుగా చెల్లించి భూమిని స్వాధీనం చేసుకుని దానిని పరిశుభ్రం చేయించి ప్లాట్స్‌గా విభజిస్తారు. ఆ ప్లాట్స్ వాయిదాల పద్ధతిలో గాని, ఏకమొత్తంగాగాని చెల్లింపు విధానంతో ధర నిర్ణయించి విక్రయిస్తారు. ఈ విధమైన ప్రక్రియ చాలా వ్యయప్రయాసలతో కూడుకున్నది. అనేక ఖర్చులంటాయి. హంగూ ఆర్భాటం ఈ వ్యాపారంలో ప్రధానపాత్ర వహిస్తాయి.

చూడముచ్చటగా, ఆకర్షణీయంగా, ఆకట్టుకునే విధంగా బ్రోచర్లు ప్రింట్ చేయించాలి. ప్రోత్సాహకాలు ప్రకటిస్తూ ఈ రంగంలో ఇతర వ్యాపారులు ఇవ్వని బెనిఫిట్స్ కల్పిస్తూ పూర్తి వివరాలతో ఈ బ్రోచర్లు తయారు కావాలి. దీనికి ఖర్చు ఎక్కువైనాసరే వెనుకాడకూడదు.

వినియోగదారులకు ప్లాట్స్ ప్రయోజనం గురించి వివరించి చెప్పేందుకు వారిని స్కీమ్‌లలో చేర్పించేందుకు ఏజెంట్లను నియమించుకోవాలి. వారు ఉత్సాహంగా బిజినెస్ చేయాలంటే మంచి కమీషన్ ఇవ్వాలి. దీనితో పాటు ఆకర్షణీయమైన గిఫ్టులు కూడా ఇవ్వాల్సి రావచ్చు.

పార్టీలకు ప్లాట్స్ చూపించడానికిగాను కంపెనీకి సొంతవాహనం ఉండాలి. ఏ వేళప్పుడైనా వినియోగదారులు వారి కుటుంబ సభ్యులు Site చూడాలని కోరవచ్చు. అలాంటి సందర్భాలలో ప్లాట్స్ ఉన్న ఏరియాకు వారిని తీసుకు వెళ్ళేందుకు Vehicle Maintain చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంటుంది.

భూస్వాములనుంచి కొనుగోలు చేసిన భూమిని పరిశుభ్రం చేసి ప్లాట్స్‌గా విభజించాలి. Land Development పేరుతో - చెట్లూ, చేమలు తొలగించి రోడ్లు

వేయడం, ప్లాట్స్‌కి సరిహద్దు రాళ్ళు పాతించడం వగైరా పనులు చేయించాలి.

వ్యాపారం త్వరగా విస్తరించి అభివృద్ధి చెందడానికిగాను ఏజెంట్లతో పాటు బిజినెస్ డెవలప్‌మెంట్ ఆఫీసర్లను నియమించుకోవాలి. బిజినెస్ ప్రమోషన్ కోసం ఎప్పటికప్పుడు కొత్త ప్రణాళికలు వేసుకుంటూ ఫీల్డు వర్కు నిరాటంకంగా కొనసాగేందుకు వీరు కృషిచేస్తూ ఉంటారు. కనుక డెవలప్‌మెంట్ ఆఫీసర్లకు నెల వారీ జీతాలతో, వారు చేసిన వ్యాపారంపై కమీషన్ కూడా ఇవ్వాలి.

ఇవే గాక వ్యాపార ఆకర్షణ కోసం చేపట్టే మరో ముఖ్యమైన అంశం ఉంది. స్కీమ్‌లో చేరిన సభ్యుల పేర్లను లాటరీ తీసి విజేతకు ఒక ప్లాట్ ఉచితం ఇవ్వడం. ఇటువంటివే వ్యాపార సరళిని బట్టి, స్థాయిని బట్టి ఆకర్షక పథకాలు రూపొందించు కోవచ్చు.

Land ను కొనేందుకుగాను భూస్వామికి కొంత సొమ్ము అడ్వాన్సుగా ఇచ్చారనుకుందాం. దానిని

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Land Lord Payments A/c | | |
| | | To Advance | x x x | |

కొనుగోలు చేసిన భూమికి అగ్రిమెంట్ నిమిత్తంగాగాని, Regn. Fee నిమిత్తంగాని Stamp Papers కొనుగోలు చేసినట్లయితే దానిని Regn. & Stamps Account అనే Head కింద రాయాలి.

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Regn. & Stamps A/C | | |
| | | To Purchase of Non- | | |
| | | Judicial Stamp Paper,etc. | x x x | |

కొనుగోలు చేసిన భూమిని ప్లన్ చేయించినందుకు Ground Leveling, Roads Fromation, Marking వగైరాలకు అయిన ఖర్చులను Land Development A/C కింద రాయాలి.

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Land Development A/C | | |
| | | To Land Marking. | | |
| | | Clearing, etc. | x x x | |

తదుపరి Plots వేసి, ధరను నిర్ణయించి దానిని Instalment రూపంలో వసూలు చేస్తున్నప్పుడు అట్టి వసూళ్ళను Collections for Plots లో వ్రాసుకోవాలి.

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Collections for | | |
| | | Plots A/C | | |
| | | By Receipt No. | | 5,000 |

ఈ రకంగా రాసుకుంటూ - ప్లాట్స్ సేలయితే వాటిని Sales of Plots A/C కింద Credit చేసి మళ్ళీ Collection for Plot కి అదే మొత్తాన్ని Debit చేయాలి. ఎందుకంటే ఈ Plot Sales కు సంబంధించిన Amount already Instalment రూపంగా ముందుగా వసూలై ఉంది. గావున,

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Sales of Plots A/C | | |
| | | By Sales of Plot No.xx | | |
| | | To Mr/Mrs.... | | 10,00,000 |
| | | Collection for Plot A/C | | |
| | | To Sale of Plot No. xx | | |
| | | To Mr/Mrs. | 1,00,000 | |

అదే Instalment గా గాక ఒకసారి Plot ఖరీదు చెల్లించినట్లయితే Sale of Plot అనే Head of A/C కింద రాస్తే సరిపోతుంది. అదే Bank Cheque ద్వారా Payment జరిగిందనుకోండి. ఆ Entry ని ఇంతకు ముందు నేర్చుకున్నట్లు Credit వ్రాసిన తరువాత Bank A/C కి Debit వ్రాయాలి. ఈ విధంగానే వ్యాపార విస్తృతిని బట్టి Head of Accounts ఉంటాయి.

కంపెనీలో సభ్యులుగా నమోదు కాబడుటకై ముందుగా కొంత రుసుం చెల్లించాల్సి ఉంటుంది. దానిని Admission Fee అనే Head కి Credit చేయాలి.

*Forfeited Collections :*

కొంతమంది సభ్యులు ముందుగా Plots కొనుక్కుందామనే ఉద్దేశ్యంతో Join అయి 1, 2, Instalments కట్టిన తదుపరి మనస్సు మార్చుకొని రద్దు పర్చుకోవడం జరుగుతుంది. అట్టివి ఏమైనా ఉండి తిరిగి వార్ని చెల్లించనప్పుడు వాటిని Collection Head నుండి ఈ Head of Account కి మార్చుకోవలయును.

ఈ కింద వారి Iswarya Real Estate (P) Limited Co. వారి Trail Balance ను పరిశీలించి దాని నుంచి Profit & Loss A/C, Balance Sheet ను ఎలా తయారుచేయాలో గమనిద్దాం.

## ISWARYA REAL ESTATES (P) LTD.,

TRIAL BALANCE FOR THE YEAR ENDED WITH 31St MARCH, 2001

| Particulars | Debit | Credit |
|---|---|---|
| Share Capital | | 6,00,000 |
| Share Application | | 1,00,000 |
| Collection for Plots | | 13,70,000 |
| Furniture & Fixtures | 42,152 | |
| Air Conditioner | 78,105 | |
| Vehicles | 6,78,750 | |
| Computers | 1,40,505 | |
| Typewriter | 9,367 | |
| Land Lords Payments | 6,00,000 | |

| | | |
|---|---|---|
| Deposits | 25,000 | |
| Regn. & Stamp Papers | 2,05,000 | |
| Building & Site | 2,50,000 | |
| Preliminary & Preoperative Exp. | 18,000 | |
| Admission Fee | | 75,000 |
| Salaries | 1,99,000 | |
| Interest | 2,000 | |
| Travelling & Conveyance | [illegible] 000 | |
| Sales Promotions Exp. | 4[illegible] | |
| Stationery & Printing | 35,500 | |
| Staff Welfare Exp. | 10,400 | |
| Postage & Telegrams | 4,250 | |
| Office Maintenance | 12,500 | |
| Advertisement | 65,000 | |
| Remuneration to Directors | 1,20,000 | |
| Telephone Charges | 22,400 | |
| Electricity Charges | 21,950 | |
| Bank Commissions | 1,800 | |

| | | |
|---|---|---|
| Donations & Charities | 5,000 | |
| Incentives & Gifts | 35,000 | |
| Forfeited Collections | | 25,000 |
| Preliminary Exp. Written off | 2,000 | |
| Commissions Paid to Agents | 1,90,000 | |
| Land Development Expenses | 2,05,000 | |
| Insurance | 9,500 | |
| Miscellaneous | 3,500 | |
| Audit Fee | 15,000 | |
| Land Purchases | 18,25,000 | |
| Sales of Plots | | 22,75,000 |
| Licences & Taxes | 8,500 | |
| Commission Paid in Advance | 1,55,000 | |
| Bonus to Staff | 20,000 | |
| Medical Reimbursement | 5,300 | |
| Books & Periodicals | 4,500 | |
| Provision for Expe. | | 15,000 |
| Chit Fund Companies | | 1,95,000 |

| | | |
|---|---|---|
| Vehicle Finance | | 4,20,000 |
| Bank Over Draft | | 2,24,500 |
| Bank A/C | 25,400 | |
| Depreciation | 88,121 | |
| Cash on hand | 20,500 | |
| | 52,99,500 | 52,99,500 |

## ISWARYA REAL ESTATES (P) LTD.,

TRADING AND PROFIT & LOSS A/C FOR THE YEAR

31St MARCH, 2001

| Expenditure | Rs. | Income | Rs. |
|---|---|---|---|
| Land Purchase | 18,25,000 | Sales of Plots | 22,75,000 |
| Regn & Stamp Papers | 2,05,000 | Other Icomes: | |
| Land Development Exp | 2,05,000 | Admission Fee | 75,000 |
| Salaries | 1,99,500 | Forfeited Collec. | 25,000 |
| Interest | 62,000 | Closing Stock: | |
| Travelling & | | Plots | 7,75,000 |
| Conveyance | 35,000 | | |

| Expenditure | Rs. | Income | Rs. |
|---|---|---|---|
| Sales Promotion Exp. | 45,000 | | |
| Stationery | 35,500 | | |
| Staff Welfare | 10,400 | | |
| Postage & Telegrams | 4,250 | | |
| Office Maintenance | 12,500 | | |
| Advertisement | 65,000 | | |
| Remunerations to Directors | 1,20,000 | | |
| Telephone Charges | 22,400 | | |
| Electricity Charges | 21,950 | | |
| Bank Commission | 1,800 | | |
| Donations & Charities | 5,000 | | |
| Incentives & Gifits | 35,000 | | |
| Preliminary Exp. Written off | 2,000 | | |
| Agents Comm. | 1,90,000 | | |
| Audit Fee | 15,000 | | |
| Insurance | 9,500 | | |
| Miscellaneous | 3,500 | | |

| Expenditure | Rs. | Income | Rs. |
|---|---|---|---|
| Licences & Taxes | 8,500 | | |
| Bonus to Staff | 20,000 | | |
| Medical Reimbursement | 5,300 | | |
| Books & Periodicals | 4,500 | | |
| Depreciation | 88,121 | Net Loss | 1,06,721 |
| | 32,56,721 | | 32,56,721 |

*Schedule for Fixed Assets:*

| Particulars | Value | Rate of % | Depreciation | W.D.V. as on 31-3-2000 |
|---|---|---|---|---|
| Furniture | 45,000 | 6.33% | 2,848 | 42,152 |
| Air Conditioners | 82,000 | 4.75% | 3,895 | 78,105 |
| Vehicles | 7,50,000 | 9.5% | 71,250 | 6,78,750 |
| Computers | 1,50,000 | 6.33% | 9,405 | 1,40,505 |
| Typewriter | 10,000 | 6.33% | 633 | 9,367 |
| | 10,37,000 | | 88,121 | 9,48,879 |

**Note:** **Depreciation** rate (%) ని Companies Act ను బట్టి చూపటం జరిగింది గమనించగలరు.

## ISWARYA REAL ESTATES (P) LTD.,

## BALANCE SHEET AS AT 31St MARCH, 2001

| Labilities | Rs. | Assets | Rs. |
|---|---|---|---|
| Share Capital: | | Fixed Assets | 9,48,879 |
| Authorised One Lakh | | Building & Site | 2,50,000 |
| Equity Shares of | | Currents Assets: | |
| Rs.10/- each | 10,00,000 | Loans & Advances | |
| Issued, Subscribed & | | Closing Stock: | |
| Paidup Capital 60,000 | | Stock of Plots | 7,75,000 |
| Equity Shares of | | Stock of Stationery. | |
| Rs.10/- each | 6,00,000 | Adv. for Land | 6,00,000 |
| Share Appln. Money | 1,00,000 | Adv. Comm. Agen | 1,55,000 |
| Secured Loans | 8,39,500 | Deposits | 25,000 |
| Unsecured Loans | 13,70,000 | Cash at Bank | 25,400 |
| Provision for Exp. | 15,000 | Cash on hand | 20,500 |
| | | Preliminary Exp. | 18,000 |
| | | Net Loss | 1,06,721 |
| | 29,24,500 | | 29,24,500 |

*Secured Loans:*

| | | |
|---|---|---|
| Vehicles Finance | Rs/- 4,20,000 | |
| Chit Fund Companies | Rs/- 1,95,000 | |
| Bank Overdraft | Rs/- 2,24,500 | Rs/- 8,39,000 |

*Unsecured Loans:*

| | |
|---|---|
| Collection for Plots | Rs/- 13,70,000 |

## F NANCE BUS NESS ఫైనాన్స్ బిజినెస్

మంచి లాభాలు తెచ్చిపెట్టే వ్యాపారాలలో ఈ ఫైనాన్స్ బిజినెస్ ఒకటి. ఇది ముఖ్యంగా మోటారు వెహికల్స్‌కు సంబంధించి జరుగుతుంది. ఆటోగాని, టాక్సీగాని, లారీగాని కొనుగోలు చేయాలనుకున్న వినియోగదారుడికి అతని కోరికపై డబ్బు ఇచ్చి తిరిగి వాయిదాల పద్ధతిలో వడ్డీతో సహా వసూలు చేసుకోవడమే ఫైనాన్స్ బిజినెస్. పార్టీకి లోన్ ఇచ్చి నిర్దిష్ట సమయంలో అసలు వడ్డీని కూడా కలిపి అట్టి మొత్తాన్ని కొన్ని నెలలకు సమానంగా విడగొట్టి ఆ ప్రకారం వసూలు చేసుకుంటారు. దీనిని ఫ్లాట్ ఇంటరెస్టు పద్ధతి అంటారు. ఫైనాన్సర్లకూ, పార్టీకి మధ్య జరిగిన ఒప్పందం ప్రకారం డబ్బు ఇచ్చి పుచ్చుకోవడాలు పలువిధాలుగా ఉంటాయి. ఈ వ్యాపారాన్ని ఒకరుగాని, ఇద్దరు లేక ముగ్గురుగాని (పార్టనర్ షిప్) ప్రారంభించవచ్చు. ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీగా ఇన్‌కార్పోరేట్ చేయించవచ్చు. ఈ వ్యాపార నిర్వహణలో వ్యాపార విస్తృతినిబట్టి ఇన్‌కంటాక్స్ డిపార్టుమెంట్స్ వారికి లెక్కల వివరాలు దాఖలు చేయాల్సి ఉంటుంది.

దయామయుడు అనే లారీ ఓనర్ ఆయనకు గల ఎపికె 1632 లారీకిగాను కొంత ఫైనాన్స్ కావలసి వచ్చి ఓ ఫైనాన్స్ కంపెనీ నుంచి ఫైనాన్స్ తీసుకున్నారు. వడ్డీతో సహా రెండేళ్ళలో వాయిదాల పద్ధతిలో సంవత్సరానికి 18% వడ్డీ రేటు చొప్పున ప్రతి నెలా చెల్లించే ఏర్పాటుతో ఫైనాన్స్ ఇచ్చారనుకుందాం. ఫైనాన్స్ అగ్రిమెంట్ అమౌంట్ రు. 2,00,000/- అయినట్లయితే దానిని 18% వడ్డీ చొప్పున ఏడాదికి రు. 36,000/-, రెండేళ్ళకు రు. 72,000/- అవుతుంది. కాగా అగ్రిమెంట్ అమౌంట్ రెండు లక్షల నుంచి వడ్డీ మొత్తం రు. 72,000/- తీసివేసి రు. 1,28,000/- మాత్రమే అతనికి ఇస్తారు. దానిని ఈ క్రింది విధంగా ఎంట్రీ రాసుకోవాలి.

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Dayamayudu | | |
| | | APK 1632 A/C | | |
| | | To Cheque No. xxx | 1,28,000 | |
| | | To Finance Charges for | | |
| | | 24 Months (18%) | 72,000 | |
| | | Bank A/C | | |
| | | By Cheque No. x x x | | 1,28,000 |
| | | Finance Charges A/C | | |
| | | By Dayamayudu | | 72,000 |

ఈ విధంగా ఇచ్చిన పైకం 24 నెలల్లో వసూలు అవుతుంది. రెండు లక్షలను 24 భాగాలు చేస్తారు. మొదటి నెల రు. 8,300 + 800 = రు. 9,100 చెల్లించి మిగతా 23 నెలలూ రు. 8,300 చొప్పున చెల్లించాలి. కనుక ఈ వసూళ్ళను ఏ నెలకానెల ఈ కింది విధంగా రాసుకోవాలి.

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Dayamayudu APK 1632 A/C | | |
| | | By Receipt No. x x x | | 8,300 |

ఈ విధంగానే చాలా వెహికిల్స్‌కు ఫైనాన్స్ ఇవ్వడం, వసూలు చేయడం జరుగుతూ వ్యాపారం కొనసాగుతుంది. ఖర్చులకు సంబంధించిన హెడ్స్ అన్నీ ఇంతకు ముందు చెప్పుకున్నట్లుగానే ఉంటాయి. ఆఖరులో ఫైనలైజేషన్‌లో మాత్రం అతిముఖ్యమైన General Entries రాయవలసి ఉంది. దాన్నిప్పుడు పరిశీలిద్దాం.

మొదటగా వెహికిల్‌కు ఫైనాన్స్ ఇచ్చినప్పుడు ఛార్జెస్ మొత్తాన్ని అనగా నెలల పరిమితిని లెక్కించి కిస్తీలను ఫైనాన్స్ ఛార్జెస్ ఖాతాకి క్రెడిట్ చేయడం జరిగింది. కాని ఆ ఫైనాన్స్ ఛార్జీలు 24 నెలలకు సంబంధించినవి. కనుక ఆ ఫైనాన్సియల్ ఇయర్‌కి ఎన్ని వాయిదాలు వసూలయ్యాయో అందుండి ఫైనాన్స్ ఛార్జీలను మాత్రమే ఆ ఏడాది ఇన్‌కమ్‌గా చూపాలి. మిగిలిన వాటిని రాబోయే సంవత్సరానికి కేరీ ఫార్వర్డ్ చేయాలి. దీన్నెలా రాయాలో గమనిద్దాం.

ఇంతకు ముందు ఉదాహరణలో దయామయుడుకు రూ.1,28,000 లు చెక్కు ద్వారా చెల్లించగా రు.72,000 ఫైనాన్స్ ఛార్జెస్ కింద చూపడం జరిగింది.

దానిని 24 వాయిదాలలో నెలకు రు. 8,300 చొప్పున చెల్లిస్తున్నాడు. ఈ రు. 8,300 లలో రు. 5,300లు (128000÷24) అసలుగా వసూలు అయిందన్న మాట (72,000÷ 24 = రు. 3,000) మొదటి నెల రు. 9,100లో రు. 6,100 అసలు రు. 3,000 ఫైనాన్స్ చార్జీలు. ఆ ఫైనాన్స్ ఇయర్‌లో 9 వాయిదాలు మాత్రమే చెల్లించాడనుకుందాం. 9 x రు. 3,000 = రు. 27,000 మాత్రమే ఆ సంవత్సరానికి ఫైనాన్స్ చార్జీల ద్వారా వసూలు అయింది. దీనిని సంవత్సరాంతంలో ఈ కింది విధంగా ఎంట్రీ పాస్ చేసుకోవాలి.

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Finance Charges A/c<br>To Adv. Collections for 15<br>Instalments of APK 1632 | 45,000 | |
| | | Finance Charges to be<br>Received A/C<br>By APK 1632 Finance<br>Charges amount of<br>15 Instalments | | 45,000 |

ఎప్పుడో ముమ్ముందు రావలసిన వాటిని ముందుగా క్రెడిట్ చేసుకున్నందున ఈ విధంగా [illegible] సుకున్నాం. ఇలా వచ్చిన ఫైనాన్స్ Charges Head of A/C మాత్రమే P & L A/C కి వెళ్తుంది. ఫైనాన్స్ ఛార్జెస్ To be received అన్నది తర్వాత సంవత్సరానికి కేరీ ఫార్వర్డ్ అవుతుంది. ఈ మొత్తాన్ని మరుసటి సంవత్సరం రివెర్స్ ఎంట్రీగా రాసుకోవాలి. సంవత్సరాంతానికి పై విధంగా ఉన్న వాయిదాలను లెక్క చూసుకొని క్రితం సంవత్సరం మాదిరిగా ఎంట్రీపాస్ చేసుకోవాలి.

లాభనష్టాల ఖాతా, బ్యాలెన్స్ షీట్ వగైరాలన్నీ మామూలుగానే ఉంటాయి.

# రైసు మిల్లు

వడ్ల రకాలు లెక్కించలేము. రైతులు తమ భూములలో అనేక రకాల వడ్లను పండిస్తుంటారు. అవసరమైతే వ్యవసాయాధి కారుల నుంచి సలహాలను స్వీకరించి మంచి దిగుబడికి రైతులు అహరహం కృషి చేస్తుంటారు. భూమి తత్త్వాన్ని, నీటి వసతినీ, ఇతర సౌకర్యాలను అనుసరించి ఏ రకం విత్తనాలను నాటితే ఎక్కువ పంట వస్తుందో తెలుసుకుని ఆ ప్రకారం వారు సాగుచేస్తుంటారు. వ్యవసాయ శాఖకు చెందిన శాస్త్రజ్ఞులు కూడా అధిక దిగుబడిని ఇచ్చే వరి వంగడాల కోసం నిత్యం పరిశోధనలు సాగిస్తూ ఉంటారు. వారి పరిశోధనా ఫలితాలను ఎప్పటికప్పుడు వ్యవసాయాధికారులు రైతులకు అంద జేస్తుంటారు. తదనుగుణంగా రైతులు నూతన వరి వంగడాలతోనూ, నూతన సాంకేతిక పద్ధతులతో సాగుచేస్తూ అధిక దిగుబడులు సాధిస్తూ ఉంటారు. నేటి వ్యవసాయ పద్ధతులలో అధునాతన సాంకేతిక పద్ధతులెన్నో చోటుచేసుకున్నాయి. వీటి ద్వారా రైతులకు శ్రమ తగ్గడమే గాక అధిక దిగుబడులు, ధాన్యంలో నాణ్యత సాధ్యమవుతున్నాయి. యంత్ర పరికరాల వినియోగం, సేంద్రియ ఎరువులు, రసాయనిక ఎరువులు, పురుగుమందుల వాడకం కూడా పూర్వం కంటే నేడు అధికమైంది. పెరిగిపోతున్న జనాభా అవసరాలను సాధ్యమైనంత ఎక్కువగా తీర్చాలనేది వీటి ధ్యేయం. ఏదేమైనా నేలను దున్ని పంట నూర్పిడులు అయి పంట చేతికందే వరకు రైతుపడే శ్రమ యజ్ఞ నిర్వహణను తలపింపజేస్తుంది. నిజమే - రైతు కష్టం అంతటిది మరి! ఇన్ని వ్యయా ప్రయాసల కోర్చి ధాన్యం పండించడం ఒక యజ్ఞమైతే ఆ ధాన్యాన్ని డబ్బు రూపంలోకి మార్చుకోవడం మరో యజ్ఞం! నిజానికి అంతకన్నా ఎక్కువే అన్నా అతిశయోక్తి కాదు.

రైతులు తాము పండించిన పంటలను రైసుమిల్లులకు తోలి, వ్యవసాయ గిడ్డంగులకు చేర్చి సొమ్ము చేసుకుంటారు. అసలు వ్యవహారం ఇక్కడే ప్రారంభమవుతుంది. ధాన్యం అమ్మకానికి సిద్ధం కాగానే "దళారీ బకాసురులు" రంగ ప్రవేశం చేస్తారు. రైతుల నుంచి ధాన్యం మిల్లులకు చేర్చేందుకు మంచి మాటలు చెప్పి ఒప్పందం కుదుర్చుకుంటారు. రైతులు ఈ బ్రోకర్ల ప్రలోభాలకు లొంగో, గత్యంతరం లేకో తమ ధాన్యం వీరికి అప్పగిస్తారు. ఫలితంగా - ఆరుగాలం కష్టపడి పండించిన పంటకు తగిన ప్రతిఫలం పొందడంలో రైతన్న నష్టపోతున్నాడనేది జగమెరిగిన సత్యం. రైతు తను పండించిన ధాన్యాన్ని డైరెక్టుగా వినియోగదారుని వద్దకు చేర్చలేక పోతున్నాడు. మధ్యలో ఎన్నో చేతులు మారుతుంటాయి. ధరలు కూడా ప్రతి మెట్టుకు మారుతుంటాయి. అలా అంచెలంచెలుగా మారుతూ వినియోగదారుని చేరే సరికి ధర కొండలా పెరిగిపోతుంది. మట్టి వాసన అనేది తెలీకుండా ఈ వ్యాపారంలో మధ్యవర్తులెందరో సునాయాసంగా డబ్బు సంపాదిస్తున్నారు. దీని మూలకారణం రైతన్న రేయింబవళ్ళూ కంటికి రెప్పలా కాపాడుకుంటూ పండించిన పంటే కదా! అతని శ్రమ ఫలాన్ని ఎంతమంది పంచుకుంటున్నారో చూడండి! ఇదీ వ్యవస్థ తీరు! సరే - ఇక అసలు విషయానికి వద్దాం - రైసు మిల్లుల గురించి అక్కడి వ్యాపారం గురించీ, వారి అకౌంట్ల తీరు తెన్నుల గురించీ తెలుసుకుందాం.

## రైసుమిల్లులు ఎన్ని రకాలు?

రైసు మిల్లులు భారీ యంత్ర సామాగ్రితో నడుస్తుంటాయి. ఇక్కడ రక రకాల ధాన్యం ఆడి వివిధ పాలిష్‌లతో "బియ్యం" బస్తాల కెత్తుతుంటారు. బియ్యం

వ్యాపారం హోల్‌సేల్‌గా రాష్ట్రంలోనూ రాష్ట్రేతర ప్రాంతాలల్లోనూ కొనసాగుతుంది. ఇక్కడి నుంచే రైసు మిల్లుల్లో ధాన్యం ఆడినప్పుడు ఊక, తవుడు, ఇతర రబ్బిష్ వస్తూంటాయి. వీటి అమ్మకాలు కూడా ఇక్కడ జరుగుతుంటాయి. మిల్లులో అయితే లేబర్ యాక్టు ప్రకారం జీతాలు, పనిగంటలూ వర్తిస్తాయి. రైసు మిల్లుల వారు కూడా నిర్దేశిత అకౌంట్స్ తప్పకుండా మెయిన్‌టెయిన్ చేయాలి. సంబంధిత రికార్డులు, సకాలంలో రిటర్న్ ఫారాలు సమర్పించడం వంటివి కూడా నిర్వహిస్తూ ఉండాలి.

రైసు మిల్లులు ప్రధానంగా రెండు రకాలు:

(1) ట్రేడింగ్ రైసు మిల్లులు, (2) నాన్ ట్రేడింగ్ రైసు మిల్లులు

ట్రేడింగ్ రైసు మిల్లులు:-

ఈ ట్రేడింగ్ రైసు మిల్లులలో భారీ స్థాయిలో వ్యాపారం సాగుతుంది. మిల్లు స్థాయినీ వ్యాపార అవకాశాలనూ అనుసరించి మన రాష్ట్రంలోనూ, ఇతర రాష్ట్రాలలోనూ వ్యాపారం జరుగుతుంది. అంతే కాదు ఎక్స్‌పోర్టు వ్యాపారం కూడా సాగుతూండవచ్చు. ఇదంతా మిల్లు స్థాయినిబట్టి, దక్షతను బట్టీ ఉంటుంది. కాబట్టి ఏ స్థాయిలోనైనా వ్యాపారం సాగించే రైసుమిల్లులను ట్రేడింగ్ రైసు మిల్లులు అని చెప్పుకోవచ్చు. రైసు మిల్లులవారు మొదటగా ధాన్యం వచ్చినప్పుడు దిగుమతి పుస్తకం (అరైవల్‌బుక్)లో నమోదు చేస్తారు. అంటే ధ్యానం రైతులనుంచి గానీ బ్రోకర్ల నుంచి గానీ మిల్లులకు వచ్చినప్పుడు - ఎంత ధాన్యం వచ్చిందీ ఈ పుస్తకంలో ప్రథమంగా వివరం రాస్తారు. ఇందు నుంచి "బి" రిజిష్టరు వస్తుంది. ఇది మెయిన్. ఇందులో అన్ని వివరాలూ పూర్తిగా ఉంటాయి. అంటే - స్టాకు ఎంత ఉన్నదీ ఎంత

నూక వచ్చిందీ బియ్యం ఎంత వచ్చిందీ వివరంగా ఇందులో రాస్తారు. ధాన్యం కొనుగోలు, అమ్మకాల వ్యవహారమూ ఈ "B" రిజిష్టరులో పేర్కొంటారు. సివిల్ సప్లయిస్ వారికి ఏ ఏ వివరాలు అవసరమవుతాయో తదనుగుణంగా Columns వారీగా ఈ రిజిష్టరులో విభజింపబడి ఉంటుంది. ఆ ప్రకారమే వివరాలు నమోదు చేస్తూ వెళ్ళాలి.

ట్రేడింగ్ రైసు మిల్లులలో ఎఫ్.సి.ఐ. సేల్సు, పర్మిట్లమీద సేల్సు ఉంటుంది. ఈ పర్మిట్లు కలెక్టర్ ఆఫీసులో ఇస్తారు. అకౌంట్స్ రాయడంలో అనేక ఖాతాలు ఏర్పాటు చేసుకుని ప్రతి ట్రాన్సాక్షన్‌నూ నమోదు చేస్తుండాలి. ధ్యానం ఖరీదు ఖాతా పెట్టుకోవాలి. క్వింటాళ్ళలో కొనుగోలు వివరాలు రాయాలి. అలాగే - ఎఫ్.సి.ఐ. సేల్సు, లోకల్ సేల్సు, బ్రోకెన్సు సేల్సు, కన్‌సైన్‌మెంట్ సేల్సు, లోకల్ సేల్సు, అంతర్ రాష్ట్ర అమ్మకాలు (సి.ఎస్.టి.), ఎక్స్‌పోర్టు సేల్సు, తవుడు అమ్మకం తదితర ఖాతాలు ఉంటాయి. పైన పేర్కొన్న ఖాతాలు ప్రధానమైనవి. ట్రాన్సాక్షన్స్‌కు అనుగుణంగా మరికొన్ని ఖాతాలు కూడా ఉంటాయి.

ఇక అమ్మకం విషయానికి వస్తే - బియ్యం అమ్మకం ఖరీదు, సంచుల ఖరీదును, అమ్మకములను విడివిడిగా రాయాలి. అలాగే రవాణా ఖర్చులను విడిగా పేర్కొనాలి. పన్నుల నిర్ధారణకు వీలుగా ఇలా పద్దులు సెపరేట్‌గా రాయవలసి ఉంది.

అమ్మకాలపై సేల్సు టాక్స్ ఉంటుంది. అలాగే ఆర్.డి. (రూరల్ డెవలప్‌మెంట్) సెస్సు కూడా సంబంధిత సేల్సు టాక్స్ డిపార్టుమెంట్ వారికి చెల్లించవలసి ఉంది. సంచులు విడిగా అమ్మకం జరిగితే దానిపై :% T.O.T. ఉంటుంది.

అంతర్ రాష్ట్ర అమ్మకాలకు - లెవీ రైసుకు 'సి' ఫారాలతో పనిలేదు. 4% టాక్స్‌తో అమ్మకాలు సాగించవచ్చు. ఫస్ట్ ధాన్యము కొనుగోలుపై 4% టాక్స్ కట్టాలి. అమ్మకాలలో - ఎవరెవరికి ఎన్నెన్ని క్వింటాళ్ళు అమ్మకం జరిగిందో విడి విడిగా పేర్కొంటూ అన్ని అమ్మకాలపై 4% టాక్స్ చెల్లించాలి. బియ్యం ఎఫ్.సి.ఐ.కి ఎన్ని క్వింటాళ్ళు అమ్మారో, లోకల్‌గా ఎన్ని క్వింటాళ్ళు అమ్మారో చూపాలి. వీటి మీద 4% టాక్స్ లెక్కగట్టాలి. 100 క్వింటాళ్ళు అమ్మకాలకు 170 క్వింటాళ్ళ కొనుగోలు చూపుతారు. ఎందుకంటే 170 క్వింటాళ్ళలో ఊక, తవుడు, నూక, ఇతర రబ్బిష్ వంటివి పోగా బియ్యం 100 క్వింటాళ్ళు వస్తాయి.

సరుకు అమ్మకం విషయంగా జరిగిన ఖర్చులు ధాన్యం ఖరీదు కిందకు రావు. వాటికి కిరాయిల ఖాతా కింద రాయాలి. ఉదాహరణకు - ధాన్యం కొనుగోలు జరిగిన తర్వాత లారీ కిరాయి ధాన్యం ధరలో చేరదు. దీనిని విడిగానే రాయాలి. కిరాయిల మీద టాక్స్ ఉండదు. ఎందుకంటే ఈ కిరాయిలు రైతులకు చెందవు. కాబట్టి ధాన్యం ఖరీదు కిందకు కూడా ప్రభుత్వం ప్రకటించిన ధరను అనుసరించే ఉండాలి. తేడా ఉండ కూడదు. గవర్నమెంట్ ప్రకటించిన ప్రొక్యూర్‌మెంట్ రేట్‌ను క్వింటాళ్ళకు మార్చుకుని దాని ప్రకారమే ధర నిర్ణయం జరగాలి. తేడా ఉంటే తగిన సమాధానం చెప్పుకోవలసి ఉంటుంది.

ధాన్యం బస్తా ఒక్కొంటికి 76 కిలోల పట్టుబడి ఉంటుంది. లెక్కకు 75 కిలోలు, తేడా తాలు, రద్దుగా పరిగణిస్తారు.

ఎఫ్.సి.ఐ. వారు ఆర్.డి. (రూరల్ డెవలప్‌మెంట్) సెస్సు కింద 331/3% ఇస్తున్నారు. అదే విధంగా చెల్లిస్తున్నారుగాని - ఎఫ్.సి.ఐ. కి అమ్మిన బియ్యం

దాఖలా ధాన్యం విలువపై 5% కట్టవలసి ఉంది. 100 క్వింటాళ్ళలో 70 కిలోలు బియ్యంగాని, నూకలు గాని వస్తాయి. 61 కిలోలు బియ్యం, 9 కిలోలు నూకలు వస్తాయి. ఎఫ్.సి.ఐ. కి బియ్యం అమ్మకం జరుగుతుంది గాని నూకలు అమ్మరు. కనుక ధాన్యంగా మార్చి వచ్చిన దానిపై 5% టాక్స్ కట్టాల్సి ఉంటుంది.

రైసు మిల్లులకు ధాన్యం ఎలా వస్తుంది?

బియ్యం వ్యాపారంలో 'బ్రోకరేజీ వ్యవస్థ' వేళ్ళూనుకుని పోయింది. ప్రతి స్థాయిలోనూ బ్రోకర్ల ప్రమేయం అనివార్యమై పోయింది. రైతుల నుంచి ధాన్యాన్ని ఈ బ్రోకర్లు రైసు మిల్లులకు చేరుస్తుంటారు. వీరు రైతుల తరఫు నుంచి, రైసు మిల్లుల తరఫునుంచీ పనిచేస్తుంటారు. రైసు మిల్లుల వారు తమకు నమ్మకమైన బ్రోకర్లను వివిధ ప్రాంతాలలో నియమించుకుంటారు. వారికి - ఒక్కొక్కరికి సుమారు పదేసి చొప్పున వే బిల్లులు ఇస్తుంటారు. వే బిల్లులు పూర్తిచేసి రైతుల నుంచి ధాన్యం మిల్లులకు చేరుస్తుంటారీ బ్రోకర్లు. మరి కొందరు రైతులే స్వయంగా తమ ధాన్యం డైరెక్టుగా మిల్లులకు చేరుస్తుంటారు. ఈ విధంగా ధాన్యం రైసు మిల్లులకు చేరుతుంది.

బ్రోకర్లు ధాన్యాన్ని మిల్లులకు చేర్చడమే కాకుండా లోకల్‌గానూ ఇతర ప్రాంతాల్లోనూ, ఇతర రాష్ట్రాలలోనూ బియ్యం వ్యాపారం సాగిస్తుంటారు కూడా మిల్లుల నుంచి సరుకు కొనుగోలు చేసి, ఇదో తరహా బ్రోకరేజి!

ఈ విధంగా తమ వద్దకు చేరిన ధాన్యాన్ని - పూర్తి వివరాలు నమోదు చేసుకుని మిల్లుల వారు ఆడుతుంటారు. కాగా - బ్రోకర్లకు ఇచ్చే కమీషన్‌ను కమీషన్ ఖాతా కింద రాయాలి.

# నాన్ ట్రేడింగ్ మిల్లులు

ఈ నాన్ ట్రేడింగ్ మిల్లుల్లో పేరునుబట్టే - ఇక్కడ వ్యాపారం జరగదు. రైతుల నుంచి వచ్చిన ధాన్యం కేవలం క్వింటాలుకి ఇంతని రేటుకి ఆడుతుంటారు. అలా ఆడగా వచ్చిందే ఆదాయం. అంతేకాక, ఊక, తవుడు అమ్ముకుంటారు. దీనికి 3% టాక్స్ కట్టాలి. ఇంతే - మరే ఇతర వ్యాపార లావాదేవీలు జరుగవు. కనుక వీరు ఏ అకౌంట్లు, రిజిష్టరులు నిర్వహించరు. అకౌంట్లు రాసుకోదగ్గ ఆదాయం ఉండదని వీరు చెప్తుంటారు. అన్నింటికి అతీతులు ఈ నాన్ ట్రేడింగ్ మిల్లులవారు.

మిల్లులు లీజుకు తీసుకుంటే....

ట్రేడింగ్ మిల్లుగాని నాన్ ట్రేడింగ్ మిల్లుగాని లీజుకు తీసుకున్నట్లయితే - లీజు దారులే లైసెన్సు తీసుకోవాలి. సంబంధిత అకౌంట్లు, రిజిష్టరులు మెయిన్ టెయిన్ చేయాలి. రిటర్న్ ఫారాలు దాఖలు పరచాలి. లీజు అగ్రిమెంట్ ప్రకారం - అసలు ఓనరుకు కొంత సొమ్ము చెల్లించడం జరుగుతుంది. కాబట్టి లీజు పిరియడు ముగియగానే లాభదాయకంగా ఉన్నట్లయితే లీజును రెన్యువల్ చేసుకుని వ్యాపార లావాదేవీలు కొనసాగించవచ్చు. లేదంటే విరమించుకోవచ్చు.

రైసు మిల్లుల వారు తమ వ్యాపార లావాదేవీలు కొనసాగించేందుకుగాను కావలసిన అన్ని లైసెన్సులతో పాటు సివిల్ సప్లయిస్ వారి నుంచి కూడా లైసెన్సు తీసుకొనవలసి ఉంటుంది.

# హోటళ్ళూ, క్యాంటీన్లూ

హోటళ్ళలోనూ క్యాంటీన్లలోనూ వ్యాపారం ఎలా జరుగుతుందో అందరికి తెల్సిందే. ఎందుకంటే ప్రతివారూ ఏదో ఒక సందర్భంలో హోటల్‌కు వెళ్తుంటారు. కాబట్టి హోటల్ వ్యాపారం రకరకాల స్థాయిల్లో జరుగుతుంది. చిన్న చిన్న టీ బంకుల దగ్గర నుంచి పెద్ద పెద్ద స్టార్ హోటళ్ళ వరకు లక్షలాది రూపాయలు టర్నోవర్‌గా వ్యాపారం సాగుతుంది. ఇవాళ అన్ని రకాలుగా బాగా అభివృద్ధి చెందిన వ్యాపారంగా దీనిని చెప్పుకోవచ్చు. పెద్ద పెద్ద హోటళ్ళను అలా ఉంచి - చిన్న, మధ్య తరహా హోటళ్ళ గురించి ఇక్కడ చెప్పుకుందాం. అందరి అకౌంట్ల మాదిరిగానే ఈ హోటళ్ళ అకౌంట్లు కూడా ఉంటాయి. ప్రధానంగా పర్చేజ్, సేల్సు ఉంటాయి. జమలు, ఖర్చులు అన్నీ మామూలుగానే ఉంటాయి. భోజన హోటలైతే బియ్యం, కందిపప్పు, మినపప్పు, కూరగాయలు, నూనె, మటన్, తదితరాలకు అన్నింటికి విడివిడిగా ఖాతాలు పెట్టుకోవాలి. సంబంధిత అధికారులు వివరాలు అడిగినప్పుడు చెప్పడానికి వీలుగా దేనికి దానికి సెపరేట్‌గా ఖాతాలు ఏర్పాటు చేసుకోవాలి. Milk కూడా విడిగా ఖాతా ఉండాలి. Milk కు ప్రత్యేకంగా టాక్స్ చెల్లించాలి, కనుక వివరాలు స్పష్టంగా ఉండాలి. మిల్క్ కు రు. 2 లక్షల టర్నోవరు వరకు టాక్స్ మినహాయింపు ఉంది. రు. 2 లక్షలు టర్నోవరు దాటితే మొత్తానికి టాక్స్ కట్టాలి. వీరు "5సి" సెక్షన్ పరిధిలోకి వస్తారు వీరు 5% టాక్స్ కట్టవలసి ఉంటుంది. ఇక టర్నోవరుతో సంబంధం లేకుండా పాలమీద 10% పన్నుకట్టాలి. భోజన హోటల్సుకైతే పాలమీద టాక్స్ మినహాయింపు ఉంది. కాగా రు. 2 లక్షల టర్నోవరు దాటితే మొత్తం అమ్మకంపై అంటే టీ, కాఫీ, టిఫిన్ అమ్మకాలపై 5% టాక్స్ కట్టాలి.

కాఫీ హోటలు వారు ఊకను కొంటారు. దీన్ని కూడా కొనుగోలు ఖాతా కింద రాసుకోవాలి. గ్లాసులు, పళ్ళేలు వగైరా అస్సెట్స్ కిందకు వస్తాయి. భోజనం, టిఫిన్ వగైరా అమ్మకాలపై ఆదాయం వస్తుంది కాబట్టి వీటిని జమలలోనూ, సరుకుల కొనుగోలు, పనివారల జీతాలు, సరుకు రవాణాలకు అయ్యే ఖర్చులను ఖర్చుల ఖాతాలకు చేర్చాలి.

సాధారణంగా అన్ని అకౌంట్లకు మాదిరిగానే దీనికి హెడ్ ఆఫ్ అకౌంట్స్ ఉంటాయి. అయితే స్థానిక అవసరాలు, ఇతర ట్రాన్సాక్షన్స్‌ను అనుసరించి ప్రత్యేకంగా హెడ్ ఆఫ్ అకౌంట్స్ రాసుకోవచ్చు. సందర్భాన్ని బట్టి వ్యవహరిస్తూ ఉండాలి. ప్రతి అకౌంటెంట్ అకౌంటెన్సీలోని ఫండమెంటల్స్‌ని బాగా వంట పట్టించుకుంటే అకౌంట్స్ రాయడంలో ఏ విధానాన్నయినా అవలీలగా అనుసరించ గలడు.

Tea Canteen లో వచ్చే కొన్ని Head of A/Cs ని పరిశీలిద్దాం.

Coffee, Tea Sales చేసినప్పుడు

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Sales of Coffee & Tea A/C | | |
| | | By Tea & Coffee | | x x x |

Coffee, Tea తయారు చేయు నిమిత్తం Milk కొనుగోలు

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Milk Purchase A/C | | |
| | | To Purchase of Milk | x x x | |

Coffee, Tea Powder, Sugar లాంటివి కొనుగోలు చేసినప్పుడు.

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Purchases A/C | | |
| | | To B.No. xxx | xxx | |
| | | Purchase of Tea/Coffee Powder | | |

Tea తయారు చేయు నిమిత్తం వంట గ్యాస్, ఊకలాంటివి కొనుగోలు చేసినప్పుడు.

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Maintenance A/c | | |
| | | To Purchase of Gas, etc., | x x x | |

Tea తయారీ నిమిత్తం. Tea Masters కు చెల్లించే జీతాలు

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Maintenance A/c | | |
| | | To Tea Master Wages | x x x | |

యిదే Meals Hotel అయితే మరికొన్ని అదనంగా వస్తాయి.

# చెప్పుల్స్

చెప్పుల్స్ వ్యాపారం కూడా మంచి లాభాలు తెచ్చిపెట్టేదే. మన రాష్ట్రంలోను, ఇతర రాష్ట్రాలలోనూ వ్యాపార లావాదేవీలు సాగుతూ ఉంటాయి. వ్యాపార స్థాయినిబట్టి అమ్మకాలు జరుగుతూ ఉంటాయి. కొన్నిచోట్ల ఈ వ్యాపారులు తమ వ్యాపారానికి అనుబంధంగా తయారీ యూనిట్లుకూడా నిర్వహిస్తూంటారు. ఈ యూనిట్లకు వివిధ ప్రాంతాల నుంచి చెప్పుల్స్ తయారుచేయడానికి అవసరమైన ముడి సరుకు అంటే రెండు మూడు రకాల లెదర్ షీట్స్, రబ్బరు షీట్స్, పలుచని చెక్క, సొల్యూషన్ తదితర వస్తువులు చేర్చి వర్కర్లతో పనిచేయిస్తుంటారు. ఇక్కడ తయారైన వివిధ రకాల, పలు సైజుల చెప్పులు, బూట్లు వ్యాపార స్థలంలో ఉంచి విక్రయిస్తుంటారు. వీరి అకౌంట్లలో కూడా కొనుగోళ్ళు, అమ్మకాలు, ముడిసరుకు కొనుగోలు, తయారీ ఖర్చులు, వర్కర్ల జీతాలు మొదలైనవన్నీ మామూలుగానే ఉంటాయి.

ఇక పన్ను విషయానికి వస్తే - ఫస్టు సేల్సు అయితే రూ.200ల లోపైతే 9% టాక్స్ చెల్లించాలి. మించితే 10% శాతం పన్ను కట్టాలి. అదే సెకండ్ సేల్సు అయినట్లయితే రూ.200లకు పెరిగితే V.A.T.పడుతుంది. ఈ V.A.T.9% శాతం కట్టాలి. మరి రూ.200లకు తగ్గితే T.O.T. 1% చెల్లించాలి.

ఏడాది టర్నోవరు రూ.10 లక్షలలోపువారు పన్ను చెల్లించనవసరంలేదు. వినియోగదారులకు సరుకు అమ్మితే వి.ఎ.టి. వర్తించదు. వ్యాపారులకు అమ్మితేనే వి.ఎ.టి. కట్టాలి. అదే టి.ఒ.టి. పరిధిలోకి వచ్చేదయితే ఎవరికి అమ్మినా టాక్స్ కట్టాల్సిందే. ఇవీ క్లుప్తంగా టేక్సు వివరాలు.

చెప్పుల్స్ షాపు అకౌంటింగ్‌లో కూడా పెద్దగా మార్పులేవీ వుండవు. హోల్‌సేల్ షాపయితే అమ్మకాలు ఇతర రాష్ట్రాలకు కూడా వ్యాపించి ఉంటాయి. రిటైల్ షాపయితే స్థానిక అమ్మకాలు ఉంటాయి. వీటిని అనుసరించే అకౌంట్స్ కూడా ఉంటాయి. హెడ్ ఆఫ్ అకౌంట్స్ కూడా మామూలుగానే ఉంటాయి.

## కాంట్రాక్టర్సు

కాంట్రాక్టరు ప్రభుత్వం నుంచిగాని, ప్రైవేటు వ్యక్తుల నుంచిగాని నిర్మాణపు పనులు ఒప్పుకొని చేయిస్తూంటాడు. కాంట్రాక్టరు అకౌంట్స్‌లో కూడా పెద్దగా మార్పులేవీ ఉండవు. జమలూ ఖర్చులూ అన్నీ మామూలే.

పన్ను విషయానికి వస్తే ది. 1-4-1995కి పూర్వం కాంట్రాక్టుకు ఉపయోగించే వస్తువుల మీద పన్ను విధించే విధానముండేది. అయితే ఆ తర్వాత ఆ పద్ధతికి స్వస్తి పలికారు. పై తేది నుంచి - వర్క్సు కాంట్రాక్టులపై - ఏక మొత్తంగా టాక్స్ కట్టే పద్ధతిని ప్రవేశపెట్టారు. ప్రస్తుతం ఈ విధానమే అమలులో ఉంది. దీని ప్రకారం - వర్క్సు కాంట్రాక్టులపై ఒక అమౌంట్‌గా 6% చొప్పున టాక్స్ కట్టాలి. కాంట్రాక్టు మొత్తంలో మెటీరియల్ కాస్ట్ ఇవ్వకపోతే అయిన మొత్తంలో 30% లేబరు కింద తీసివేసి మిగతా 70% మొత్తానికి 6% చొప్పున లెక్కగట్టి టాక్స్ కట్టాలి. కాగా కాంట్రాక్టరుకు 'ఎల్' లైసెన్సు ఉంటే గ్రాస్ రిసీప్ట్ మొత్తంపై 2% టాక్స్ చెల్లిస్తే సరిపోతుంది. ఈ 'ఎల్.1' లైసెన్సు సంబంధిత వాణిజ్య పన్నుల శాఖ నుంచి పొందవచ్చు.

లేబరు కాంట్రాక్టుల మీద పన్ను ఉండదు. అంటే చెరువులు తవ్వించడం వగైరా. దీనికి మెటీరియల్ ఉండదు కనుక టాక్స్ చెల్లించనవసరం లేదు. అయితే

ఇందులో కూడా మెటీరియల్ ఇన్‌వాల్యుమెంట్ ఉంటే కాంట్రాక్టు మొత్తంలో 30% లేబరు కింద తీసుకొని, 70% పై పన్ను చెల్లించాలి. డిక్లేర్ గూడ్స్ అంటే ఐరన్, వీటికి సంబంధించినవి రాడ్సు, ఎమ్.ఎస్.బార్స్, గడ్డర్స్ వగైరా కాంట్రాక్టులో వాడినట్లయితే 4% టాక్స్ చెల్లించాలి.

## స్మాల్ స్కేల్ ఇండస్ట్రీస్

వెనుకబడిన ప్రాంతాలను అభివృద్ది పరచేందుకుగాను స్మాల్‌స్కేల్ ఇండస్ట్రీస్ స్థాపన విషయంలో ప్రభుత్వం అనేక రాయితీలు మంజూరుచేసింది. జి.ఒ.నెం.498 ప్రకారం 15-9-89 నుంచి ఇండస్ట్రీస్ అండ్ కామర్సు డిపార్టుమెంటు వారు ఎస్.ఎస్.ఐ. స్థాపించదలచిన ఔత్సాహికులకు పలుసౌలభ్యాలు కలుగజేసారు. వెనుకబడిన ప్రాంతాలలో పరిశ్రమ స్థాపించదలిస్తే వారు అయిదేళ్ళ వరకు పన్ను కట్టనక్కరలేదు. వివరాలు ఇవీ - ఎస్.ఎస్.ఐ. స్థాపించిన తర్వాత అయిదేళ్ళ వరకు - డిఫర్‌మెంట్, హాలీడే విభాగాల కింద ఎస్.టి.ఎగ్జంప్షన్ ఇచ్చారు. వీటి వివరాలు తెలుసుకుందాం.

డిఫర్‌మెంట్:- ఇండస్ట్రీ స్థాపించిన అయిదేళ్ళ వరకూ టాక్స్ వసూలుచేసిన - దానిని ప్రభుత్వానికి కట్టనక్కరలేదు. అయిదేళ్ళ తర్వాత మళ్ళీ అయిదేళ్ళలోగా దీనిని చెల్లించవచ్చు.

హాలీడే:- దీని ప్రకారం టాక్స్ వసూలు ఉండదు. ప్రభుత్వానికి చెల్లింపుకూడా వుండదు. దీని కాలపరిధిని ప్రస్తుతం 7 ఏళ్ళకు పెంచారు. అంతేగాక విద్యుచ్ఛక్తి వాడకంలో కూడా రాయితీలు ప్రకటించారు.

# ఫిల్మ్ డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీలు

"సినిమా" ఇవాళ పవర్‌ఫుల్ మాస్ మీడియా. కమ్యూనికేషన్ రంగంలో అద్వితీయమైన పాత్రపోషణ ఈ సినిమా ద్వారానే జరుగుతుంది. పామరుల నుంచి పండితుల వరకు, బాలల నుంచి వృద్ధుల వరకు అన్ని వర్గాలవారికి సమానస్థాయిలో సమాచారాన్ని అందించగల మహత్తర సాధనం సినిమా అంటే అతిశయోక్తికాదు. సినీ నిర్మాణరంగం వేలాది మందికి అన్నికేటగిరీల వారికి జీవనోపాధి కల్పిస్తోంది. కళాసాంస్కృతిక రంగాల అభివృద్ధికి వేదికగా నిలుస్తుంది. నేటి జనజీవన స్రవంతిపై విశేష ప్రభావం కురిపిస్తోంది. ఒక్క మాటలో చెప్పాలంటే ప్రజల దైనందిన వ్యవహారాలలో సినిమా ఓ భాగమైపోయింది. ఇన్ని కోణాల నుంచి ప్రతిభా కిరణాలను ప్రసరిస్తున్న సినిమా ఇవాళ ఓ భారీ పరిశ్రమ. కోట్లాది రూపాయలు పెట్టుబడి పెట్టి నిర్వహించే బహుళవ్యాపార వేదిక. విశ్వ విపణిలో లావాదేవీలు జరిపే బృహత్తర వాణిజ్య కేంద్రం.

నిర్మాత డబ్బుపెట్టుబడిగా పెట్టి సినిమా నిర్మిస్తాడు. దర్శకుడి ప్రతిభ ఆధారంగాను కథ, నటీ నటులను బట్టి చిత్రీకరణ తదితర అంశాలను అనుసరించి పిల్మ్‌డిస్ట్రిబ్యూటర్స్ ఆ సినిమాను ఏరియాల వారిగా కొనుక్కోవటంగాని, లీజుకు తీసుకోవడంగాని చేస్తుంటారు. వీరు నగరాలు, పట్టణాలలో సినిమా ఎగ్జిబిటర్లకు పరిమితకాలానికి లీజుకు ఇవ్వడంగాని, లేదా సినిమా హాలును తాము లీజుకు

తీసుకోవడంగాని చేసి సినిమాను ప్రదర్శించుకుంటారు. టిక్కెట్లపై వచ్చే కలక్షన్ తీసుకుంటారు. కరెంటు చార్జీలు డిస్ట్రిబ్యూటర్లే చెల్లించాల్సి ఉంటుంది. అలా కాక ఎగ్జిబిటర్లకు సినిమాను వారానికి ఇంతని ఒప్పందం చేసుకొని వారినుంచి పైకము స్వీకరించి ఆ కాలపరిమితిలో సినిమా ప్రదర్శించుకొనేందుకు హాలు వారికి యిస్తారు. ఈ పద్ధతిలో టిక్కెట్లపై కలక్షన్‌ను హాలువారే తీసుకుంటారు. ఎందుకంటే లీజు ఒప్పందం ప్రకారం ముందుగానే డిస్ట్రిబ్యూటర్స్‌కు పైకం చెల్లించారు కాబట్టి.

ఫిలిం డిస్ట్రిబ్యూటర్స్, ఎగ్జిబిటర్లూ, అకౌంట్స్ మెయిన్‌టెయిన్ చేయాల్సిందే . ఈ అకౌంట్స్ కూడా మిగతా అందరికిమల్లేనే ఉంటాయి. సినిమా లీజుకు యిచ్చినప్పుడు వచ్చిన లీజు ఎమౌంటు ఆదాయంగా జమలోకి వస్తుంది. లేదా టిక్కెట్ల కలక్షన్ ఆదాయంగా వస్తుంది. ఖర్చులలో ట్రావెలింగ్, సిబ్బంది జీతాలు, యితర ఖర్చులు అన్ని మామూలే. అలాగే సినిమా ఎగ్జిబిటర్లకు కూడా ఇవన్నీ వర్తిస్తాయి.

## పన్ను చెల్లింపు:

గతంలో సినిమా హాలు వారి టిక్కెట్ల కలక్షన్ ఆధారంగా టాక్స్ నిర్ణయించే వారు. ఆ విధానానికి ప్రభుత్వం స్వస్తి పలికింది. స్లాబు విధానాన్ని అనుసరించి పన్ను నిర్ణయించే పద్ధతి ప్రస్తుతం అమలులోఉంది. గ్రామ పంచాయితీ, మేజర్ పంచాయితీ, పట్టణాలు, మేజర్‌పట్టణాలు, నగరాలు, మహానగరాలు యిలా

గ్రేడులుగా విభజించి ఏకమొత్తంగా ఆయావిభాగాల వారిగా పన్ను నిర్ణయించటం జరుగుతుంది. మున్సిపాలిటీలు అన్ని ఒక స్లాబు కిందకు, పంచాయితీలు అన్ని ఒక శ్లాబు కిందకు వస్తాయి. స్లాబుల కేటగిరీననుసరించి పన్ను నిర్ధారణ చేస్తారు. ఈ పద్ధతిలో టికెట్ కలక్షన్‌తో సంబంధంలేకుండా నిర్ణయించిన శ్లాబురేటును చెల్లించాలి. పట్టణాలలో కొన్నింటిని గ్రేడ్ 1గాను, మరికొన్నింటిని గ్రేడ్ 2 గాను నిర్ణయించి ఆ గ్రేడులిననుసరించి పన్ను విధిస్తారు. ఆ ప్రకారం టాక్స్ చెల్లించాల్సి ఉంటుంది. ప్రతి ఏడాది ఏప్రిల్‌లో డిస్ట్రిబ్యూటర్స్, ఎగ్జిబిటర్లు ఒక ఎగ్రిమెంటుకు వస్తారు. దీని ప్రకారం సినిమా ప్రదర్శన, ఆదాయాలు, ఖర్చులు కొనసాగుతాయి.

ఎంటర్‌టెయిన్‌మెంట్ టాక్స్ ఆఫీసరు (ఇ.టి.ఒ) లైసెన్సులు మంజూరు చేస్తారు. ఆయనతో వీరంతా ఓ కాంట్రాక్టుకు వస్తారు. మున్సిపల్ కార్పోరేషన్ పరిధికి చెందినదైతే 22షోలకు తగ్గకుండా గ్రాస్ కలెక్షన్‌పై 30 శాతం టాక్స్ చెల్లించాల్సి ఉంటుంది. 22 షోలకు టాక్స్ ఖచ్చితంగా కట్టాలి.

ఇదిలా ఉండగా - వాల్ పోస్టర్ల ఖర్చులు, సినిమా ప్రదర్శింపబడుతున్న వారాలు కరెంట్ ఛార్జీలు, ఇతర ప్రచారానికి అయ్యే ఖర్చులు అన్నీ ఫిల్మ్ డిస్ట్రిబ్యూటర్లే భరించుకోవాలి. అలాగే ఎంటర్‌టెయిన్‌మెంట్ టాక్స్ కూడా వీరే చెల్లించాల్సి ఉంటుంది.

ఏదైనా కొత్త సంస్థకు చెందిన అకౌంట్స్ రాయడానికి సిద్ధమైనప్పుడు

ముందుగా ఆ సంస్థ వ్యాపార సరళిని అర్థం చేసుకోవాలి. అంటే - వ్యాపారం ఎలా జరుగుతుంది? ఆదాయ వనరులు ఏమేమిటి? వ్యాపారంలో ఎవరు పాల్గొంటారు? ఏ ఏ స్థాయిలలో ఎలా వ్యాపార నిర్వాహణ జరుగుతున్నది? ఏ ఏ మార్గాలగుండా సంస్థలలోకి డబ్బు చేరుతుంది? ఖర్చులెలా ఉంటాయి? ప్రత్యేకమైన ఆదాయలేమిటి? ప్రత్యేకమయిన ఖర్చులు ఏమిటి? మొదలైన అంశాలమీద దృష్టి సారించాలి. ఆ సంస్థ నిర్వహించే వ్యాపారంమీద సమగ్ర అవగాహన కలిగినపుడు ఆ సంస్థ అకౌంట్స్ రాయడం నల్లేరుపై బండి నడకలాగ సాగిపోతుంది. అప్పుడే ఆ అకౌంట్స్‌కు సమగ్రత చేకూరుతుంది.

ప్రతి అకౌంటెంట్‌కు పలురకాల వ్యాపారాలకు చెందిన పరిజ్ఞానంతో పాటు వివిధ టాక్సులకు సంబంధించిన అవగాహనకూడా అత్యంత అవసరము. ఇన్‌కంటాక్సు, సేల్సుటాక్సు, వాల్యూయాడెడ్ టాక్సు, టర్నోవరుటాక్సు, ఎ.పి.జి.ఎస్.టి., సి.ఎస్.టి., సి.ఫారాలు, జి.ఫారాలు, ఐ.టి., ఎస్.టి., రిటర్న్ ఫారాలు, వీటి పరిధులు, పరిమితులు, మినహాయింపులు, తగ్గింపులు తదితర అన్ని అంశాలపై సమగ్ర పరిజ్ఞానం అవసరం. అన్నీ తెలుసుకొని అకౌంట్స్ రాస్తే అది శిలాశాసనం. ఏమి తెలియకుండా కేవలం అనుకరిస్తూ రాయడం జలలేఖనం.( నీటి మీద రాత). అందుకనే పరిపూర్ణ అకౌంటెంట్ కాదలచిన వారు అన్ని విషయాలు తెలుసు కొనేందుకు నిత్యం ప్రయత్నిస్తుండాలి.

# అభినందనలు

విజయవంతంగా మొదటి మెటీరియల్ పూర్తి చేసినందుకు అభినందనలు! అక్కౌంట్స్ రాయడం నేర్చుకోవడానికి ముందు కోర్సు ఎంత ఉంటుందో - ఎలా నేర్చుకోవాలో వంటి ప్రశ్నలు ముసురుకోవడం సహజం. కంగారు, భయం కూడా కలుగుతాయి. అయితే తెలియని విషయాలు తెలుసుకుంటూ ముందుకు సాగిపోతూంటే సందేహాలు మబ్బులు విడిపోయినట్లు మటుమాయం అవుతాయి. విషయం ఏమిటో తెలియనప్పుడే అన్ని ధర్మసందేహాలూ కొండల్లా వచ్చి కూర్చుంటాయి. బిజినెస్ అకౌంట్స్ గురించి కలిగిన సందేహాలు క్రమక్రమంగా నివృత్తి కాగలవు. ఇవన్నీ కొత్తగా అకౌంట్స్ నేర్చుకుంటున్న వారికి ! అయితే అకౌంట్స్‌లో ప్రవేశం ఉండి ఏ చిన్న సంస్థలోనో యిప్పటికే అకౌంట్స్ రాస్తున్న వారికైతే మా పాఠాలు తప్పనిసరిగా ఆత్మవిశ్వాసాన్ని పెంపొందింప జేస్తాయని నమ్ముతున్నాం. అన్ని విషయాలనూ కూలంకుషంగా నేర్పుతాం కాబట్టి ప్రతివారికీ ఈ సబ్జక్టులో నైపుణ్యం పట్టుబడుతుంది.

మొదటి మెటీరియల్ ప్రశ్నాపత్రం జవాబులను శ్రద్ధగా గమనించండి. తప్పులు ఎక్కడ చేశామో గుర్తించండి. నిర్దేశాలనూ సూచనలనూ పాటించండి. రెండో మెటీరియల్‌ను తెరిచే ముందు మరోసారి మొదటి మెటీరియల్‌ను క్షుణ్ణంగా అధ్యయనం చేయండి.

**ఎ-బై-సి సర్వీసెస్**

**సానపడితేనే వజ్రానికి మెరుపు**
**సాధన చేస్తేనే విద్యార్థికి గెలుపు**

నేర్చుకున్న విద్యను ఆచరణలో పెట్టినప్పుడే దానికి పరిపూర్ణత కలుగుతుంది. ఏ విద్యకైనా ఇది వర్తిస్తుంది. మన అకౌంట్స్ కోర్సుకు ఇది మరింత ముఖ్యం కనుక అకౌంట్స్ రాయడం నేర్చుకుంటున్న తరుణంలో కోర్సులో చెప్పిన వివిధ అంశాలను, సూత్రాలను ఆధారంగా తీసుకుని ప్రాక్టికల్‌గా రాస్తుండాలి. అంటే - తెల్లకాగితాలు, కార్బన్ పేపర్లు కొన్నప్పుడు ఇది ఏ ఖాతా కిందకు వస్తుంది. దీనిని డెబిట్ చేయాలా? క్రెడిట్ చేయాలా ? డబుల్ కాలం క్యాష్ బుక్‌లో ఎలా పద్దు రాయాలి ? దానిని లెడ్జర్‌లో ఎలా పోస్టింగ్ వేయాలి ? వీటన్నిటి మీదా దృష్టి నిలుపుతూ కాగితం, కలం తీసుకుని రాయడం ప్రాక్టీసు చేయాలి. ఇలా ప్రతిరోజూ కనీసం రెండుగంటలు క్రమం తప్పకుండా రాస్తూంటే నేర్చుకున్న విషయం పూర్తిగా వంటపడుతుంది. కోర్సులో ఇచ్చిన ఉదాహరణ అంశాలను మార్చి మార్చి పలువిధాలుగా రాయడం అభ్యాసం చేస్తుంటే త్వరితగతిన మంచి ఫలితాలు సాధించవచ్చు. కనుక - ప్రతీరోజూ ప్రాక్టీసు చేయడంలో ఏ మాత్రం అశ్రద్ధ చేయవద్దని కోరుతున్నాం. ఆత్మవిశ్వాసంతో మనసావాచా కర్మణా - ఈ బిజినెస్ అకౌంట్స్ నేర్చుకుంటున్నంతకాలం కోర్సులో లీనమై, ఏకాగ్రతతో కీలకాంశాలను ఆకళింపు చేసుకోవాలని విజ్ఞప్తి చేస్తున్నాం. అనంతంగా సాగిపోయే ఈ సబ్జక్టుపై 'మంచి పట్టు' సాధించేందుకు నిరంతరం కృషి అవసరమని, 'వ్యవహార' జ్ఞానంలో నైపుణ్యం సొంతం చేసుకోవాలంటే 'దీక్ష'ను పెట్టుబడిగా పెట్టాలని మరోసారి గుర్తుచేస్తున్నాం. ఈ మాటలు పదేపదే ఎందుకు చెప్తున్నామంటే సానపట్టందే ఏ వజ్రమైనా వెలుగులు విరజిమ్మలేదని, సమ్మెట దెబ్బలు పడందే ఏ ఇనుమైనా రాటుదేలదని మీరు అర్థం చేసుకుంటారనే !

కనుక బిజినెస్ అకౌంట్స్ ప్రాధాన్యాన్ని గుర్తించి అత్యంత విలువైన ఈ సబ్జక్టును 'హస్తగతం' చేసుకుని రాణించేందుకు రోజుకు రెండుగంటలు కష్టపడక తప్పదని మా సూచన. ఈ క్రింద మరికొన్ని ఉదాహరణలు పేర్కొంటున్నాం. వీటిలో ఫాలో అవుతూ, ఇలాంటివే మరికొన్నింటిని మీ ఆలోచనలతో రూపొందించి ప్రాక్టీసు చేయండి. అలాగే ఎప్పటికప్పుడు సబ్జక్టును గురించి, సూత్రాలను గురించి 'మననం' చేస్తూండండి. ఈ నియమాలను పాటిస్తే అతి త్వరలో పూర్తి స్థాయి అకౌంటెంట్ కాగలరని నిర్ద్వంద్వంగా చెప్పవచ్చు.

Day to day cash book **రాసే విధానాన్ని పరిశీలిద్దాం.**

ది. 1-2-2001న జరిగిన Transactions ను Cash Book ఎలా నమోదు చేయాలో అలాగే ఏ రోజుకారోజు క్యాష్ నిల్వ తేల్చుకుంటూ పద్దులు ఎలా రాయాలో పరిశీలిద్దాం.

1. నీలు చక్రవర్తి రూ. 50,000లతో వ్యాపారం ప్రారంభించారు.
2. లైసెన్సు నిమిత్తం రూ. 25 ల ఖర్చుతో అప్లికేషన్ ఫారం కొనుగోలు.
3. సేల్సు టాక్సు లైసెన్సు ఫీజు నిమిత్తం రు. 100 లు చెల్లింపు.
4. సేల్సు టాక్సు లైసెన్సు కోసం రూ. 2000లతో 163240 నెంబరుగల ఎన్.ఎస్.సి. (డిపోజిట్‌గా)
5. లైసెన్సు ఫీ చెల్లించిన చెలానా, డిపాజిట్ ఎన్.ఎస్.సి.లను జిరాక్స్ తీయించినందుకు రూ. 1 చెల్లింపు.
6. ష్యూరిటీ లెటర్ నిమిత్తం రు. 100 లతో స్టాంపు పేపర్ కొనుగోలు.
7. టైపు చేయించినందుకు రు. 10 చెల్లింపు.
8. షాపు అద్దె అడ్వాన్సుగా రు. 5000 చెల్లింపు.
9. కాఫీ, టీలకు రూ. 15 లు.
10. ఆటో చార్జీలు రూ. 25లు.

## క్యాష్ బుక్

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 01-02-2001 | | పెట్టుబడి ఖాతా | | |
| | | నగదు పెట్టుబడిగా పెట్టినందున | | 50,000 |
| | | స్టేషనరీ ఖాతా | | |
| | | ఖర్చులైసెన్సు నిమిత్తం అప్లికేషన్ ఫారం | | |
| | | కొనుగోలు చేసినందుకు | 25 | |
| | | " జిరాక్స్ తీయించినందుకు | 1 | |
| | | " ష్యూరిటీ స్టాంపు పేపర్ కొనుగోలు | 100 | |
| | | " టైపింగ్ చార్జీలు | 10 | |
| | | డిపాజిట్ ఖాతా | | |
| | | ఖర్చు నెం. 163240 దాఖలా ఎన్.ఎస్.సి | | |
| | | సేల్సుటాక్సు లైసెన్సు నిమిత్తం | | |
| | | తీసుకున్నందున | 2000 | |

| | | |
|---|---|---|
| అద్దె అడ్వాన్సు ఖాతా | | |
| ఖర్చు షాపు నిమిత్తం | | |
| అడ్వాన్సుగా చెల్లించినది | 5000 | |
| సాదరు ఖాతా | | |
| ఖర్చు కాఫీ, టీల నిమిత్తం | 15 | |
| కన్వేనియన్స్ ఖాతా | | |
| ఖర్చు ఆటో చార్జీలు | | |
| చెల్లించినందుకు | 25 | |
| | 7176 | 50,000 |
| | | 7176 |
| తేల్చిన నిల్వ | | 42,824 |

అలాగే ది. 1-2-2001న జరిగిన Transactions:

1. మిషనరీ కొనుగోలు రూ. 10,000లు కళ్యాణ్ అండ్ కో వారికి అడ్వాన్సుగా చెల్లింపు.
2. రబ్బరు స్టాంపులు తయారీకి రూ. 50 చెల్లింపు.
3. రూ. 2000 తో ఆఫీసు కుర్చీ, టేబుల్ కొనుగోలు
4. బిల్లు, రశీదు పుస్తకాల కోసం రవి ప్రింటర్స్ వారికి రూ.1500 నగదు చెల్లింపు.
5. రూ. 10 ల పోస్టేజి స్టాంపులు కొనుగోలు.
6. రూ. 5000 లతో ఎలక్ట్రికల్ ఫ్యాన్స్, ట్యూబ్‌లైట్లు, కిరణ్ ఎలక్ట్రికల్స్ నుంచి కొనుగోలు.
7. సిండికేట్ బ్యాంకులో ఖాతా ఓపెన్ చేసి రూ.1000 నగదు డిపాజిట్.
8. టిఫిన్ వగైరాలకు రూ. 20లు

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
| --- | --- | --- | --- | --- |
| 2-2-2001 | | తెచ్చిన నిల్వ | | 42,824 |
| | | కళ్యాణ్ అండ్ కో ఖాతా | | |
| | | ఖర్చు మిషనరీ కొనుగోలునిమిత్తం | | |
| | | అడ్వాన్సుగా యిచ్చినది | 10,000 | |
| | | స్టేషనరీ ఖాతా | | |
| | | ఖర్చు రబ్బరు స్టాంపులకు చెల్లించిది. | 50 | |
| | | రవి ప్రింటర్స్ వారికి చెల్లించినది | 1,500 | |
| | | ఫర్నిచర్ ఖాతా | | |
| | | ఖర్చు ఆఫీసు టేబుల్, కుర్చీ | | |
| | | కొనుగోలు చేసినందుకు | 2,000 | |
| | | ఎలక్ట్రికల్ ఫిక్చర్స్ ఖాతా | | |
| | | ఖర్చు బి.నెం. కిరణ్ ఎలక్ట్రికల్ | | |
| | | నుంచి ఫ్యాన్ వగైరాకొనుగోలు | 5,000 | |
| | | సిండికేట్ బ్యాంక్ ఖాతా | | |
| | | ఖర్చు నగదు డిపాజిట్ | | |
| | | చేసినందున | 1,000 | |
| | | పోస్టేజి అండ్ టెలిగ్రాంస్ ఖాతా | | |
| | | ఖర్చు స్టాంపులు కొనుగోలు | | |
| | | నిమిత్తం | 10 | |
| | | సాదరు ఖాతా | | |
| | | ఖర్చు టీ, టిఫిన్ వగైరాలకు | 20 | |
| | | | 19,580 | 42824 |
| | | | | 19580 |
| | | తేల్చిన నిల్వ | | 23244 |

Note:

1. క్యాష్ బుక్ రాస్తున్నప్పుడు - జమలను, ఖర్చులను దేనికది విడివిడిగా కూడి జమల మొత్తం నుంచి ఖర్చుల మొత్తం తీసివేస్తే క్యాష్ నిల్వ వస్తుంది. దానినే

తేల్చిన నిల్వగా చూపించాము. అదే మరుసటి రోజుకు ప్రారంభపు క్యాష్ బ్యాలెన్సుగా తీసుకోవడం జరుగుతుంది. దానిని తెచ్చిన నిల్వగా పేర్కొన్నాం. దానితో కూడా జమలను, ఖర్చులను విడివిడిగా కూడి నిల్వతేల్చాలి. ఇలా ప్రతిరోజూ తేల్చిన నిల్వ, తెచ్చిన నిల్వ రాసుకుంటూ క్యాష్‌బుక్‌లో పద్దులు నమోదు చేస్తూ పోవాలి.

2. హెడ్ ఆఫ్ అకౌంట్ రాసేటప్పుడు - నేరేషన్ వద్ద కొంత గ్యాప్ వదిలి రాస్తే లెడ్జరులో నమోదుచేయడానికి ఎక్కడ నుండి ఎక్కడవరకు వ్రాయాలో తెలికవుతుంది.

3. ఆ రోజు జరిగిన Transactions అన్నింటిని Heads వారీగా ఎన్నుకుని సిస్టమేటిక్‌గా రాయాలి. అనగా మొదటగా జమలు అన్నీ రాసి చివరగా ఖర్చులన్నీ రాస్తే బావుంటుంది. మొదట పెద్ద మొత్తాలు వాటి తరువాత చిన్న వాటిని చూపండి.

4. బ్యాంకులో నగదు జమ చేసినప్పటికి క్యాష్ బుక్‌లోని ఖర్చు కాలంలో నమోదు చేస్తాం. అదే బ్యాంకు పాస్‌బుక్‌లో జమకాలంలో నమోదై ఉంటుంది. క్యాష్ బుక్‌లో జమ కాలంలో పద్దు ఉంటే బ్యాంకు పాస్‌బుక్‌లో ఖర్చు కాలంలో నమోదుకాబడుతుంది.

మొదటి వాల్యూమ్‌లో వివరించిన ఎంట్రీస్ కాక సందర్భానుసారంగా వచ్చే మరికొన్నింటిని ఇక్కడ పరిశీలిద్దాం.

1. సంస్థకు వసూలైన చెక్కు Dishonour అయినప్పుడు, ఉదా: విష్ణువర్ధనరావు నుంచి 2-2-2001న వసూలైన చెక్కు (Cheq. No. 321 482) 10-2-2001న ఎస్.బి.ఐ.లో డిపాజిట్ చేయగా అనాదరణ పొందింది. దీనిని ఈ క్రింది విధంగా రాయాలి.

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 10-2-2000 | | Vishnuvardana Rao A/C.<br>To Ch.No. 312482/ 2-2-2001<br>Dishonour | 300 | |
| | | SBI A/c.<br>By Ch.No.321482/ 2-2-2001<br>Dishonour | | 300 |

సంస్థ నుంచి ఇచ్చిన (చెల్లింపుల) చెక్కు అయితే పైదానికి రివర్సులో రాసుకోవాలి. కాగా ఇదే ఎంట్రీని డబుల్ కాలం క్యాష్ బుక్‌లో ఈ కింద విధంగా రాస్తే సరిపోతుంది.

Receipts / Payments

| Date | L.F. | Particulars | Cash | Bank | Date | L.F. | Particulars | Cash | Bank |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | 10.2.2001 | | Vishnuvardhana Rao A/C To Ch.No. 321482 | | 300 |

తొట్రుపాటు పడకుండా ఇంతకుముందు చెక్కు వచ్చినప్పుడు చెక్కు ఇచ్చినప్పుడు ఎలా రాసామో పరిశీలించి దానికి రివర్సులో అనగా వసూళ్ళలో వ్రాస్తే చెల్లింపులలోను, చెల్లింపులలో వ్రాస్తే వసూళ్ళలోనూ రాసుకుంటే సరిపోతుంది.

2. అమ్మకాల నుంచి కొంత సరుకు వెనుకకు వచ్చినప్పుడుగాని, అమ్మిన వస్తువుల రేటు ఉన్నదానికంటే ఎక్కువగా అమ్మకం బిల్లులో చూపినప్పుడుగాని సర్దుబాటు నిమిత్తం క్రెడిట్ నోట్‌ను, అదే కొనుగోలు సంబంధమైతే డెబిట్ నోట్‌ను రాసి ఎంట్రీస్ పాస్ చేయాలి.

ఉదా : వెంకట్ అండ్ కం. వారికి 1-2-2001న అమ్మిన అరువు బిల్లు నెం: 5లో ఎమర్జెన్సీ లైట్స్ ఒక్కొక్కటి రూ.180 ఖరీదువి - రూ. 200 చొప్పున ఐదింటిని రూ. 900 లకు బదులుగా రూ. 1000 లుగా రాయడం జరిగిందనుకుందాం. దానిని 31-3-2001న మార్పు చేసి పరిశీలించినప్పుడు.

CREDIT NOTE

To
Venkat & Co., Hyderabad

No. x x x
Date : ..........

| Sl.No. | Qty. | Rate | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|---|
| 1 | 5 | 20 | Rate difference in sales B.No.5 dt.1-2-2001 | | 100 |
| | | | Total Rs. | | 100 |

పై విధంగా Credit Note లో రాసుకుని దానిని Cash book లో ఈ కింద విధంగా రాసుకోవాలి.

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 31-3-2001 | | Sale A/C<br>To Cr. Note No.1 towards rate difference in B.No.5 dt.1-2-2001 | 100 | |
| | | Venkat & Co. A/C<br>By Cr. Note No. 1 rate difference in B.No. 5 dt. 1-2-2001 | | 100 |

ఇదే డబుల్ కాలం క్యాష్‌బుక్ అయితే

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 31-3-2001 | | Sale A/c. Dr. | 100 | |
| | | To Venkat & Co. A/c. | | 100 |
| | | (towards rate defference in B.No.5 dt. 1-2-2001 | | |

ఇలా Journal లో రాసుకుని దాని నుంచి Ledger పోస్టింగ్స్ వేసుకోవాలి.

NOTE : పర్చేజికి చెందినదైతే డెబిట్‌నోట్ రాసుకుని Entry పాస్ చేయాలి.

ఫైనలైజేషన్ ఎంట్రీస్‌లో - పార్టనర్‌షిప్ ఫరం అయినప్పుడు పెట్టుబడులపై వడ్డీలు (Interest on Capitals) ఋణదాతలకు (Sundry Creditors) వడ్డీలు చెల్లించాల్సినప్పుడు ఎలా రాయాలో గమనిద్దాం.

31-3-2001 సంవత్సరానికి మురుగన్ అండ్ కంపెనీలో ఉన్న పార్టనర్స్ రమేష్, సుధీర్‌ల పెట్టుబడులకు 12% చొప్పున వడ్డీ చూపవలసి ఉన్నది. రమేష్ పెట్టుబడి రూ.55,000, సుధీర్ పెట్టుబడి రూ. 45,000 అని అనుకుందాం. ఆ పెట్టుబడులపై వడ్డీని ఈ కింది విధంగా చూపాలి.

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 31-3-2001 | | Ramesh Capital A/C | | |
| | | By Int. on Capital @ 12 % | | 6,600 |
| | | Sudheer Capital A/C | | |
| | | By Int. on Capital @ 12 % | | 5,400 |
| | | Interest A/C. | | |
| | | To Ramesh @ 12 @ % | | |
| | | on 55,000/- | 6,600 | |
| | | To Sudheer @ 12 % | | |
| | | on 45,000/- | 5,400 | |

అదే Journal ద్వారా అయితే

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 31-3-2001 | | Interest A/c Dr. | 12,000 | |
| | | To Ramesh Capital A/c. | | 6,600 |
| | | To Sudheer Capital A/c. | | 5,400 |
| | | (Interest on Capitals @ 12%) | | |

**గమనిక :** పెట్టుబడులపై వడ్డీలు లెక్క చూసేటప్పుడు పార్టనర్‌షిప్ డీడ్‌లో ఎం॥ పర్సెంటేజి సూచించారో దాని ప్రకారం లెక్కకట్టాలి. అలాగే వాడకాలు ఏమైన॥ ఉంటే మొత్తం వడ్డీ నుంచి వాడకాలపై అయ్యే వడ్డీని తగ్గించి మిగిలిన వడ్డీ॥ మాత్రమే లెక్కలలో చూపాలి.

## DISCOUNT :

అమ్మకాలపై డిస్కౌంట్స్ ఇవ్వవలసి వచ్చినపుడు ఉదా : విష్ణువర్ధనరావుకు అమ్మకం బి.నెం.6/1-2-2001 దాఖలా - రూ.300లకు 5% చొప్పున డిస్కౌంట్ ఇవ్వడం జరిగింది.

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 31-3-2001 | | Discounts A/C | | |
| | | To Discount allowed in | | |
| | | B.No.6/1-2-2001 @ 5% on | | |
| | | Rs. 300/- | 15 | |
| | | Vishnuvardhana Rao A/C | | |
| | | By Discount allowed @ 5% | | |
| | | on Rs. 300/- | | 15 |

పొరపాటు వల్ల ఒక A/Cలో రాయవలసిన ఖర్చును మరొక A/Cలో ఖర్చు రాసి ఉన్నట్లయితే మొదట రాసిన Head of A/C కి ఇప్పుడు అదే మొత్తాన్ని Credit చేసి మళ్ళీ ఒరిజినల్‌గా ఏ Head of A/C కయితే డెబిట్ చేయాలో ఆ Head of A/C కి ఖర్చు రాస్తే మొదటి రాసిన తప్పు rectify అవుతుంది. మొదట రాసిన తప్పును తుడుపులు లేకుండా పై విధంగా రాస్తే సరిపోతుంది.

## బ్యాంకు నిల్వల సమన్వయ పట్టిక
## BANK RECONCILIATION STATEMENT

వ్యాపార సంస్థలు తమ వ్యాపార నిర్వహణలో చెల్లింపులు, వసూళ్ళు బ్యాంకు ద్వారా నిర్వహిస్తున్నట్లయితే బ్యాంకు నిల్వల సమన్వయ పట్టిక (Bank Reconciliation Statement) తయారు చేసుకోవాలి. వ్యాపార సంస్థ అకౌంటు పుస్తకాలలోని బ్యాంకు ఖాతా నిల్వకు, బ్యాంకు వారిచ్చిన పాస్ పుస్తకంలోని నిల్వకు గల వ్యత్యాసాల కారణాలను ఈ పట్టిక తెలియచెప్తుంది.

ఎవరికైనా బాకలు చెల్లించాల్సి వచ్చేటప్పుడు అకౌంటు పుస్తకాలలోని నగదు మరియు బ్యాంకు నిల్వల ఆధారంగా నిర్ణయం తీసుకుంటారు. ఈ సందర్భంలో అకౌంటు పుస్తకాలకూ బ్యాంకు పాస్‌పుస్తకానికి నిల్వలలో తేడా ఉండడంవల్ల నిర్ణయం తీసుకోవడంలో ఇబ్బంది ఎదురవుతుంది. ఈ పరిస్థితి నుంచి 'బ్యాంకు నిల్వల సమన్వయ పట్టిక' ద్వారా బయటపడవచ్చు. మరి - ఈ పట్టిక స్వరూప స్వభావాలెలా ఉంటాయో, దాన్నెలా తయారు చేస్తారో తెలుసుకుందాం.

బ్యాంకు నిల్వల సమన్వయ పట్టికను రూపొందించేందుకు గల ఆవశ్యకతను తెలుసుకోవడానికి వ్యాపారికి బ్యాంకు వారికి మధ్య జరిగే వ్యవహారాలను పరిశీలించాలి. బ్యాంకులో ఖాతా ప్రారంభించాక లావాదేవీలను బ్యాంకు వారెలా పాస్ పుస్తకంలో నమోదు చేస్తారో వాటిని అకౌంటు పుస్తకాలలో ఎలా పేర్కొంటారో గమనించాలి. సంస్థ అకౌంటు పుస్తకాలలోని బ్యాంకు Debit Balance బ్యాంకు పాస్ పుస్తకంలోని Credit Balance సమానంగా ఉండాలి. అలాగే బ్యాంకు నుండి Loan (అప్పు) తీసుకున్నట్లయితే సంస్థ పుస్తకాలలోని బ్యాంకు ఖాతాలో Credit Balance, బ్యాంకు Pass Book లో Debit Balance సరిసమానంగా ఉండాలి.

31-3-2001 తేదీ నాటికి అలేఖ్య ఏజన్సీస్‌వారి అకౌంటు పుస్తకాలలోని బ్యాంకు ఖాతాకు, Bank Pass Book వ్యవహారాలను పేర్కొంటూ బ్యాంకు నిల్వల సమన్వయ పట్టిక (Bank Reconciliation Statement) తయారుచేద్దాం.

1-4-2001 నాటికి అలేఖ్య ఏజెన్సీస్ వారి లెక్కల పుస్తకాలలోని బ్యాంకు ఖాతా రు.10,000 Debit Balance చూపుతోంది. ఆ తర్వాత ఈ కింది Transactions జరిగాయి.

1. 5-4-2000న Ch.No.164201 ద్వారా రు.5000 వాడకం నిమిత్తం Bank నుంచి Cash withdraw చేశారు.
2. నాగిని అండ్ కో వారి నుంచి 15-5-2000న వసూలైన రు.3000ల చెక్కును బ్యాంకులో డిపాజిట్ చేశారు.
3. ?0-6-2000న కిరణ్‌కు చెక్కు నెం.164202 దాఖలా రు.2000 చెల్లించారు.

4. 17-7-2000న రు.4000 నగదు బ్యాంకులో డిపాజిట్ చేశారు.

5. వేరే ప్రాంతం వారైన సుహాసిని అండ్ కో నుంచి వసూలు కావలసిన రు. 1500 లు బ్యాంక్ చెక్ ద్వారా వసూలు కాగా దానిని 23-9-2000న బ్యాంకులో డిపాజిట్ చేశారు.

6. Telephone Charges నిమిత్తం చెక్కు నెం.164203 దాఖలా రూ. 2790లు 10-10-2000న ఇచ్చారు.

7. నజీర్ నుంచి రావలసిన బాకి రూ.1800లకు 15-11-2000న బ్యాంకు డి.డి. అందగా దానిని బ్యాంకులో డిపాజిట్ చేశారు.

8. 21-12-2000న Electricity Charges నిమత్తం రూ.1200 చెక్కు నెం. 164204 ద్వారా చెల్లించారు.

9. మాలిక్ ఇండస్ట్రీస్ నుంచి 20-1-2000న రూ. 1450 చెక్కు ద్వారా వసూలు కాగా దానిని బ్యాంకులో డిపాజిట్ చేశారు.

10. మాలిక్ ఇండస్ట్రీస్ వారిచ్చిన రూ. 1450 చెక్కు బ్యాంకులో honour కాకుండా అనాదరణ పొందింది.

11. మణి ట్రేడర్స్‌కు 28-1-2001న చె.నెం. 164205 దాఖలా రూ. 5000 చెల్లించారు.

12. సాగర్ ఫార్మసి నుంచి వసూలైన రూ.3000లు 29-1-2001న బ్యాంకులో డిపాజిట్ చేశారు.

## అలేఖ్య ఏజన్సీస్ వారి అక్కౌంటు పుస్తకాలలో బ్యాంకు ఖాతా

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 01.04.2000 | | Opening Balance | 10,000 | |
| 05.04.2000 | | By Ch.No.164201 | | 5,000 |
| 15.05.2000 | | To Ch.No. x x x | 3,000 | |
| 16.06.2000 | | By Ch.No.164202 | | 2,000 |
| 17.07.2000 | | To Cash Deposit | 4,000 | |
| 23.09.2000 | | To Ch. No. 184361 | 1,500 | |
| 20.10.2000 | | By Ch.No. 184203 | | 2,790 |
| 15.11.2000 | | To D.D. | 1,800 | |
| 21.12.2000 | | By Ch. No. 164204 | | 1,200 |
| 20.01.2001 | | To Ch. No. x x x | 1,450 | |
| 25.01.2001 | | By Ch. No. x x x | | 1,450 |
| 28.01.2001 | | By Ch. No. 164205 | | 5,000 |
| 29.01.2001 | | To Ch. No. x x x | 3,000 | |
| | | | 24,750 | 17,440 |
| | | | 17,440 | |
| | | Balance | 7,310 | |

## బ్యాంకు వారి పాస్ బుక్

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. | Balance |
|---|---|---|---|---|---|
| 01.04.2000 | | Opening Balance | | 10,000 | 10,000 |
| 05.04.2000 | | To Ch.No.164201 | 5,000 | | 5,000 |
| 16.05.2000 | | By Clearing | | 3,000 | 8,000 |
| 15.06.2000 | | To Ch.No.164202 | 2,000 | | 6,000 |
| 17.07.2000 | | By Cash | | 4,000 | 10,000 |
| 15.10.2000 | | By Clearing | | 1,480 | 11,480 |
| 12.10.2000 | | By Ch.No. 164203 | 2,790 | | 8,690 |
| 16.11.2000 | | By Clearing | | 1,800 | 10,490 |
| 24.12.2000 | | By Ch. No. 164204 | 1,200 | | 9,290 |
| 25.01.2001 | | To Misc | 20 | | 9,270 |

అకౌంటు బుక్స్‌లోని బ్యాంకు ఖాతా నిల్వ రూ.7310లు ఉంది. మరి బ్యాంకు పాస్‌బుక్‌లో నిల్వ రూ.9270లు ఉంది. బ్యాంకు Transactions పరిశీలించినట్లయితే ఐటమ్ నెం.5 దాఖలా బ్యాంకులో 1500లు చెక్ డిపాజిట్‌కుగాను రూ.1480 మాత్రమే క్రెడిట్ చేయడం జరిగింది. ఆ చెక్కు వేరే ప్రాంతానికి చెందింది కాబట్టి క్లియరింగ్ ఛార్జెస్ కింద రూ.20 తగ్గించారు. అదే విధంగా 20-1-2000న డిపాజిట్ చేసిన Cheque Dishonour అయినందునవల్ల రూ.20/- పాస్‌బుక్‌లో డెబిట్ చేయడం జరిగింది. దానిని కేష్ బుక్‌లో ఈ కింది విధంగా ఎంట్రీ పాస్ చేయాలి. అలాగే లెడ్జర్‌లో కూడా పోస్టింగ్ చేసుకోవాలి.

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Bank commission A/C | | |
| | | To Cheq Clearing Charges | 20 | |
| | | To Cheq. Dishonour Charges | 20 | |
| | | Bank A/C | | |
| | | By Cheq Clearing Charges | | 20 |
| | | By Cheq Dishonour Charges | | 20 |

దీని ద్వారా - పుస్తకాల ప్రకారం బ్యాంకు ఖాతా నిల్వ రూ. 7310/-లు తేలుతోంది. పుస్తకాల ప్రకారం 28-1-2001న రూ.5,000/- చెల్లించడం జరిగిందిగాని మణిట్రేడర్స్ వారు ఆ చెక్కును వారి బ్యాంక్ అకౌంటులో డిపాజిట్ చేసుకుని క్లియరింగ్‌కి పంపలేదు. అలాగే రూ.3000/-ల చెక్కు బ్యాంకులో honour కాలేదు కాబట్టి Reconciliation Setlement ఈ కింది విధంగా పేర్కొనాలి.

| PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|
| Balance as per Cash Book | 7,270 | |
| Cheq. Deposited but not collected | | 3,000 |
| Cheq. issued but not presented | 5,000 | |
| | 12,270 | 3,000 |
| | 3,000 | |
| As per Bank Pass Book | 9,270 | |

కాగా వ్యాపారాభివృద్ధి కోసం Loan బ్యాంకు నుంచి తీసుకున్నారనుకోండి. ఆ Loan పై వడ్డీని ప్రతి మూడు నెలలకొకసారి లెక్కగట్టి పాస్‌బుక్‌లో చూపుతారు. దాని ఆధారంగా ఆ వడ్డీని అకౌంటు పుస్తకాలలో పద్దు నమోదు చేసుకోవాలి.

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Interest A/c. | | |
| | | To Int. Bank Loan Upto xxx | x x x | |
| | | Bank A/c | | |
| | | By Loan Int. Upto x x x | | x x x |

ది. 5-4-2000న బ్యాంకు వారు Kumar Industries వారికి 18% చొప్పున లోన్ మంజూరు చేయడం జరిగింది. ఆ loan repayment నిమిత్తము ప్రతినెలా రు.2000/- చొప్పున చెల్లించే ఏర్పాటుతో ది.1-3-2001 వరకు పుస్తకాలు రాసుకోగా ది. 3-3-2001న పుస్తకాలలోని బ్యాంకు ఖాతాకు, బ్యాంకు వారిచ్చిన పాస్‌బుక్‌కు గల వ్యత్యాసాలను పరిశీలిద్దాం.

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 05-04-2000 | | By Loan | | 50,000 |
| 01-05-2000 | | To Cash | 2,000 | |
| 01-06-2000 | | " " | 2,000 | |
| 01-07-2000 | | " " | 2,000 | |
| 01-08-2000 | | " " | 2,000 | |
| 01-09-2000 | | " " | 2,000 | |
| 01-10-2000 | | " " | 2,000 | |
| 01-11-2000 | | " " | 2,000 | |
| 01-12-2000 | | " " | 2,000 | |
| 01-01-2001 | | " " | 2,000 | |
| 01-02-2001 | | " " | 2,000 | |
| 01-03-2001 | | " " | 2,000 | |
| | | | 22,000 | 50,000 |
| | | | | 22,000 |
| | | | | 28,000 |

బ్యాంక్ వారిచ్చిన పాస్ బుక్ ఈ క్రింది విధముగా ఉన్నది.

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. | Balance |
|---|---|---|---|---|---|
| 05-04-2000 | | To Loan | 50,000 | | 50,000 |
| 05-04-2000 | | To Mis. | 200 | | 50,200 |
| 01-05-2000 | | By cash | | 2,000 | 48,200 |
| 01-06-2000 | | By cash | | 2,000 | 46,200 |
| 01-07-2000 | | By cash | | 2,000 | 44,200 |
| 31-07-2000 | | To Int. | 2160 | | 46,360 |
| 01-08-2000 | | By cash | | 2,000 | 44,360 |
| 01-09-2000 | | By cash | | 2,000 | 42,360 |
| 31-09-2000 | | To Int. | 1987 | | 44,347 |
| 01-10-2000 | | By Cash | | 2,000 | 42,347 |
| 01-11-2000 | | By Cash | | 2,000 | 40,347 |
| 01-12-2000 | | By Cash | | 2,000 | 38,347 |
| 31-12-2000 | | To Int. | 1826 | | 40,173 |
| 01-01-2001 | | By cash | | 2,000 | 38,173 |
| 01-02-2001 | | By cash | | 2,000 | 36,173 |
| 01-03-2001 | | By cash | | 2,000 | 34,173 |

ఈ వ్యత్యాసాలను ఈ క్రింది విధముగా పాస్ బుక్‌లో వ్రాసుకొని లెడ్జర్‌లో నమోదు చేసుకొంటే సరిపోతుంది.

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Stationery A/C | | |
| | | To Documentation | | |
| | | Charges for Bank Loan | 200 | |
| | | Interest A/C | | |
| | | To Int. on Bank Loan | | |
| | | (2,160 + 1,987 + 1,826) | 5,973 | |
| | | Bank A/C | | |
| | | To Documentation | | |
| | | For Loan | | 200 |
| | | To Int. Upto 1-3-2001 | | 5,973 |

యిప్పుడు ఎకౌంట్ బుక్స్‌లోని బ్యాంక్ ఎకౌంటులో వున్న రు.28,000/-లకు ఈ 200 +5,973 కలుపగా రు.34,173 పాస్‌బుక్ ప్రకారము సరి సమానమయినది.

## అంకణా
## TRA L BALANCE

ఆర్థిక సంవత్సరానికి వివిధ ఖాతాల ఆధారంగా ముగింపు లెక్కలు తయారుచేయాలి. దీని ద్వారా సంస్థ లాభనష్టాలు, ఆస్తి అప్పులు వివరాలు తెలుసుకోగలుగుతాము. ఈ వివరాల ఆధారంగా వ్యాపారం ఏ దిశగా సాగుతున్నదో అర్థం కావడమే కాక వ్యాపారాభివృద్ధికి ఏ ఏ చర్యలు తీసుకోవాలో కూడా తెల్సుకోగల్గవచ్చు. కనుక అత్యంత ప్రాధాన్యం వహించే ముగింపు లెక్కలు తయారుచేయడానికి ముందు అంకణా (Trial Balance) ను రూపొందించాలి.

ముందుగా ఆవర్జాలోని ప్రతి ఖాతాను నిల్వ తేల్చాలి. అనగా ఖాతాలోని క్రెడిట్, డెబిట్ మొత్తాలను విడివిడిగా కూడి ఎక్కువ మొత్తం నుంచి తక్కువ మొత్తాన్ని తీసివేస్తే నిల్వవస్తుంది. అలా తేల్చిన నిల్వ క్రెడిట్ వైపు ఉంటే క్రెడిట్ నిల్వ అని, డెబిట్ వైపు ఉంటే డెబిట్ నిల్వ అని అంటారు. క్రెడిట్, డెబిట్‌లు సమానంగా ఉంటే ఆఖాతాను అంకణాలో చూపనవసరం లేదు. ఆ విధంగా తేల్చిన ఖాతాల నిల్వల ద్వారా ఆవర్జాలోగల క్రెడిట్ ఖాతా నిల్వను అంకణాలో క్రెడిట్‌గాను ఆవర్జాలో డెబిట్ ఖాతా నిల్వను అంకణాలో డెబిట్ వైపున రాసి అంకణా క్రెడిట్, డెబిట్ మొత్తాలను దేనికది విడివిడిగా కూడాలి. ఇక్కడ రెండూ సరిపోవాలి. తేడా ఉండకూడదు. తేడా ఉంటే ఎక్కడో పొరపాటు జరిగి ఉంటుందని భావించి, దానిని ఈ విధంగా సరిచూసుకోవాలి.

కేష్‌బుక్ నుంచి లెడ్జరుకు పోస్టింగ్ వేయడంలోనో, ఖాతా నిల్వ తేల్చడంలోనో, కూడిక వేయడంలోనో పొరపాటు జరిగి ఉండవచ్చు. ఆ తప్పును వెదికి పట్టుకుని సరిచేసుకోవాలి. అంతేగాక క్రెడిట్‌ను డెబిట్‌గానూ డెబిట్‌ను క్రెడిట్‌గానూ చూపడంవల్ల, లెడ్జర్ నుంచి అంకణాలోకి ఖాతాలను చేర్చడంలోనో తప్పులు దొర్లి ఉండవచ్చు. వాటిని సరిచేసుకోవాలి. అందుకనే ఎప్పుడో అంకణా తయారుచేసేటప్పుడు తప్పులు వస్తే అప్పుడు అన్ని పద్దులూ పరిశోధించుకుంటూ వచ్చే బదులు ప్రతి పద్దును రాసేటప్పుడే జాగ్రత్తగా రాయాలి. మరింత శ్రద్ధగా లెడ్జరులో పోస్టింగ్ వేసుకోవాలి. ఏరోజుకారోజే రాసిన పద్దులన్నీ సరిగ్గా ఉన్నాయా అనేది చెక్ చేసుకోవడం మంచిది.

అంకణా నమూనా

ది 31-3-2001 నాటికి "Charan Fancy Centre" వారు Cash Book, Ledger, Perfect గా Maintain చేసి Balances ను తేల్చగా Ledger ఖాతాలు ఈ క్రింద విధంగా ఉండి ఉన్నాయి.

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | 1 | Capital A/C | | 95,000 |
| | 3 | Deposits | 5,000 | |
| | 4 | Rent Advance | 5,000 | |
| | 7 | Furniture | 2,000 | |
| | 9 | Scooter | 15,000 | |
| | 12 | Purchases | 1,20,000 | |
| | 21 | Sales | | 85,000 |
| | 35 | Bank | 15,000 | |
| | 41 | Mohan & Co. | | 5,000 |
| | 43 | Rahim & Co. | 17,000 | 17,000 |
| | 45 | Gopal Enterprises | | 6,000 |
| | 51 | Vishnu & Co. | 7,000 | |
| | 53 | Naga Babu | 3,000 | 3,000 |
| | 54 | Vani | 4,000 | |
| | 75 | Stationery | 900 | |
| | 76 | Licences & Renewals | 100 | |
| | 78 | Rent | 3,000 | |
| | 79 | Salaries | 5,000 | |
| | 81 | Telephone Charges | 1,600 | |
| | 84 | Postage / Telegrams | 300 | |
| | 85 | Staff Welfare | 450 | |
| | 87 | Conveyance | 300 | |

Cash Book లో ది. 31-3-2001న Cash Balance Rs. 1,350/- ఉన్నది. వీటి ఆధారంగా (అంకణా) Trail Balance ను తయారు చేద్దాం.

TRAIL BALANCE FOR THE YEAR ENDED WITH 31ST MARCH 2001

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | 1 | Capital A/C | | 95,000 |
| | 3 | Deposits | 5,000 | |
| | 5 | Rent Advance | 5,000 | |
| | 7 | Furniture | 2,000 | |
| | 9 | Scooter | 20,000 | |
| | 12 | Purchases | 1,20,000 | |
| | 21 | Sales | | 85,000 |
| | 35 | Bank | 15,000 | |
| | 41 | Mohan & Co.. | | 5,000 |
| | 45 | Gopal Enterprises | | 6,000 |
| | 51 | Vishnu & Co. | 7,000 | |
| | 54 | Vani | 4,000 | |
| | 75 | Stationery | 900 | |
| | 76 | Licences & Renewals | 100 | |
| | 78 | Rent | 3,000 | |
| | 79 | Salaries | 5,000 | |
| | 81 | Telephone Charges | 1,600 | |
| | 84 | Postage & Telegrams | 300 | |
| | 85 | Staff Welfare | 450 | |
| | 87 | Conveyance | 300 | |
| | | Cash on hand | 1,350 | |
| | | | 1,91,000 | 1,91,000 |

Debit Balance, Credit Balance సరిసమానముగా ఉన్నందున తయారుచేసిన Trial Balance Correct అని తెలియుచున్నది. ఆవర్జాలో Page No.43, Rahim & Co. మరియు Page No. 53 Naga Babu A/C Debit, Credit Totals విలువలు సరిసమానముగా ఉండుటచే వారికి చెల్లింపులుగాని, వారినుండి వసూళ్ళు గాని ఉండవు కాబట్టి వాటిని అంకణా వ్రాయడంలో వదలడం జరిగింది. ఈ

అంకణాలో ప్రారంభపు సరుకుల విలువ మాత్రమే వస్తుంది కాని, అంత్య నికర సరుకుల విలువ ఇందులో చూపటం జరుగదు. ఈ సంవత్సరంలో అంత్య నిల్వల సరుకుల విలువ రాబోవు సంవత్సరమునకు ప్రారంభపు సరుకుల విలువగా చూపబడటం జరుగుతుంది.

నోట్: చరణ్ వ్యాపారంలో లక్ష రూపాయలు పెట్టుబడిగా పెట్టినప్పటిక అందుండి సొంత వాడకం నిమిత్తం రూ.5000/- వాడకం జరిగింది కావున, పెట్టుబడిలో నుండి సొంత వాడకం మొత్తంను తగ్గించగా మిగిలిన రు.95,000 మాత్రమే అంకణాలో చూపబడటం జరిగింది.

## వర్తకపు ఖాతా
## TRADING ACCOUNT

ఈ ఖాతా ద్వారా వ్యాపారం లాభశక్తి లాభశాతం ఎంతో తెలుసుకోవచ్చు. సరుకు కొనుగోలు, అమ్మకాల వల్ల ఎంతెంత లాభం వచ్చిందీ తేలుతుంది. సరుకు కొనుగోలు ధరకు, సరుకు అమ్మకం ధరకు మధ్యగల తేడాను 'స్థూల లాభం' అంటారు. ప్రస్తుత సంవత్సరపు స్థూల లాభ నిష్పత్తిని లెక్కించి, గత సంవత్సరపు స్థూల లాభ నిష్పత్తితోపోల్చి చూస్తే వ్యాపారం యొక్క లాభశక్తి పెరుగుతున్నదో తరుగుతున్నదో తెలిసిపోతుంది. కనుక - తదనుగుణంగా వ్యాపారాభివృద్ధికి తగిన చర్యలు చేపట్టడానికి వీలుకలుగుతుంది. ఈ వర్తకపు ఖాతా ప్రయోజనం ఇదే. సంస్థ నిర్వహిస్తున్న వ్యాపారం తీరుతెన్నులపై ఒక అవగాహనకు రావడం, లాభశాతం ఎంతో తెలుసుకోవడం ఇవేగాక ఇతర సంస్థల లాభశాతంతో పోల్చుకుని దానిని అధిగమించేందుకు నూతన ప్రక్రియలు రూపొందించుకోవడానికి కూడా అవకాశం ఏర్పడుతుంది. ఇలా అభివృద్ధి దిశగా వ్యాపార సరళిని మార్చుకునేందుకు ఈ

ఖాతా ఉపయోగపడుతుంది. ఇందులో పర్చేజ్, సేల్స్, ఫ్రైట్ ఛార్జెస్ కొనుగోలు సంబంధమైన దిగుమతి కూలి, అదే కర్మాగారమైతే Wages, Electricity, Duties తదితర వివరాలు ఉంటాయి. వీటన్నింటినీ అంకణా (Trail Balance) ద్వారా తెలుసుకోవచ్చు. అయితే వాటితోపాటు Closing Stock ను కూడా తీసుకోవాలి. అది అంకణాలో ఉండదు. దీనిని స్టాక్ రిజిష్టరు ద్వారా లెక్కించి (అమ్మకం విలువ కాకుండా కొనుగోలు విలువ మాత్రమే) తీసుకోవాలి.

చరణ్ ఫ్యాన్సీ సెంటర్ వారి అంకణా నుంచి వర్తకపు ఖాతా వేసి స్థూల లాభం తెలుసుకుందాం.

**Trading Account for the year ended with 31st March 2001**

Dr. Cr.

| Particulars | Amount | Particulars | Amount |
|---|---|---|---|
| To Purchases | 1,20,000 | By Sales | 85,000 |
| Gross Profit (స్థూల లాభం) | 12,750 | Closing Stock | 47,750 |
| | 1,32,750 | | 1,32,750 |

స్టాక్ రిజిష్టరు ప్రకారం Closing Stock విలువ 47,750గా ఉంది. దానిని క్రెడిట్ వైపు చూపాలి. క్రెడిట్ వైపు వచ్చే ఖాతాల ముందు By అని, డెబిట్ వైపు వచ్చే ఖాతాల ముందు To అని రాయాలి. కాగా ఈ Trading Account ద్వారా Gross Profit (స్థూల లాభం) రు. 12,750 లుగా తేలుతుంది (85,000 + 47, 750 - 1,20,000 = 12,750)

స్థూల లాభనిష్పత్తి = స్థూల లాభం / అమ్మకాలు × 100

∴ 12750/8500 × 100 = 15%

## లాభనష్టాల ఖాతా (PROFIT & LOSS ACCOUNT)

నిర్వహిస్తున్న వ్యాపారంలో లాభం పొందుతున్నామా లేక నష్టం చవి చూస్తున్నామా అనేది తెలుసుకునేందుకు లాభనష్టాల ఖాతా తయారుచేయాలి. వర్తకపు ఖాతా(Trading Account) లో వచ్చిన Gross Profit నుంచి వ్యాపార నిర్వహణకు అయిన ఖర్చులు అనగా వర్తకపు ఖాతాలో చూపిన ఖర్చులు కాకుండా మిగిలిన ఖర్చులన్నింటినీ లాభనష్టాల ఖాతాలో డెబిట్ వైపున చూపడం జరుగుతుంది. ఆస్తులపై చూపిన Depreciation కూడా ఇక్కడ చూపాలి. ఆదాయాలుంటే (వచ్చిన వడ్డీలు వగైరా) వాటిని క్రెడిట్ వైపున చూపాలి. ఆదాయాలుంటే (వచ్చిన వడ్డీలు వగైరా) వాటిని క్రెడిట్ వైపున చూపాలి. పై అంకణా నుంచి లాభనష్టాల ఖాతాను పరిశీలిద్దాం.

### Profit and Loss Account for the year ended with 31st March, 2001

Dr. Cr.

| Particulars | Amount | Particulars | Amount |
|---|---|---|---|
| To Stat onery | 900 | By Gross Profit | 12,750 |
| " Licences & Taxes | 100 | | |
| " Rent | 3,000 | | |
| " Salaries | 5,000 | | |
| " Telephone Charges | 1,600 | | |
| " Postage | 300 | | |
| " Staff Welfare | 450 | | |
| " Conveyance | 300 | | |
| " Net Profit | 1,100 | | |
| | 12,750 | | 12,750 |

దీనిని బట్టి వ్యాపారంలో నికరలాభం (అన్ని ఖర్చులూ పోను) రూ.1100 లుగా తేలిందని మనకవగతమగుచున్నది.

## ఆస్తి అప్పుల పట్టిక
## BALANCE SHEET

ఆస్తి అప్పుల పట్టిక (Balance Sheet) ను తయారుచేయడం ద్వారా వ్యాపారం ఆర్థికస్థితిని తెలుసుకోవచ్చును. ఉన్న ఆస్తుల మొత్తం ఇతరులకు చెల్లించాల్సిన అప్పుల కంటే ఎక్కువగా ఉంటే ఆర్థికంగా బాగా ఉన్నట్లే. అలా ఎక్కువగా ఉన్న మొత్తాన్ని మూలధనం అంటారు. మరి ఆస్తుల కంటే అప్పులే ఎక్కువగా ఉంటే వ్యాపారం నష్టాల దిశగా సాగుతున్నట్లు లెక్క. దీనిని లోటు అంటారు. ఈ పరిస్థితుల్లో వ్యాపారంలో తగిన జాగ్రత్తలు తీసుకోవలసి ఉంటుంది. కాగా ఆస్తి అప్పుల పట్టికలో ఎడమవైపున అప్పులను, కుడివైపున ఆస్తులను చూపాలి. Capital Account ను Balance Sheet లో అప్పుల వైపు చూపాలి. పెట్టుబడి ఖాతా ఆ సంవత్సర ప్రారంభ నిల్వకు అదనంగా ఏమైనా పెట్టుబడిపెడితే అట్టి మొత్తాన్ని Opening Balance కు Add చేసి అందుండి ఆ సంవత్సరం సొంత వాడకాలు తీసివేయగా వచ్చిన దానికి లాభనష్టాల ఖాతాద్వారా తేల్చిన నికరలాభం కలపగా వచ్చిన దానిని Capital A/C గా చూపాలి. ఒక వేళ నష్టం వస్తే అట్టి నష్టాన్ని తగ్గించి చూపాలి. Trial Balance నుంచి Trading A/C కి, Profit & Loss A/C కి మళ్ళించగా మిగిలిన ఖాతాలను మాత్రమే Balance Sheet లో చూపాలి. Trail Balance లో క్రెడిట్ వైపున ఉన్న చెల్లించవలసిన బాకలు Sundry Creditors (ఋణదాతలు)గాను డెబిట్వైపున ఉన్న రావలసిన బాకలను Sundry Debtors ఋణగ్రస్తులుగాను పేర్కొనాలి. ముగింపు నిల్వ సరుకులు (Closing Stock) Assets వైపు చూపాలి.

## CHARAN FANCY CENTRE

Balance Sheet as on 31-3-2001

| Liabilities | Amount | Assets | Amount |
|---|---|---|---|
| Capital | 96,100 | Deposits | 5,000 |
| Sundry Creditors | 11,000 | Rent Advance | 5,000 |
| | | Furniture | 2,000 |
| | | Scooter | 20,000 |
| | | Bank Account | 15,000 |
| | | Sundry Debtors | 11,000 |
| | | Closing Stock | 47,750 |
| | | Cash on hand | 1,350 |
| | 1,07,100 | | 1,07,100 |

| | | | |
|---|---|---|---|
| వివరణ : | | CREDITORS | |
| పెట్టుబడి | 1,00,000 | Mohan & Co. | 5,000 |
| Less వాడకం | 5,000 | Gopal Enterprises | 6,000 |
| | 95,000 | | 11,000 |
| Add నికరలాభం | 1,100 | DEBITORS | |
| | 96,100 | Vishnu & Co. | 7,000 |
| | | Vani | 4,000 |
| | | | 11,000 |

సొంత వ్యాపారం కాకుండా ముగ్గురు వ్యక్తులు కలసి భాగస్వామ్య సంస్థగా ఏర్పడి వ్యాపారం నిర్వహిస్తున్నట్లయితే మొదటవారు రాసుకున్న పార్టనర్‌షిప్ డీడ్‌ను అనుసరించి లెక్కలు రాయవల్సి ఉంటుంది. ఎవరెవరికి ఎంతెంత జీతమో జీతాల ఖాతాకు ఖర్చు రాయాలి. పెట్టిన పెట్టుబడిపై వడ్డీలు లెక్కగట్టి వడ్డీ ఖాతాకు

ఖర్చురాసి, అలాగే అన్ని ఖర్చులూపోను నికరలాభాన్ని వారు మొదట అనుకున్న నిష్పత్తి ప్రకారం విభజించి Capital A/C కి జమజేయాలి. అటువంటి వాటిని క్రింద పరిశీలిద్దాం.

**31-3-2001 తేదీనాటికి Shree Hari & Co వారి అంకణా**

| PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|
| Shree Hari Capital | | 5,00,000 |
| Shree Latha Capital | | 2,00,000 |
| Sree Vishnu Capital | | 3,00,000 |
| Deposits | 20,000 | |
| Vehicle (car) | 1,50,000 | |
| Furniture & Fixtures | 20,000 | |
| Electrical Fittings | 15,000 | |
| Computer | 30,000 | |
| Opening Stock | 2,40,000 | |
| Purchases | 25,00,000 | |
| Sales | | 28,00,000 |
| Sales Returns | 10,000 | |
| Lorry Freight | 75,000 | |
| Carriage gnwards | 10,000 | |
| Sundry Creditors | | 1,50,000 |
| Sundry Debitors | 6,00,000 | |
| State Bank of India | 75,000 | |
| Printing & Stationery | 8,000 | |
| Licence & Renewals | 500 | |
| Rent | 24,000 | |
| Salaries | 30,000 | |
| Electricity | 5,000 | |

| | | |
|---|---|---|
| Telephone Charges | 7,000 | |
| Advertisement | 17,000 | |
| Donations | 5,000 | |
| Travelling Expenses | 15,000 | |
| Interest | 6,500 | |
| Insurance | 4,500 | |
| Vehicle Maintenance | 8,700 | |
| Bank Commissions | 3,100 | |
| Subscriptions | 1,750 | |
| Sundry Expenses | 1,675 | |
| Commissions | 3,500 | |
| Miscellaneous | 1,250 | |
| Staff Welfare | 3,175 | |
| Postage & Telegrams | 1,150 | |
| Conveyance | 2,200 | |
| Provision for Expenses | | 9,500 |
| Sree Hari Drawings | 25,000 | |
| Sree Latha Drawings | 15,000 | |
| Sree Vishnu | 20,000 | |
| Cash on hand | 5,500 | |
| Closing Stock విలువ = 4,53,500/- | 39,59,500 | 39,59,500 |

పైవికాక శ్రీహరి నెలకు రు.3,000, శ్రీ లత నెలకు రూ.2,000, శ్రీ విష్ణు నెలకు రు.2,500 చొప్పున జీతం పొందే ఏర్పాటు, పెట్టిన పెట్టుబడులపై 12% చొప్పున వడ్డీ తీసుకునే ఏర్పాటు, Vehicle 20 %, Computer 25%, Furniture 10%, Electrical Fans 25% చొప్పున తరుగుదల (Depreciation) ఏర్పాటు, నికరలాభం 40%, 25%, 35% చొప్పున పంచుకునే ఏర్పాటుతో Trading, Profit & Loss Accounts తో Balance Sheet తయారుచేద్దాం.

## SHREE HARI & CO.

Trading and P&L Account for the year ended with 31-3-2001

Dr. | Cr.

| | Particulars | Amount | Particulars | Amount |
|---|---|---|---|---|
| To | Opening Stock | 2,40,000 | By Sales 28,00,000 | 27,90,000 |
| " | Purchases | 25,00,000 | less returns | 10,000 |
| " | Lorry Freight | 75,000 | | |
| " | Carriage Inwards | 10,000 | Closing Stock | 4,53,500 |
| " | Gross Profit | 4,18,500 | | |
| | | 32,43,500 | | 32,43,500 |
| To | Printing & Stationery | 8,000 | By Gross Profit | 4,18,500 |
| " | Licence & Renewals | 500 | | |
| " | Rent | 24,000 | | |
| " | Salaries | 1,20,000 | | |
| " | Electricity | 5,000 | | |
| " | Telephone Charges | 7,000 | | |
| " | Advertisement | 17,000 | | |
| " | Donations | 5,000 | | |
| " | Travelling Ex. | 15,000 | | |
| " | Interest | 1,26,500 | | |
| " | Insurance | 4,500 | | |
| " | Vehicle Maintenance | 8,700 | | |
| " | Bank Commissions | 3,100 | | |
| " | Subscriptions | 1,750 | | |
| " | Sundry Expenses | 1,675 | | |
| " | Commission | 3,500 | | |
| " | Miscellaneous | 1,250 | | |
| To | Staff Welfare | 3,175 | | |
| " | Post & Telegrams | 1,150 | | |
| " | Conveyance | 2,200 | | |
| " | Depreciation | 43,250 | | |
| " | Net Profit | 16,250 | | |
| | | 4,18,500 | | 4,18,500 |

## SHREE HARI & CO.,
## Balance Sheet as on 31-3-2001

| Liabilities | Amount | Asstes | Amount |
|---|---|---|---|
| Capital | 11,66,250 | Deposits | 20,000 |
| Sundry Creditors | 1,50,000 | Fixed Assets | 1,71,750 |
| Provision for | | Sundry Debetors | 6,00,000 |
| Expences | 9,500 | Closing Stock | 4,53,500 |
| | | S.B.I. | 75,000 |
| | | Cash on hand | 5,500 |
| | 13,25,750 | | 13,25,750 |

### Schedule for fixed assets

| Name of the Asset | Opening Balance | Additions | Total | Dep. % | Depreciation | W.D.V |
|---|---|---|---|---|---|---|
| Car | 1,50,0000 | - | 1,50,000 | 20% | 30,000 | 1,20,000 |
| Computer | 30,000 | - | 30,000 | 25% | 7,500 | 22,500 |
| Furniture | 20,000 | - | 20,000 | 10% | 2,000 | 18,000 |
| Electricity | 15,000 | - | 15,000 | 25% | 3,750 | 11,250 |
| | 2,15,000 | - | 2,15,000 | | 43,250 | 1,71,750 |

### Capital A/C's

| | Investment | Int. | Salary | Total | Draw. | Balance | Net.P | Total |
|---|---|---|---|---|---|---|---|---|
| Sree Hari | 5,00,000 | 60,000 | 36,000 | 5,96,000 | 25,000 | 5,71,000 | 6,500 | 5,77,500 |
| Sree Latha | 2,00,000 | 24,000 | 24,000 | 2,48,000 | 15,000 | 2,33,000 | 4,063 | 2,37,063 |
| Sree Vishnu | 3,00,000 | 36,000 | 30,000 | 3,66,000 | 20,000 | 3,46,000 | 5,687 | 3,51,687 |
| | 10,00,000 | 1,20,000 | 90,000 | 12,10,000 | 60,000 | 11,50,000 | 16,250 | 11,66,250 |

Partners Salaries

| | | |
|---|---|---|
| Shree Hari | 3000 x 12 = 36,000 | |
| Shree Latha | 2000 x 12 = 24,000 | |
| Sree Vishnu | 2500 x 12 = 30,000 | 90,000 |

Interest on capitals

| | | |
|---|---|---|
| 5,00,000 | 12% = 60,000 | |
| 2,00,000 | = 24,000 | |
| 3,00,000 | = 36,000 | 1,20,000 |

ఇదే ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీ అయితే పార్టనర్‌షిప్ డీడ్‌కు బదులుగా మెమొరాండమ్ ఆఫ్ ఆర్టికల్స్‌ను రాసుకొంటారు. పెట్టుబడులను షేర్ కేపిటల్‌గా చూపిస్తారు. షేర్ కేపిటల్‌పై వడ్డీ వుండదు. షేర్స్ ద్వారా పెట్టుబడి పెట్టిన వారిని డైరెక్టర్స్ అని పిలుస్తారు. ఏక్టివ్ డైరక్టర్స్‌కు రెమ్యూనరేషన్ చూపుతారు. ప్రాఫిట్ అండ్ లాస్ అకౌంట్‌లో వచ్చిన లాభాన్ని డైరక్టర్స్‌కు పంచకుండా రిజర్వ్స్ సర్‌ప్లస్ అనే హెడ్‌గా Balance Sheet లో చూపి తరువాత సంవత్సరమునకు Carry Forward చేస్తారు. అట్టివాటిని Dividend రూపంగా Declare చేస్తారు.

## MANUFACTURING INDUSTRIES

ముడి సరుకులను కొనుగోలు చేసి, వాటిని ఉపయోగిస్తూ ఒక నిర్ధిష్టమైన పూర్తి వస్తువును తయారుచేసి అమ్మకాలు సాగించే సంస్థలను Manufacturing Industries అంటారు. ఈ సంస్థలు కూడా A.P.G.S.T. Act పరిధిలోకి వస్తాయి. Industry ప్రారంభించేందుకు ముందుగా R.C. తీసుకోవాలి. ముడి సరుకును ఈ రాష్ట్రంలోనే కొనుగోలు చేసి తయారైన వస్తువులను కూడా ఈ రాష్ట్రంలోనే అమ్మకాలు జరిపేటట్లయితే APGST Licence సరిపోతుంది. అలాకాక ఇతర రాష్ట్రాలతో వ్యాపారలావాదేవీలు జరపాలని అనుకున్నట్లయితే CST లైసెన్సు కూడా తీసుకోవాలి. అంటే ముడి పదార్థాలుగాని, వస్తువును తయారు చేసేందుకు అవసరమయ్యే యంత్ర సామాగ్రిగాని, ఇతర రాష్ట్రాల నుంచి కొనుగోలు చేయదలచినా లేక పూర్తిగా తయారైన వస్తువులను మరో రాష్ట్రానికి అమ్మదలచినా CST లైసెన్సు తప్పనిసరిగా తీసుకోవాలి. దీనితో పాటు 'C' Form ను ఇవ్వడం ద్వారా ఇతర రాష్ట్రాల నుంచి తగ్గింపు పన్ను (Concession Rate of Tax)

అవసరమైన వస్తువులు కొనుగోలు చేసుకోవచ్చు. 'C' Form ద్వారా ఆ రకమైన రాయితీ పొందే అవకాశం ఉంది. కాగా ప్రారంభించదలచిన యూనిట్ చిన్నతరహా పరిశ్రమ (Small Scall Industry) గా నమోదు చేసుకుంటే 'G' Form కు చెందిన ఉపయోగాలు కూడా పొందవచ్చును.

**'G' Form ముఖ్యోద్దేశం :**

పరిశ్రమ తయారుచేసే Product కు కావలసిన Raw Materials ను ఈ రాష్ట్రంలోనేగల ఇతర వ్యాపారుల నుంచి కొనుగోలు చేసేటప్పుడు 'జి' ఫారం ఇచ్చినట్లయితే టాక్స్‌లో తగ్గింపు పొందవచ్చు. అంటే Rate of Tax లో వ్యాపారి రాయితీ (తగ్గింపు) పొందడానికి ఈ 'జి' ఫారం ఉద్దేశింపబడింది. 1.8.96 నుంచి ఈ సౌకర్యాన్ని మిషనరీ వగైరా కొనుగోలుకు కూడా వర్తింపచేసారు. 'జి' ఫారం పై కొనుగోలు చేసిన సరుకులకు కేవలం 4% పన్ను చెల్లిస్తే చాలు. వాస్తవానికి కొన్ని సరుకులపై 15% మరికొన్నింటిపై 10%, ఇంకొన్నింటిపై 8% టాక్స్ రూపేణా చెల్లించాల్సి ఉంటుంది. అయితే 'జి' ఫారం ఉన్నట్లయితే సరుకులపై ఎంత ఎక్కువ Rate of Tax ఉన్నాసరే కేవలం 4% మాత్రం టాక్స్ చెల్లిస్తే సరిపోతుంది. ఇలా ముడి సరుకు కొని తయారు చేసిన ప్రతి వస్తువును 1st Sale గా పరిగణిస్తారు. అంటే Taxable Sale అన్నమాట. కాగా తయారైన Commodity Furniture కాబట్టి దీనిపై Sales Tax 12% ఉంటుంది. దీనిని అకౌంటు పుస్తకాలలో రాసుకోవాలి. అదెలాగంటే అమ్మకం బిల్లుల ద్వారా వసూలు చేసిన 12% సేల్స్ టాక్స్‌ను సేల్స్ టాక్స్ కలెక్షన్స్ అనే Head of Account కింద చూపాలి. Only Item Cost ని మాత్రమే Sales A/C క్రింద పేర్కొనాలి. దీనివల్ల పొందే

ఉపయోగం ఏమంటే అమ్మకం బిల్లులో Tax Collection అని చూపి వసూలు చేసిన మొత్తంగా మళ్ళీ Sales Tax ను Dept. వారికి టాక్స్ చెల్లించనవసరం లేదు. ఉదా : ఆఫీసు టేబుల్ రు. 1000 లకు అమ్మి దానిపై సేల్ టాక్స్ 12% చొప్పున రు. 120/- చూపి 1120/- లకు అమ్మకం బిల్లు రాయడం జరిగింది. దానిని ఈ కింది విధంగా అకౌంటు బుక్స్‌లో వ్రాయటం జరుగుతుంది.

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Sales A/C<br>By Bill No. | | 1,120 |

పై పద్దు ద్వారా అమ్మకం విలువ రూ.1120/-లుగా నమోదై ఉన్నందున ఈ మొత్తంపై సేల్స్‌టాక్స్ 12% చొప్పున 134/- చెల్లించవలసి వస్తుంది. ఈ క్రింద విధంగా రాసుకున్నట్లయితే

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Sales A/c<br>By Bill No. | | 1,000 |
| | | Sales Tax Collection A/c<br>By B.No. | | 120 |

ఈ విధంగా అమ్మకం విలువ రూ.1000 నమోదైంది కాబట్టి దీనిపై 12% చొప్పున 120 చెల్లించిన సరిపోతుంది. అమ్మకంపై వసూలు చేసే టాక్స్, అమ్మకంపై చెల్లించే టాక్స్ సమానంగా ఉండాలి. పై పద్దులో ST Rs.120/- వసూలు చేస్తాము. అదే ST ని Sales Tax Dept. వారికి చెల్లిస్తాము. అదేకాక Taxable Sales ఉన్న ఏ వ్యాపారంలోనైనా (1st Sales, TOT Sales, VAT Sales) ఈ విధంగా అకౌంట్స్ రాసుకున్నట్లయితే టాక్స్ పై మరల టాక్స్ చెల్లించే బెడద తప్పుతుందని గ్రహించవచ్చు.

Trading Business లో ఉన్న Head of Accounts Manufactring Industries లో కన్నా అదనంగా ఈ కింద పద్దులు వస్తాయి.

1. <u>వేతనాలు</u> (**WAGES**) : సరుకు ఉత్పత్తి నిమిత్తం చెల్లించే పనివారల వేతనాలు (కర్మాగారం). రోజువారిగాని, నెలవారిగాని చెల్లించే వేతనాలను కేష్ బుక్‌లో ఈ కింద విధంగా రాసుకోవాలి.

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Wages A/C<br>To wages paid to workers | xxx | |

2. Electricity : Product ఉత్పత్తి నిమిత్తం (Factory) చెల్లించే కరంటు ఖర్చులు.

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Electricity Charges A/C<br>To Rt No.<br>Towards Factory Elect. | xxx | |

3. Exise Duty : Product ను ఉత్పత్తి చేసేటప్పుడు అట్టి వాటిపై (Turnover) కొంత పరిధి దాటినట్లయితే వాటిపై Ex se సుంకాన్ని చెల్లించవలసి వస్తుంది.

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Excise Duty A/c.<br>To Rt / Ch. No.<br>for Exciseduty Paid | xxx | |

4. Office కి చెల్లించే అద్దెకాకుండా Factory కి చెల్లించే అద్దె

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Rent A/c.<br>ఫ్యాక్టరీ / వర్క్‌షాపులకై<br>చెల్లించిన అద్దె | x x x | |

పై పద్దులన్నీ కూడా Trading Account లో చూపవలసి ఉంది. ఆ తర్వాత ప్రాఫిట్ అండ్ లాస్, బ్యాలెన్స్ షీట్ మొదలైనవి యధావిధిగా ఉంటాయి.

## ఆదాయపు పన్ను
## INCOME TAX

సర్‌జేమ్స్ విల్సన్ అనేవారు 1860లో మొదటిసారిగా మనదేశంలో ఆదాయం మీద పన్ను విధించే చట్టాన్ని ప్రవేశపెట్టారు. ఆ తర్వాత భారత ప్రభుత్వం 'ఇన్‌కంటాక్స్ 1961' అనే చట్టాన్ని రూపొందించి 1962 సం॥ నుంచి అమలులోకి తెచ్చింది. అప్పటి నుంచి ఈ చట్టం అనేక మార్పులకూ గురవుతూవస్తోంది. పలువిధాలైన సవరణలతో కూడిన ఇన్‌కంటాక్స్ 1961 చట్టం ప్రస్తుతం అమలులో ఉంది. ఇండియా అంతటికి వర్తించే ఈ ఇన్‌కంటాక్స్ విధానం గురించి తెలుసుకుందాం.

నిర్దిష్ట పరిమితికి మించిన ఆదాయం కలిగిన వ్యక్తులు, సంస్థలు ఈ చట్టం పరిధిలోకి వస్తారు. చట్టపరంగా మినహాయింపులు పోగా మిగిలిన నికర ఆదాయంపై చెల్లించాల్సిన పన్నును ఆదాయపు పన్ను (Income Tax) అంటారు. ఆదాయపు పన్ను చెల్లించే వారిని Income Tax Assessee అని పేర్కొంటారు.

ప్రతి ఏడాదీ గత సంవత్సర ఆదాయంపై పన్ను లెక్కించి నిర్దేశిత గడువులోగా I.T. Department వారికి పన్ను చెల్లిస్తూ Return Forms దాఖలు చేయడం జరుగుతుంది. ఆర్థిక సంవత్సరంలో పొందే ఆదాయంపై పన్నును నిర్ధారిస్తారు.

ఆదాయాలను 5 వర్గాలుగా విభజించారు. అవి 1. Income from Salaries 2. Income from House Property, 3. Profit and Gains from Businesses or Profession, 4. Capital Gains, 5. Income from other sources. రాబడిని ఈ ఐదు వర్గాల ద్వారా నిర్ణయిస్తారు. పొందిన ఆదాయంపై మినహాయింపులు, ఇతర రాయితీలు పోగా మిగిలిన నికర ఆదాయంపై పన్ను లెక్కగట్టి చెల్లించాలి. పై సూచించిన వర్గాలలో ఎన్ని వర్గాల ద్వారా ఆదాయం వస్తుందో అన్నింటినీ కలిపి చూపడం జరుగుతుంది. Assessee కి వచ్చే ఆదాయం మొత్తాన్ని లెక్కలోకి తీసుకుంటారు. 1-4-2000 నుంచి 31-3-2001 వరకు వచ్చిన ఆదాయంపై Assessment Year 2001 to 2002 లో Assessment జరుగుతుంది. దీని కనుగుణంగా ఈ కింది వివరణ ఇవ్వడం జరిగింది.

**1. Income From Salaries :**

ఉద్యోగం ద్వారా ఏడాదికి నికరాదాయం రూ. 50,000/-లకు మించిన ఉద్యోగులు ఈ చట్టం పరిధిలోకి వస్తారు.

ఉద్యోగులు సంవత్సరంలో లక్షరూపాయల లోపు జీతం పొంది ఉంటే ఒకే మొత్తంగా రూ. 25,000/- లుగాని, పొందిన జీతం మొత్తంపై 33 1/3% గాని ఏది తక్కువగా ఉంటే దానిని Standard Deduction పేరుతో జీతం నుంచి మినహాయించ వచ్చును. ఉదా : ఒక వ్యక్తి నెలకు రు. 7,000 చొప్పున

ఏడాదికి 84,000 జీతంగా పొందాడు. దానిపై 33 1/3% తగ్గింపు రు. 28,000 అయింది. ఇందులో రు. 25,000 తక్కువ కాబట్టి జీతం మొత్తం రు. 84,000 నుంచి రు. 25,000లు తగ్గించగా మిగిలిన రూ. 59,000 Next Taxable Income అయినది. అదే జీతం లక్షరూపాయలు దాటితే Standard Deduction గరిష్ఠ పరిమితి రు. 20,000లుగా ఉంటుంది. ఒక వ్యక్తి నెలకు రూ. 9000 లు చొప్పున ఏడాదికి 1,08,000ల రూపాయలు జీతం పొందాడనుకుందాం. మొత్తం ఆదాయం లక్షరూపాయలు దాటినందున, పొందిన జీతం రూ. 1,08,000 ల నుంచి ఏకమొత్తంగా రూ. 20,000లు తగ్గించి మిగిలిన రూ. 88,000లు Next Taxable Income గా చూపుతారు. జీతం ఐదు లక్షలు దాటిన వారికి ఈ Standard deduction అనేది అసలు వర్తించదు.

**2. Income From House Property :**

నివాస గృహాలు కాని, కమర్షియల్ ఆస్తిగాని ఉండి వాటిపై వచ్చే అద్దెలపై కూడా Income Tax చెల్లించాలి. అయితే దీనికి కొన్ని మినహాయింపులున్నాయి. ఆస్తిపై ఆ ఏడాదిలో చెల్లించిన మునిసిపల్ టాక్స్ మినహాయించాలి. ఆ వచ్చే మొత్తాన్ని Net Ad usted Value అంటారు. దీని నుంచి మరమ్మత్తులకు (అయినా కాకపోయినా) 1/4 మొత్తాన్ని మినహాయించాలి. అంతేకాక ఆ గృహనిర్మాణాలకు చేసిన అప్పులపై వడ్డీలను కూడా తగ్గించవచ్చు. ఈ మినహాయింపులన్నీ పోను నికరాదాయం మాత్రమే Total Income లో కలుస్తుంది. కాగా House Property ని అద్దెకు ఇవ్వకుండా Assessee తన సొంతానికి వాడుకున్నట్లయితే నికర అద్దె విలువను Nil అని చూపాలి. నిర్మాణాలకు చేసిన అప్పులకు చెల్లించిన వడ్డీని రు. 30,000లు గరిష్ఠ పరిమితికి లోబడి మినహాయించవచ్చు.

**3. Profits and Gains from Business & Profession :**

గత ఏడాది చేసిన వ్యాపారం ద్వారాగాని వృత్తి ద్వారాగాని వచ్చిన లాభాలను ఈ Head of Income కింద వ్యక్తి ఆదాయంలో భాగంగా కలపాలి. ఇలా లాభం పొందడానికి వెచ్చించిన న్యాయ సంబంధ వ్యాపార ఖర్చులన్నీ మినహాయించుకుని Net Profit ను తేల్చాలి. సొంత వ్యాపారులు (ప్రొప్రయిటర్లు) వారి యింటి ఖర్చులకు సొంతానికి వాడుకున్న మొత్తాలు వ్యాపారపు ఖర్చులుగా పరిగణించరు. అందుకనే వ్యక్తిగత ఆదాయానికి (Individuals) కనిష్ట పరిమితి రూ.50,000ల వరకూ టాక్స్ లేకుండా నిర్ధారించడం జరిగింది. అదే గనక పార్టనర్‌షిప్ ఫరంగాని, ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీగాని, పబ్లిక్ లిమిటెడ్ కంపెనీగాని అయితే వారు సంపాదించే మొదటి రూ. 5 ల నుంచి కూడా 35% చొప్పున టాక్స్ కట్టవలసి వచ్చి Tax Amount పై 10% Surchase కూడా కలిపి చెల్లించాల్సి వస్తుంది. పార్టనర్‌షిప్ ఫరంలో పెట్టిన పెట్టుబడులపై వడ్డీలు, వర్కింగ్ పార్టనర్‌లకు ఇచ్చేజీతాలు పోను నికరలాభం తేలుస్తారు. ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీ అయితే Directors కు చెల్లించే Remunarations పోను Net Income తేలుస్తారు. ఇవి Individuals కు వర్తించవు.

**4. Capital Gains :**

ఆస్తుల అమ్మకంపై వచ్చే లాభాన్ని Capital Gains అంటారు. ఈ కేపిటల్ గెయిన్స్ పై Slab Rates తో సంబంధం లేకుండా ప్రత్యేకంగా 20% చొప్పున ఇన్‌కంటాక్స్ చెల్లించాల్సి ఉంటుంది. దీనినెలా నిర్ణయించాలో గమనిద్దాం. ఆస్తి 1981కి ముందుగా సంక్రమించి ఉన్నట్లయితే 1-4-81 నాటి ఆస్తి తాలూకు

రిజిష్టరు విలువను, అమ్మకం జరిగిన సంవత్సరంలో ఉన్న Cost inflation index తో సవరించగా వచ్చిన సేకరణ వ్యయాన్ని అమ్మకపు విలువ నుంచి తీసివేయగా మిగిలిన లాభాన్ని Capital Gain అంటారు. అదే 1981 తర్వాతి ఆస్తి అయితే ఆయా సంవత్సరాలకు వర్తించే సూచీ సంఖ్యతో సవరించి సేకరణ వ్యయాన్ని నిర్ణయించాలి.

**5. Income from other sources :**

పై ఉదహరించిన నాలుగు వర్గాలకు చెందని ఆదాయాలు, దీని కిందికి వస్తాయి. ఉదా : వడ్డీలు, ఖాళీ స్థలాలపై వచ్చే అద్దెలు, లాటరీలు, గుర్రపు పందేలు వగైరా. లాటరీలు, గుర్రపు పందేలు వంటి యాదృచ్ఛిక ఆదాయాలకు రూ. 5000 వరకు కాజువల్ మినహాయింపు ఉంటుంది. బ్యాంక్ డిపాజిట్లు, పోస్ట్ ఆఫీస్ సేవింగ్స్, యు.టి.ఐ. ల మీద వచ్చే వడ్డీలు రూ. 12,000 వరకు ఆదాయపు రాయితీ ఉంది. అదే యు.టి.ఐ. ల పై వచ్చే ఆదాయంపై అదనంగా రూ. 3000 రాయితీ ఉంది. ఈ విధంగా ఐదు వర్గాల నుంచి ఆదాయాలు తేల్చిన తర్వాత Assessee ఎన్ని వర్గాల నుంచి ఆదాయాలు పొందాడో వాటి మొత్తం కూడి Net Taxable Income గా నిర్ధారిస్తారు.

Individuals Net Taxable పై చెల్లించాల్సి వచ్చే Tax 3 Slabs గా పేర్కొన్నారు. అవి 1) 50,000 టు 60,000, 2) 60,000 టు 1,50,000, 3) 1,50,000 పైన

1. రూ. 50,000 to 60,000 : ఈ రేంజిలో ఆదాయం పొందేవారు 10% టాక్స్ చెల్లించాలి. ఈ లిమిట్ లో ఉండేవారికి టాక్స్ ఎమౌంట్‌పై సర్‌చార్జి రాదు.

ఉదాహరణకు ఒక వ్యక్తి Net Taxable Income రూ. 55,000 పొంది ఉంటే మొదటి రూ. 50,000లకు టాక్స్ లకు కాబట్టి మిగతా రూ. 5,000లకు 10% చొప్పున రూ. 500 టాక్స్ చెల్లించిన సరిపడును.

2. రూ. 60,000 to 1,50,000 : ఈ రేంజిలో ఆదాయం పొందేవారు టాక్స్ రూ.1000 + 20% on above 60,000 income surcharge 10% on Tax amount ఉదాహరణ : ఒక వ్యక్తి Net Taxable Income రూ. 95,000. ఈ రూ. 95,000లలో మొదటి రూ. 60,000 లపై రూ. 1000 టాక్స్, మిగిలిన రూ. 35,000లపై 20% చొప్పున రూ. 7,000 మొత్తం రూ. 8,000 టాక్స్. ఈ టాక్స్ పై 10% చొప్పున Surcharse of Rs. 800/- వెరశి రూ. 8,800లు చెల్లించాలి.

3. రూ. 1,50,000 అపైన : ఈ కేటగిరీలో ఆదాయం పొందేవారు టాక్స్ రూ. 19,000 + 30% Tax on above 1,50,000 income surcharge 15% on Tax amount. ఉదా : ఒక వ్యక్తి ఆదాయం రూ. 2,00,000 అనుకుందాం. ఈ రూ. 2,00,000 లలో మొదటి 1,50,000లపై 19,000 మిగిలిన రూ. 50,000లపై 30% చొప్పున రూ.15,000 మొత్తం 34,000 టాక్స్ 15% చొప్పున Surcharge of Rs.5,100 వెరశి రు. 39,100/-లు చెల్లించాలి. పైవిధంగా చెల్లించాల్సిన టాక్స్ నుంచి సేవింగ్స్‌లపై డిడక్షన్స్ తీసివేసి వచ్చిన టాక్స్‌ను సేల్స్ టాక్స్ డిపార్ట్‌మెంట్‌కు చెల్లించి రిటర్న్స్ దాఖలు చేయాలి. ఒక వ్యక్తి తాను సేవింగ్స్ చేసిన మొత్తం (P.F. ESI, LIC, ULIP, NSC) 15000 అయిన దానిపై 20 % అంటే 3000లను చెల్లించాల్సిన 39,100ల నుంచి తగ్గించి రూ.36,100 మాత్రం చెల్లిస్తే సరిపోతుంది.

**అడ్వాన్సు టాక్స్ (Advance Tax) :**

ఏడాదికి రూ. 5,000ల లోపు టాక్స్ చెల్లించేవారంతా వారు దాఖలు చేసే ఐ.టి. రిటర్న్సు తో పాటుగా పన్ను చెల్లిస్తే సరిపోతుంది. అదే రూ. 5000లకు పైబడితే ఆ పన్నును మూడు ధఫాలుగా చెల్లించాలి. 1. సెప్టెంబరు 15, 2. డిసెంబరు 15, 3. మార్చి 15 తేదీలోపుగా పన్ను చెల్లించవలసి ఉంటుంది. ఈ గడువు తేదీలను ప్రత్యేకించి గుర్తుంచుకోవలసి ఉంది.

రిటర్న్ ఫారాలను ఎప్పుడు దాఖలు చెయ్యాలి.

ఎ. జీతం ద్వారా గాని హౌస్ ప్రాపర్టీద్వారా గాని; Other Sources ద్వారాగాని ఆదాయం పొందేవారు తమ Return froms ను జూన్ 30 లోగా సంబంధిత I.T. కార్యాలయంలో టాక్స్ చెల్లించి దాఖలు చేయాలి.

బి. వ్యాపారం ద్వారా ఆదాయం పొందేవారు Individuals or Firms గాని టర్నోవర్ రూ. 40,00,000 లోపు ఉన్నవారు, అలాగే ప్రొఫెషనల్స్ వారి Gross receipts Rs. 10,00,000 లోపు ఉన్నవారు ఆగష్టు 31లోగా రిటర్న్ దాఖలు చేయాలి.

సి. బిజినెస్ ద్వారా టర్నోవరు 40,00,000 దాటినవారు, Professionals Rs. 10,00,000/- Gross receipts దాటిన వారు తమతమ అకౌంట్ పుస్తకాలను Sec 44 AB ల ప్రకారం Chartered Accountant ద్వారా ఆడిట్ చేయించి Form 3 CB & 3 CD లను రిటర్న్తో పాటుగా అక్టోబరు 31లోగా ఐ.టి. కార్యాలయంలో దాఖలు చేయాలి.

డి. ప్రైవేట్ / పబ్లిక్ లిమిటెడ్ కంపెనీ అయితే Income తోగాని సంబంధం

లేకుండా Chartered Accountant చేత Statutory Audit చేయించి నవంబరు 30 లోగా రిటర్న్ ఫారాలను ఐ.టి. కార్యాలయంలో సమర్పించాలి.

రిటెయిల్ ట్రేడ్ అయిఉండి సొంతంగా వ్యాపారలావాదేవీలు నిర్వహించుకునే వ్యాపారికి టర్నోవర్ రూ.40,00,000లకు మించినట్లయితే అతనికి Sec 44 A.F. స్కీమ్ వర్తిస్తుంది. దీని ప్రకారం అకౌంట్ పుస్తకాలలో ఉండే ఆదాయంతో నిమిత్తం లేకుండా టర్నోవర్‌పై 5% Deemed Profit గా నిర్ణయించి దానిపై ఇన్‌కమ్‌టాక్స్ చెల్లించాలి. అయితే ఈ Deemed Profit 5% కంటే తక్కువగా ఉంటుందనుకున్న వారు తమ అకౌంట్ పుస్తకాలను Chartered Accountant చేత ఆడిట్ చేయించి ఆ పుస్తకాలలో తేల్చిన లాభంపై ఇన్‌కంటాక్స్ చెల్లించవచ్చు.

లేటెస్ట్ ఆర్డర్స్ ప్రకారం హైదరాబాద్, విజయవాడ, విశాఖపట్నం, నగర వాసులకు Economic Criterion వర్తిస్తుంది. దీని ప్రకారం ఈ కింద సూచించిన వాటిలో దేనిని కలిగి ఉన్నా, దేనికి వర్తించినా ఇన్‌కంటాక్స్ రిటర్న్ ఫారం దాఖలు చేయవల్సి ఉంది.

1. సొంత టెలిఫోన్

2. సొంత నాలుగు చక్రాల వాహనం.

3. బ్యాంక్ క్రెడిట్ కార్డు.

4. రూ. 25,000 ప్రవేశ రుసుం కలిగిన క్లబ్ మెంబర్ షిప్.

5. గత సంవత్సరంలో విదేశీ ప్రయాణం చేసి ఉన్నా...

6. 1100 చ.అ. నివాస స్థలంగాని, 175 చ.అ. వ్యాపార స్థలంగాని (సొంతంగాని. అద్దెకుగాని) కలిగి ఉన్నా....

పై వాటిలో దేనికి వర్తించినా, ఆదాయ పరిమితి రూ.50,000 దాటకపోయినా ఫారం నెం. 2సి ద్వారా రిటర్న్ దాఖలు చేయాల్సిందే.

Tax Deduction at Sources (TDS)

డిపాజిట్స్ మీద ఇచ్చే వడ్డీపై TDS Deduct చేస్తారు. వడ్డీ చెల్లించేవారు Individual అయితే TDS Deduct చేయనవసరం లేదు. అదే ఒక పార్టనర్‌షిప్ ఫరంగాని, ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీగాని డిపాజిట్‌పై చెల్లించే వడ్డీ కనుక ఏడాదిలో 5000 రూపాయలు (31-5-2000 నుండి రు.2500 నుంచి రు.5000/-ల వరకు పెంచారు.) దాటితే ఆ వడ్డీపై 10% సర్‌చార్జి 1% = 11% టి.డి.యస్. తగ్గించి చెల్లించడం జరుగుతుంది. ఉదా : రవి అండ్ కో అనే సంస్థలో రమేశ్ అనే వ్యక్తి 24% వడ్డీ చొప్పున రూ. 25,000 డిపాజిట్ చేస్తే వడ్డీ మొత్తం రూ.6,000లకు గాను (వడ్డీ మొత్తం రూ.5000లకు దాటింది కాబట్టి) దానిపై 11 చొప్పున రూ.660లు రమేశ్ తరపున టి.డి.యస్. చెల్లించి మిగిలిన (6000 - 660) రూ. 5340 రవి అండ్ కో రమేశ్‌కు చెల్లిస్తుంది.

కాగా రమేశ్ తానే ఐ.టి. రిటర్న్ దాఖలా చేయాలనుకున్నప్పుడు తాను చెల్లించాల్సిన టాక్స్‌ల నుంచి టి.డి.యస్. రూ.660లు తగ్గించి మిగిలిన.మొత్తం చెల్లిస్తూ రవి & కో వారిచ్చిన ఫారం నెం.16ఎ ను ఐ.టి. రిటన్ ఫరమ్‌కు జతపర్చి ఫైల్ చెయ్యాలి. అదే రమేష్ గనుక తాను Income Tax Assessee ని గాను అని ధృవపరుస్తూ ఫారం 15 హెచ్‌ను రవి & కం.వార్కి సబ్‌మిట్ చేసినట్లయితే

వడ్డీపై టి.డి.యస్ ను డిడక్ట్ చేయకుండానే పూర్తి వడ్డీని చెల్లించడం జరుగుతుంది. ఇక ఎవరైనా కాంట్రాక్టర్లకు రు.20,000లకు పైబడి చెల్లించాల్సి వస్తే రు.2% చొప్పున టి.డి.యస్.ను డిడక్ట్ చేస్తారు. అదే అడ్వర్టయిజ్‌మెంట్ అయితే టి.డి.యస్. 1% డిడక్ట్ చేయాలి.

**రాయితీలు సెక్షన్ 88 సి ప్రకారం :** అరవై అయిదు సంవత్సరాల వయస్సు దాటిన పౌరులకు, వికలాంగులకు వారి నెట్ ఇన్‌కమ్ నుంచి స్టాండర్డ్ డిడక్షన్ గా రూ.40,000లు తగ్గించి మిగిలిన ఆదాయంపై మాత్రమే టాక్స్ వసూలు చేస్తారు. అటులనే సెక్షన్ 88సి ప్రకారం జూనియర్ ఉమెన్ సిటిజన్‌గా చెల్లించవలసిన టాక్స్‌లో రు.5000/-లు రిబేట్ ఉంటుంది.

అగ్రికల్చరల్ ఇన్‌కం ఉంటే ఆదాయం మొత్తానికి ఈ అగ్రికల్చరల్ ఇన్‌కం కలిపి టాక్స్ నిర్ణయించి, దాని నుంచి అగ్రికల్చరల్ ఇన్‌కం శ్లాబ్‌రేట్ ప్రకారం తగ్గించి టాక్స్ చెల్లించాలి.

ఉదా : Net Income Rs. 1,00,000, Agricultural Income Rs.75,000 అనుకుందాం. రు. 1,00,000 + రు. 75,000 = 1,75,000 లపై టాక్స్ రు. 29,150లు అవుతుంది. దాని నుంచి అగ్రికల్చరల్ ఇన్‌కమ్ రు. 75,000 + 50,000 (Tax Income Limit 50,000 వరకు టాక్స్ లేదు కాబట్టి దానిని Agrl. Income కు కలపాలి) 1,25,000లపై అయ్యే టాక్స్ రు.15,400 మినహాయించగా (29150 × 15400) వచ్చే రు. 13,750 టాక్స్ మాత్రం చెల్లిస్తే సరిపోతుంది.

**ఇతర ముఖ్యాంశాలు :**

రు. 20,000 లుగాని ఆపై మొత్తంగాని అప్పు తీసుకోవలసినా లేదా తిరిగి చెల్లించాల్సి వచ్చినా క్రాస్డ్ చెక్కు డ్రాఫ్టు ద్వారా మాత్రమే లావాదేవీలు జరపాలి.

సెక్షన్ 40ఎ (3) ప్రకారం రూ. 20,000లకు పైబడిన Expenditure Cash రూపేణా Payment చేయకూడదు. అలా చేసినట్లయితే ఆ మొత్తంపై 20% disallow చేసి Taxable Income కి కలపడం జరుగుతుంది. ఉదా : Cash Payment రూ. 25,000 అనుకుందాం. దానికి 20% చొప్పున రూ. 5,000లు ఖర్చుగా మినహాయించకుండా లాభానికి ఆ మొత్తం కలుపుతారు.

రిటర్న్‌తో పాటుగా ఈ కింది వివరాలు కూడా జతపర్చవలసి ఉంది.

1. Proprietor or Partners Capital A/C Copies
2. Salary Schedule
3. Interest Schedule
4. Depreciation Statement
5. Licence, Taxes & Renewals
6. Advertisement
7. Donations
8. Miscellaneous

# వృత్తి పన్ను చట్టము
# PROFESSION TAX ACT

ఈ చట్టము ది. **1-8-1996** సంవత్సరము నుండి అమలులోకి రావడం జరిగింది. చేయుచున్న వృత్తి ననుసరించి ఈ పన్ను నిర్ణయించడం జరుగుతుంది.

1. APGST Act కింద రిజిష్టరు చేయబడిన Dealers వారియొక్క వార్షిక టర్నోవరు పరిధులను బట్టి ఈ క్రింది విధముగా టాక్స్ నిర్ణయించడం జరిగింది.

| | | | | |
|---|---|---|---|---|
| a) | Bellow One Lakh | | | No Tax |
| b) | 1,00,000 | to | 2,00,000 | 300 |
| c) | 2,00,000 | to | 5,00,000 | 550 |
| d) | 5,00,000 | to | 10,00,000 | 880 |
| e) | 10,00,000 | to | 25,00,000 | 1200 |
| f) | 25,00,000 | to | 50,00,000 | 1500 |
| g) | 50,00,000 | and above | | 2500 |

వ్యాపారం నిర్వహించేవారు Individual Persons (సొంత వ్యాపారి) అయ్యేటట్లయితే చేయుచున్న వ్యాపారం పేరుతో దానియొక్క టర్నోవర్‌ను బట్టి పై విధమైన స్లాబ్స్ ననుసరించి టేక్స్ చెల్లిస్తే సరిపోతుంది. అదేగనుక చేయుచున్న వ్యాపారము భాగస్వామ్య సంస్థ అయ్యేటట్లయితే సంస్థ పేరుతో టాక్స్ చెల్లించినప్పటికి వ్యాపారపు టర్నోవర్‌తో నిమిత్తం లేకుండా అందుండే పార్టనర్స్ అందరూ కూడా రు. 500 చొప్పున కట్టవలసి ఉంటుంది. యిదే పార్టనర్ వేరొక

ఫరంలో పార్టనర్ అయి ఉండిఉన్నా లేక వేరు వ్యాపారాలకు ప్రొప్రయిటర్ అయివుండి ఉన్నా రెండవసారి అతను టాక్స్ చెల్లించనవసరంలేదు.

వ్యాపార సంస్థకు వేరువేరు ప్రాంతాల్లో (ఎ.పి) బ్రాంచీలు ఉన్నట్లయితే హెడ్ ఆఫీసుల్లో టాక్స్ మాత్రం చెల్లించిన సరిపోతుంది. బ్రాంచీల యందు హెడ్ ఆఫీసుల్లో చెల్లించిన టాక్స్ రశీదు ఫొటో కాపీని ఉంచుకొని అధికారులెవరైనా అడిగినప్పుడు చూపించిన మరల బ్రాంచీలలో కట్టనవసరం ఉండదు.

చేయుచున్న వ్యాపారము ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీ అయినట్లయితే టర్నోవర్‌తో నిమిత్తం లేకుండా రు.2,500/- చెల్లించవలసి ఉన్నది. అందుండు డైరెక్టర్స్ కూడా రు.2,500/- చొప్పున చెల్లించవలయును.

2. జీతములు మరియు వేతనములు సంపాదించువారు వారియొక్క నెలసరి ఆదాయము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1. | 1500 | వరకు ఉన్నట్టయితే | | | | ఏమీలేదు |
| 2. | 1,500 | నుంచి | 2,000 | వరకు | నెలకురు. | 16 |
| 3. | 2,000 | ” | 3,000 | ” | ” | 25 |
| 4. | 3,000 | ” | 4,000 | ” | ” | 35 |
| 5. | 4,000 | ” | 5,000 | ” | ” | 45 |
| 6. | 5,000 | ” | 6,000 | ” | ” | 45 |
| 7. | 6,000 | ” | 10,000 | ” | ” | 80 |
| 8. | 10,000 | ” | 15,000 | ” | ” | 100 |
| 9. | 15,000 | ” | 20,000 | ” | ” | 150 |
| 10. | 20,000 | ”ఆపై | | | ” | 200 |

**3. Contractors :**

| | |
|---|---|
| ప్రభుత్వము వారిచే ధృవీకరింపబడిన | |
| క్లాస్ వన్ కాంట్రాక్టర్స్ | 2,500 |
| క్లాస్ టు కాంట్రాక్టర్స్ | 1,500 |
| క్లాస్ త్రీ కాంట్రాక్టర్స్ | 500 |
| పై కేటగిరిలోకి రానటువంటి 10,00,000/-ల లోపు ఉన్నట్లయిత | 500 |
| మించి ఉన్నట్లయితే | 1,500 |
| 4. Nursing Homes, Hospital | 2,500 |
| 5. Pathological testing Lab & X-Ray Clinic | 550 |
| 6. Theatres | 2,500 |
| 7. Cable T.V. Operators | 2,500 |
| 8. Beauty Parlours & Dry Cleaners | 500 |
| 9. Residential Hotels (Not Less than 20 Rooms) | 2,500 |
| 10. Video Casette Libraries | 660 |
| 11. Photo Copying | 550 |
| 12. Medical Practitioners | |
| a. 2 years or more but less than 5 year practice | 1000 |
| b. 5 years or more practice | 2,500 |
| 13. Educational Institutions Tutorial College | 2,500 |
| 14. Type Writing / Short hand/Industries | 750 |
| 15. STD / ISD Booths | 250 |
| 16. Property Developers | 2,500 |

| | | |
|---|---|---|
| 17. | Courier Services | 1500 |
| 18. | Marriage Halls | 2500 |
| 19. | Money Lenders | |
| | a. Fiften lakhs and above | 2,500 |
| | b. Other than the above | 500 |
| 20. | Driving Institutes | 500 |
| 21. | Petrol / Diesel / Filling, Service Stations | 2,500 |

## LABOUR ACT (LICENCES, SALARIES, REGISTRERS

ప్రతి అకౌంటెంట్ లేబర్ యాక్ట్ గురించి క్షుణంగా తెలుసుకోవలసి ఉంది. అకౌంట్ రాసేటప్పుడు ఎవరెవరికి ఎంతెంత జీతాలు ఇవ్వాలో వారివారి కేటగిరీని అనుసరించి ఏయే సదుపాయాలు వర్తిస్తాయో తెలుసుకోవలసి ఉంటుంది.

షాప్స్ అండ్ ఎస్టాబ్లిష్‌మెంట్స్, ఆటోమొబైల్స్, ఇంజనీరింగ్, వర్క్‌షాపులు, ఆస్పత్రులు, నర్సింగ్ హోమ్‌లు, హోటల్స్, - రెస్టారెంట్స్, సినిమా హాల్స్, రైసుమిల్లు తదితర సంస్థలలోని ఉద్యోగులకు చట్టం ప్రకారం కనీస వేతనాలు ఏ విధంగా ఉన్నాయో తెలుసుకోవాలి. అలాగే యాక్టుకు సంబంధించిన రికార్డుల గురించి లైసెన్సు ఫీజుల గురించి కూడా తెలుసుకోవాలి.

మినిమం వేజస్ యాక్టు అనేది 1948లో ప్రారంభమైంది. ఈ యాక్టుకు సంబంధించి కేంద్రంలో 1950లోనూ, రాష్ట్రంలో 1960లోనూ నిబంధనలు ఈ క్రింది విధంగా రూపొందించారు.

వ్యాపారం ప్రారంభించింది మొదలు ఒక నెలలోగా సంబంధిత లేబర్ ఆఫీసర్ కార్యాలయం నుంచి లైసెన్స్ పొంది ప్రతి ఏటా నవంబర్‌లో రెన్యువల్ చేయించు కోవాలి. నవంబర్‌లో కుదరక డిసెంబర్‌లో రెన్యువల్ చేయించవలసి వస్తే, 25% అధికంగా చెల్లించాలి. అదే జనవరిలో అయితే కాంపౌండింగ్ ఫీ రు.50/-లు, వర్కర్సు ఉంటే రు.50/-లు జరిమానా, లేనట్లయితే రూ.25/-లు అదనంగా చెల్లించాలి.

సంస్థలో వర్కర్సు లేనట్లయితే లైసెన్సు ఫీజు రూ.10/-లు చెల్లించాలి. వీరు మూడేళ్ళకొకసారి రెన్యువల్ చేయించుకోవచ్చు. మరి వర్కర్స్ ఉన్నట్లయితే ఈ క్రింది విధంగా చెల్లించాలి.

| ఉద్యోగుల సంఖ్య | ఫీజు (రూ.లలో) | ఇతరాలు |
|---|---|---|
| 1-5 | 50 | వెల్‌ఫేర్ ఫండ్ క్రింద ప్రతి ఉద్యోగికి రూ. 7 చొప్పున |
| 6-9 | 100 | " |
| 10-19 | 200 | " |
| 20 - 49 | 500 | " |
| 50 ఆపైన | 1000 | " |

ఉద్యోగులున్న ప్రతి సంస్థ కూడా రికార్డులను మెయింటెయిన్ చేస్తూ సంబంధిత అధికారులు తనిఖీకి వచ్చినప్పుడు వారికి చూపించాల్సి ఉంది. ఆ రికార్డులను ఈ క్రింది విధంగా పేర్కొనవచ్చు.

1. ఫారం ××11 హాజరు రిజిష్టరు, 2. × జీతాల రిజిష్టరు, 3. × 1వేజెస్ స్లిప్స్, 4. ××V1కి అపాయింట్‌మెంట్ ఆర్డర్సు, 5.××V సెలవుల రిజిష్టరు.

సంస్థలలో పనిచేసే ఉద్యోగులందరికీ ఈ యాక్టు ద్వారా చెల్లించాల్సిన జీతాలను బేసిక్ + వేరియేబుల్ డేర్‌నెస్ అలవెన్స్ (వి.డి.ఎ.)గా నిర్దేశిస్తారు. ఉద్యోగి కేడరును బట్టి ఈ వి.డి.ఏ.ను పాయింట్స్ వారీగా నిర్ణయిస్తారు. జి.ఓ. ఎన్ని పాయింట్లు చెల్లించాలని సూచిస్తుందో తదనుగుణంగా లెక్కడతారు. ఈ వి.డి.ఎ. ప్రతి సంవత్సరం ఏప్రిల్, మరియు అక్టోబర్ నెలలో మారుతూ ఉంటుంది. బేసిక్ స్థిరంగా ఉంటుంది. అయితే ఉద్యోగాన్ని బట్టి అయిదు లేక పది సంవత్సరాల కొకసారి బేసిక్ మారే అవకాశం ఉంది.

1-11-2000 నాటికి అమలులో ఉన్న జి.ఓ.ప్రకారం - వివిధ ఉద్యోగులకు చెల్లించాల్సిన జీతాలు ఈ కింది విధంగా ఉన్నాయి.

**1. షాప్స్ అండ్ ఎస్టాబ్లిష్‌మెంట్స్ (వి.డి.ఎ. 234 పాయింట్లు)**

| డిజిగ్నేషన్ | బేసిక్ రు. | పాయింట్ విలువ రు. | వి.డి.ఎ మొత్తం | చెల్లించాల్సిన మొత్తం |
|---|---|---|---|---|
| మేనేజర్ | 1350 | 5.50 | 1287 | 2637 |
| అకౌంటెంట్ / సూపర్‌వైజర్ | 1080 | 5.50 | 1287 | 2367 |
| సేల్సుమేన్ / రిప్రజెంటేటివ్ / గుమస్తా / గొడౌన్‌ఇన్‌చార్జి/ | 1015 | 5.50 | 1282 | 2367 |
| టైపిస్ట్ / రిసెప్షనిష్టు | 880 | 4.75 | 1112 | 1992 |
| అటెండర్ / హెల్పర్ /క్లీనర్ | 750 | 4.25 | 995 | 1745 |

### 2. ఆటో మొబైల్ ఇంజనీరింగ్ / వర్క్‌షాప్స్ (వి.డి.ఎ. 224 పాయింట్లు)

| డిజిగ్నేషన్ | బేసిక్ రు. | పాయింట్ విలువ రు. | వి.డి.ఎ మొత్తం | చెల్లించాల్సిన మొత్తం |
|---|---|---|---|---|
| సూపర్‌వైజర్ | 1150 | 6.25 | 1400 | 2550 |
| అకౌంటెంట్ | 1080 | 5.90 | 1322 | 2402 |
| టి.పి. ఆపరేటర్ / క్యాషియర్ | 1015 | 5.50 | 1232 | 2247 |
| టైపిస్ట్ | 945 | 5.00 | 1120 | 2065 |
| గుమస్తా | 810 | 4.50 | 1008 | 1818 |
| అటెండర్ | 675 | 3.90 | 834 | 1549 |
| ఫోర్‌మెన్ | 1620 | 8.50 | 1904 | 3524 |
| వెల్డర్/ఫిట్టర్/టర్నర్ | 1080 | 5.90 | 1322 | 2402 |

### 3. ఆస్పత్రులు / నర్సింగ్‌హోమ్స్ (వి.డి.ఎ.133 పాయింట్లు)

| డిజిగ్నేషన్ | బేసిక్ రు. | పాయింట్ విలువ రు. | వి.డి.ఎ మొత్తం | చెల్లించాల్సిన మొత్తం |
|---|---|---|---|---|
| మేనేజర్ | 1947 | 10 | 1330 | 3277 |
| స్టాఫ్ నర్సు / అకౌంటెంట్ | 1348 | 7 | 931 | 2279 |
| టైపిస్ట్/టి.పి.ఆపరేటర్/ వాచ్‌మెన్/అటెండర్/డ్రైవర్/ నర్సు (5ఏళ్ళ లోపు సర్వీసు/ రికార్డు కీపర్/మిడ్‌వైఫ్/ కాంపౌండర్ | 1127 | 6 | 798 | 1925 |
| జూనియర్ డాక్టర్ | 2289 | 11.75 | 1563 | 3852 |
| ఆయుర్వేద, హోమియో డాక్టర్లు | 2149 | 11 | 1463 | 3612 |
| స్కావెంజర్ / వార్డుబోయ్ | 912 | 5 | 645 | 1577 |

## 4. హోటల్స్ / రెస్టారెంట్స్ (వి.డి.ఎ. 234 పాయింట్లు)

| డిజిగ్నేషన్ | బేసిక్ రు. | పాయింట్ విలువ రు. | వి.డి.ఎ మొత్తం | చెల్లించాల్సిన మొత్తం |
|---|---|---|---|---|
| మేనేజర్ | 1350 | 7.25 | 1697 | 3047 |
| అకౌంటెంట్/హెడ్‌క్లర్క్/ సర్వర్‌మాస్టర్/ | 1080 | 5.75 | 1346 | 2426 |
| కుక్/బేకర్/క్యాషియర్/ టైపిస్ట్ | 945 | 5.00 | 1170 | 2115 |
| సూపర్‌వైజర్/టి.పి.ఆపరేటర్/ గుమస్తా/స్టోర్‌కీఫర్/గ్రైండర్ | 850 | 4.75 | 1112 | 1962 |
| సప్లయిర్/వెయిటర్/టీమేకర్/ వాచ్‌మేన్/రూమ్‌బాయ్/ వెజిటబుల్ కట్టర్ | 810 | 4.50 | 1053 | 1863 |

## 5.సినిమాహాల్స్ (వి.డి.ఎ. 234 పాయింట్లు)

| డిజిగ్నేషన్ | బేసిక్ రు. | పాయింట్ విలువ రు. | వి.డి.ఎ మొత్తం | చెల్లించాల్సిన మొత్తం |
|---|---|---|---|---|
| మేనేజర్ | 1620 | 6.50 | 1521 | 3141 |
| ఆపరేటర్ | 1215 | 6.50 | 1521 | 2736 |
| అసిస్టెంట్ ఎ.సి.ఆపరేటర్ | 1015 | 5 | 1170 | 2185 |
| అకౌంటెంట్/క్యాషియర్ | 945 | 5 | 1170 | 2115 |
| బుకింగ్ క్లర్క్ | 840 | 4.50 | 1053 | 1893 |
| గేట్‌కీపర్ / ఆఫీస్‌బాయ్ / వాచ్‌మేన్ | 750 | 4.25 | 995 | 1745 |

6. రైస్ మిల్లు (వి.డి.ఎ. 234 పాయింట్లు)

| డిజిగ్నేషన్ | బేసిక్ రు. | పాయింట్ విలువ రు. | పాయింట్ల మొత్తం | చెల్లించాల్సిన మొత్తం |
|---|---|---|---|---|
| మిల్లు డ్రైవర్ / మెకానిక్ | 745 | 4.00 | 936 | 1681 |

గమనిక :

ఉద్యోగికి నెలంతా భోజన సదుపాయం కల్పిస్తే రూ.110, వసతి కల్పిస్తే రు.15 చొప్పున జీతాల నుంచి తగ్గించవచ్చును. ఉద్యోగి తనంతతానుగా ఉద్యోగం నుంచి వైదొలిగితే - ఏడాదికి 15 రోజుల చొప్పున లెక్కించి గ్రాట్యుటీగా చెల్లించాలి. ఎన్నేళ్ళు సర్వీసు ఉంటే అన్ని 15 రోజులు లెక్కించాలి. ఆర్నెల్లు సర్వీసు గలవారికి ఇది వర్తించదు. ఒకవేళ ఉద్యోగిని యజమాని తొలగిస్తే పైగ్రాట్యుటీతో పాటుగా అదనంగా ఒక నెల జీతం కూడా ఇవ్వాలి.

ఎరన్డ్ లీవ్‌లు ఏడాదికి 15 ఉంటాయి. వీటిలో 8 రోజులు ఏ ఏడాదికా ఏడాది జీతం చెల్లించాలి. మిగిలిన 7 రోజులు ఉద్యోగం మాని వెళ్ళేటప్పుడు ఎన్‌క్యాష్ చేసుకోవచ్చు. అటువంటివి 60 రోజులకు మించి ఉండకూడదు. ఉదా : ఏడాదికి 7 రోజుల చొప్పున 10 ఏళ్ళకు 70 రోజులకుగాను 60 రోజులకు మాత్రమే చెల్లిస్తారు.

## కార్మిక భవిష్యనిధి చట్టం1952 (EPF)

## EMPLOYEES PROVIDENT FUND ACT

ఉద్యోగం విరమించిన తర్వాత వృద్ధాప్య దశలో కార్మికులకు ఆర్థిక ప్రయోజనాలు కలిగించేందుకుగాను ఈ సంక్షేమ చట్టాన్ని రూపొందించారు. ఉద్యోగం చేస్తున్న కాలంలో కార్మికుడి జీతం నుంచి కొంత, యాజమాన్యం నుంచి కొంత ఈ పథకంలో జమ అవుతుంది. జౌళి, పేపరు, ఇనుము, ఉక్కు, ఇంజనీరింగ్, మెకానికల్, ఎలక్ట్రికల్, సిమెంట్ తదితర పరిశ్రమలకే గాక ఫ్యాక్టరీలకు, సంస్థలకు కూడా ఈ చట్టం వర్తిస్తుంది. 1952లో ప్రారంభమైన ఈ చట్టం ఇప్పటి వరకూ అనేక మార్పులు పొందుతూ వస్తోంది.

20 మంది ఉద్యోగులు అంతకంటే ఎక్కువమంది పనిచేసే సంస్థలు. అయితే సినిమా థియేటర్స్‌కు మాత్రం 5గురుకన్నా ఎక్కువమంది పనిచేయుచున్నా మరియు కేంద్రం గుర్తించిన సంస్థలు. ఈ చట్టం పరిధిలోకి వస్తాయి. అలాగే రు.5000 వరకు వేతనం పొందే వారందరికి ఈ చట్టం వర్తిస్తుంది. 20 మంది కంటే తక్కువ ఉద్యోగులు కలిగిన సంస్థలు కూడా తమంతతాముగా వాలంటరీగా ఈ స్కీములో చేరవచ్చు. పై వార్కి వర్తించే సదుపాయాలన్ని వీరికి కూడా వర్తిస్తాయి. ఈ చట్టంలో చేరినవారందరికీ కోడ్‌నెంబరు కేటాయిస్తారు.

ఈ చట్టం కింద మూడు పథకాలున్నాయి. ఉద్యోగుల భవిష్యనిధి పథకం (1952), ఉద్యోగుల కుటుంబ పింఛను పథకం (1971) (ప్రస్తుతం ఈ పథకం

ఉద్యోగుల పింఛను పథకం (1995)లో చేరింది), ఉద్యోగులకు డిపాజిట్‌తో కూడిన భీమా పథకం (1976).

ఉద్యోగి వేతనం బేసిక్, డి.ఎ.ల మీద 12 శాతం ఉద్యోగి షేర్‌గాను అంతే మొత్తం యాజమాన్యం షేర్‌గానూ ప్రావిడెంట్ ఫండ్ డిపార్టుమెంట్ వారికి ఉద్యోగి పేరున జమ చేస్తారు. ఒక ఉద్యోగి పదేళ్ళ సర్వీసుతో పదవీవిరమణ చేస్తే అతని పి.ఎఫ్. నుంచి కంపెనీ చెల్లించిన 12 శాతంలో 8.33 శాతం మంత్లీ పెన్షన్ ఫండ్‌కు చేరగా మిగిలిన 3.67 శాతం మరియు ఉద్యోగి చెల్లించిన 12 శాతం తిరిగి ఇస్తారు. నెలకు రు.500 చొప్పున పెన్షన్ రూపేణా ఉద్యోగికి చెల్లిస్తారు. ఉద్యోగి సర్వీసు 25 సంవత్సరాలు ఉంటే రిటైరైన సమయానికి అతనికి భార్యకు కూడా పెన్షన్ సౌకర్యం, 25 ఏళ్ళలోపు ఇద్దరు పిల్లలకు రు.115 నుంచి 275 ల వరకు విద్య నిమిత్తం చెల్లించే సదుపాయం ఉంటుంది. ఉద్యోగి కేవలం నెలరోజులు పనిచేసి డ్యూటీలో ఉండగా మరణిస్తే అతని భార్యకు 50 శాతం జీతం పెన్షన్‌గా చెల్లిస్తారు.

Minimum Rates of Wages in A.P.

by Ramanu das

# ప్రశ్నాపత్రం

1) Murahari & Co వారి నుండి వసూలైన రు. 11,000/-లు Bank లో Deposit చేయగా అనాదరణ పొందడం (dishonour) జరిగింది. అన్నిరకాల Cash Book లో వ్రాసి లో ledger నమోదు చేయండి.

2) Partners Capitals పై వడ్డీ 15% చొప్పున అన్నిరకాల Cash Book ద్వారా చూపండి.

A) Lavanya 2,50,000
B) Madhuri 1,45,000
C) Trirupal 1,70,000

3) Jayasree & Co వారి నుండి వసూలైన రూ. 12,500/-ల చెక్కు బ్యాంక్‌లో డిపాజిట్ చెయ్యగా పాస్‌బుక్‌లో రూ.12,455లు మాత్రమే క్రెడిట్ చేయడం జరిగింది. బ్యాంక్ reconciliation ద్వారా ఏ విధమైన entry pass చేసుకోవాలి? (3 types of cash books లోనూ)

4). Opening Stock, Closing Stock చూపవలసిన అవసరం ఎక్కడెక్కడ వస్తుంది?

5) Gross Profit, Balance Sheet తయారు చేయటంవలన ఉపయోగమేమిటి?

6) ఋణగ్రస్తులకు Debitors ఋణదాతలకు Creditors కు గల తేడా ఏమిటి ? వారిని ఎలా నిర్ధారిస్తారు ?

7) Fixed assets schedule తయారు చేయండి

A) ప్రారంభపు నిలవలు ఈ క్రింది విధముగా ఉన్నాయి. Car Rs.3,25,000, Scooter Rs.32,000, Furniture Rs. 21,500, Mechinary Rs. 1,15,000లు

B) ఈ సం॥లో కొనుగోలులు Furniture Rs. 4,500, Machinery Rs.21,000, Typewriter Rs.6150

C) Furniture, Type Writer పై 10%, Machinery పై 25% Car, Scooter పై 20% చొప్పున Depreciation చూపండి

8) Maheswari యొక్క నెల జీతం రూ. 8150లు, ఆ సం॥లో LIC, ULIP etc రూ. 3500/- లుగా ఉన్నాయి. నికరాదాయం తేల్చి Income Tax కట్టాలా, కట్టనవసరం లేదా, కట్టవలసివస్తే ఎంత ఎప్పటిలోగా కట్టి returns file చెయ్యాలి.

9) Renuka Enterprises వారి నికరాదాయం 181.500/-లు Agricultural Income Rs. 42,000/- కూడా ఉన్నది. వారి యొక్క Yearly Turnover కోటియాభై లక్షలు, ఆ సంఖ్యలో వారి యొక్క Savings (LIC etc) Rs.22,150/- లుగా ఉన్నాయి. వారు ఆ సం॥నకు చెల్లించవలసిన ఇన్‌కంటాక్స్ వివరము ఐ.టి. రిటర్న్స్ ఎప్పటిలోగా ఫైల్ చెయ్యవలసి వచ్చేది తెలపండి.

10) Sales లో నుండి Sales tax collection ను విడదీసి Accounts వ్రాయడం వలన వచ్చె ప్రయోజనమేమిటి? ఈ క్రింది పేర్కొన్న వాటిని రెండు రకాలుగాను వ్రాసి ఏ రకంగా అయితే ఎంతెంత టాక్స్ చెల్లించవలసి వస్తుందో విశదీకరించండి? A. Bill No.16 లో = Matereal cost రూ1500/- దానిపై Tax 12% చొప్పున రూ.180 కలిపి Bill Value Rs. 1680/-B) Bill No.21 Material cost Rs.11,000/- దానిపై వసూలు చేసిన Tax 8% చొప్పున రూ.880/-లు కలిపి అమ్మకం బిల్లు ద్వారా వసూలైన మొత్తం రూ.11,880/-

1) Nirgun & Co వారి దాని Yearly Turnover రూ. 3,85,420/- లు దాని యందు Ajay, Vinay, Sanjay అనే Partners కలిసి Business నిర్వహిస్తున్నారు. అందులో Vinay అనేవారు వేరే ఫరంలో కూడా Partner అయిఉన్నారు. Firm కుగాని, పార్ట్‌నర్‌కుగాని, ఎంతెంత Profession Tax చెల్లించవలసి వస్తుంది?

2) Labour Act ప్రకారం ఏ ఏ Registers maintain చెయ్యాలి. Nursing Home లో Nurse కు, Restaurent లో Cashier కు ఎంతంత Salery pay చెయ్యాల్సి వస్తుంది?

## బి ఎలెర్ట్...

వచ్చే మూడో వాల్యూమ్‌లో అత్యంత ప్రధానమైన అంశాలు ఉంటాయి. ఎంతో ప్రాముఖ్యం వహించే చిట్‌ఫండ్ కంపెనీలు, ప్రైవేట్ అండ్ పబ్లిక్ లిమిటెడ్ కంపెనీలకు సంబంధించిన Ba ance Shee-s, ప్రొపెషనల్స్... డాక్టర్లు వగైరా, అసోసియేషన్స్ వీటికి సంబంధించిన బాలెన్స్ షీట్స్ మరియు వివిధ రకాలైన అకౌంట్స్ వివరణలు ఉంటాయి.

# విజ్ఞప్తి

కామర్స్‌లో డిగ్రీ తీసుకొనికూడా ప్రాక్టికల్‌గా అక్కౌంట్స్ రాయలేని పరిస్థితి నెలకొని వున్నదనేది అందరికి తెలిసిందే. ప్రాక్టికల్ అక్కౌంట్స్ నేర్చుకోవాలనే తపన ఉన్నప్పటికి నేర్పేవారు లేకపోవడంతో అనేక మంది తీవ్ర నిరాశకు లోనవడం గమనించి వారి అవసరాల మేరకు అక్కౌంట్స్ నేర్పించి మార్గదర్శకంగా ఉండేందుకే నేను ఈ రచన గావించటం జరిగింది. ఆసక్తిగలవారికి బిజినెస్ అక్కౌంట్స్ నేర్పించి తద్వారా వారి స్వయం ఉపాధికి మార్గం సుగమంచేయడం, ఇప్పటికే చిన్న చిన్న సంస్థలలో అక్కౌంట్స్ రాస్తున్నవారికి వారి పరిజ్ఞానాన్ని మరింత మెరుగుపర్చడం, వ్యాపారులకు కూడా తమ వ్యాపారం విస్తృతపరచుకునేందుకు దోహదపడడమే మా ప్రధాన ధ్యేయం. మా యీ ధ్యేయసాధనకు అందరూ సహకరించి ప్రాక్టికల్ అక్కౌంట్స్ నేర్చుకొని తగిన ప్రయోజనం పొందవలసిందిగా కోరుతున్నాం.

మరో మాట :

మా పాఠాలలో వివరించిన వివిధ యాక్టులను బిజినెస్ అక్కౌంట్స్‌కు అవసరమైనంత వరకు మాత్రమే తీసుకున్నాం. వీటి ఆధారంగా అక్కౌంట్స్ రాయడంలో మున్ముందుకు వేళ్ళేందుకు మార్గం సులభతరమౌతుంది. యాక్టులన్నీ కేవలం పరిచయం చేయడానికి మాత్రమే ఉద్దేశించినవి. బిజినెస్ అక్కౌంట్సుకు ప్రస్తుతానికి మా పాఠాలలో సూచించినమేరకు నేర్చుకుంటే చాలు. అసలు అక్కౌంట్స్ సబ్జెక్టు, యాక్టులు వాటి పరిధి విస్తృతమైనవి. కనుక ప్రాక్టికల్‌గా అక్కౌంట్స్ రాయడానికి వీలుగా సబ్జెక్టును తీసుకోవడం, యాక్టులను వివరించడం

జరిగింది. పాఠాలు అందరికి అర్థమయ్యే వాడుక భాషలో రూపొందించాము. అక్కౌంట్స్ రాయడంలో సాంకేతిక పదజాలాన్ని అదేవిధంగా వాడుతూ అవసరమైన చోట్ల ఇంగ్లీషు భాషను ఉపయోగిస్తూ వివరణలు సాగించాము. కనుక యీ పద్ధతిలో అక్కౌంట్స్ రాయడం నేర్చుకుంటే దేశంలో ఎక్కడైనా అక్కౌంట్స్ రాయవచ్చు. ఒక్క భాషను మినహాయిస్తే విదేశాలలో కూడా అక్కౌంట్స్ రాసే విధానం ఇలాగే వుంటుంది. ఎక్కడైనా అక్కౌంట్స్ ఫండమెంటల్స్ ఒకే విధంగా వుంటాయి. కనుక మా ఈగైడెన్సు ద్వారా అన్నివిధాలుగా పరిపూర్ణ అక్కౌంటెంటుగా తయారు కావచ్చు. మేము నిర్దేశించిన ఈ మార్గంలో పయనిస్తూ జ్ఞాన సముపార్జనచేసి ఉన్నతస్థితిని పొందాలని ఆకాంక్షిస్తున్నాం.

ఈ ప్రాక్టికల్ ఎకౌంట్స్ వ్రాయటంలో కొన్ని సంస్థల ఎక్కౌంట్సు బుక్స్‌లలో మొదటికాలమ్ క్రెడిట్‌గాను, రెండవ కాలమ్ డెబిట్‌గాను, జమా ఖాతాలకు నెరేషన్‌కు ముందు To అని, ఖర్చు ఖాతాల నెరేషన్‌కు ముందు By అని వ్రాయటం జరుగుతుంటుంది. నేడు అన్ని రంగాలలో మాదిరిగానే ఎక్కౌంట్స్ విభాగంలో కూడా కంప్యూటర్స్ రాజ్యం ఏలుతున్నాయి. కనుక కంప్యూటర్ ఎక్కౌంట్‌కు అనుగుణంగా మా ఎక్కౌంట్స్ కోర్సును మలచినాము. కోర్సును తయారుచేయడంలో కంప్యూటర్ విధానాలను కూడా అనుసరించటము వలన కంప్యూటర్ ఎక్కౌంట్స్ కూడా నిర్వహించటం సులభసాధ్యం కాగలదు. ఈ కోర్సు ద్వారా అనంతమైన సబ్జక్టును కరతలామలకం చేసుకొనేందుకు గట్టి పునాదులు వేయడానికి సాహసిస్తున్నాము.



మనం ఇప్పుడు అత్యంత ప్రయోజనకరమూ అద్భుతమూ అయిన సబ్జెక్టును గురించి అధ్యయనం చేయబోతున్నాము. అదే "బిజినెస్ అక్కౌంట్స్". అంటే వ్యాపారం మరియు దానికి అవసరమయ్యే జమాఖర్చులన్నమాట. అక్కౌంట్స్ ద్వారా ఆయా వ్యాపారాలకు సంబంధించి పూర్తి వివరాలను కూలంకషంగా అవగాహన చేసుకోవచ్చు. వ్యాపార వ్యవహారాల్లో విశేషంగా ప్రభావం చూపే అనేక అంశాలను సైతం అక్కౌంట్స్ నుంచి అర్థం చేసుకోవచ్చు. నిత్యం శాఖోపశాఖలుగా విస్తరిస్తున్న బిజినెస్ గురించి దాని అన్ని కోణాలనూ సుస్పష్టంగా తేటతెల్లం చేసే అక్కౌంట్స్ ఆవశ్యకతనూ ప్రత్యేకంగా పేర్కొనాల్సిన పనిలేదు.

**! పూర్వ రంగం !**

ఈజిప్టు, గ్రీకు, రోమను నాగరికతల కాలంలోనే అక్కౌంట్స్ రాసుకునే పద్ధతి వ్యవహారంలో ఉన్నట్లు చరిత్ర చెప్తోంది. అయితే ఆధునిక పద్ధతులలో అక్కౌంట్స్ రాయడం అనేది ఇటలీలో ప్రారంభమైంది. ఆ దేశానికి చెందిన "లూకా పెసియోలి" అనే శాస్త్రవేత్త 1494లో చిట్టా, ఆవర్జా పుస్తకాల ఉపయోగాలను తన రచనలలో వివరించాడు. అందుకే ఈ అక్కౌంట్స్ విధానాన్ని 'ఇటలీ పద్ధతి' అనికూడా అంటారు. ఆ తరువాత కాలములో క్రమానుగతంగా అభివృద్ధి పొందుతూ 19వ శతాబ్దం నాటికి వ్యాపార వాణిజ్యాలు స్పష్టమైన రూపుదాల్చాయి. సర్వతోముఖ వికాసంతో అలాగే వాణిజ్య పరిశ్రమలు విరాజిల్లుతూ వస్తున్నాయి. యిప్పటి వరకు విరివిగా అభివృద్ధి చెందుతున్న కారణంగా అక్కౌంట్స్ కూడా అదే స్థాయిలో బహుముఖాలుగా విస్తరిస్తూ వస్తోంది. శాఖాపరంగా అనేక విధాలుగా ఈ అక్కౌంట్స్ విధానం ఉపయోగపడుతోంది.

## అక్కౌంట్స్ ఎందుకు !

అక్కౌంట్స్ శాఖోపశాఖలుగా విస్తరిల్లిందని చెప్పుకున్నాం. దీని ద్వారా అక్కౌంట్స్ ప్రయోజనం ఏమిటో అర్థం చేసుకోవచ్చు. అసలు 'వ్యాపారులకే అక్కౌంట్స్ అవసరం ఉంటుంది. మా కెందుకులే' అని ఏసామాన్యుడైనా అనుకుంటే అతను పప్పులో కాలు వేసినట్లే. ఏ సాధారణ వ్యక్తి అయినా నిత్యం ఏ సమయంలోనయినా 'కొనుగోలు-అమ్మకం' బారిన పడకపోడు. అంటే ఏదో వస్తువు కొంటుంటాడు, లేదా అమ్ముతుంటాడు. మరి అతను ఎంతకు కొన్నాడో ఎంతకు అమ్మాడో లెక్కలు వేసుకోడా? ఇది కూడా అక్కౌంట్స్ కిందికి వస్తుంది కదా! ఈ దృష్టితో చూస్తే అతి సామాన్యుడి నుంచి పెద్ద పెద్ద వ్యాపారాలు నిర్వహించే టాటా బిర్లాల వరకూ ఏరకంగానైనా అక్కౌంట్స్ అవసరం లేని వాడెవడైనా ఉన్నాడా చెప్పండి!

ప్రతి వ్యక్తి దైనందిన జీవితంలో అక్కౌంట్స్ అవసరం ఎంతో ఉంది. 'రాబడి ఎంత? దీనికి ఎంతెంత ఖర్చుచేశాం' అంటూ ప్రతీ వ్యక్తి లెక్కలు వేసుకుంటాడు. నిజానికి అతని పురోభివృద్ధి ఈ లెక్కలపైనే ఆధారపడి ఉందంటే అతిశయోక్తి కాదు. సారాంశంగా అక్కౌంట్స్ ప్రభావం అతని జీవిత భవిష్యత్తుపై విశేషంగా పడుతుందని నిస్సందేహంగా చెప్పవచ్చు. దీనికో చిన్న ఉదాహరణ చెప్పుకోవచ్చు. రవి అనే మధ్యతరహా వ్యక్తిని తీసుకుందాం. అతని నెలసరి ఆదాయం రు.3000. రవి తన ఆదాయం నుంచి ఇంటి అద్దె రు.750, పచారీ సరుకులకు రు.900, పిల్లల స్కూలు ఫీజులు రు.400, మెడిసిన్స్, మరియు యితర ఎంటర్‌టైన్‌మెంట్స్ ఖర్చులు రు.300, పిల్లల భవిష్యత్తు కోసం బ్యాంకులో వేసినవి రు.500. ఇలా ఖర్చుపెట్టాడు. మిగిలిన సొమ్ము తనవద్ద ఉంచు కొన్నాడు. రవి ఆ నెలలో ఖర్చు

చేసిన మొత్తం (750+900+400+300) 2350 రూపాయలను నెలసరి ఆదాయం రు.3000 నుంచి తీసివేయగా అతని నికర ఆదాయం రు.650గా తేలుతోంది. ఇందులో బ్యాంకులో వున్న సొమ్ము రు.500, చేతిలో వున్నది రు.150. రవి తన నెలసరి ఆదాయం నుంచి దేనికెంత ఖర్చు చేసినది మనకు యీ లెక్కల ద్వారా తెలుస్తుంది కదా. అంతే కాక ఖర్చులను ఎంత వరకు కుదించుకోవచ్చో లేదా పెరిగే ఖర్చులు, తప్పనిసరి ఖర్చుల నిమిత్తం నెలసరి ఆదాయాన్ని ఎంతవరకూ పెంచుకోవాలో విశదం చేసేది ఈ లెక్కల పరిజ్ఞానమే కదా! ఇదంతా ఒక అతి సామాన్యమైన వ్యక్తి ఆదాయ వ్యయాల గురించి మాత్రమే. అదే ఒక వ్యాపారి అయితే తన వ్యాపారానికి చెందిన జమా ఖర్చులు ఎప్పటికప్పుడు పుస్తకాలలో వ్రాసుకుంటూ తద్వారా వ్యాపారాభివృద్ధికి తగిన ప్రణాళికను వేసుకుంటూ వుంటాడు. ఇవన్నీ అక్కౌంట్సు క్రిందికే వస్తాయి. అంతేకాక కేవలం జమా ఖర్చుల వివరణే అక్కౌంట్స్ కాదు. ప్రభుత్వ చట్టాలకు అనుగుణంగా మొత్తంగా వ్యాపార వృద్ధి క్షయాలు, వివిధ లావాదేవీలు ఒక్క మాటలో చెప్పాలంటే వ్యాపార సమగ్ర స్వరూపం అద్దంలా పట్టి చూపగలిగేది "బిజినెస్ అక్కౌంట్స్" మాత్రమే.

**వ్యాపారం అంటే......!**

ఇక వ్యాపార విషయానికి వస్తే వ్యాపారం అనేది వివిధ వస్తువుల క్రయ విక్రయాలు కావచ్చు. లేదా రకరకాల సౌకర్యాలు సమకూర్చడం కావచ్చు. నిర్వహించేది వ్యక్తిగానైనా, సంస్థగానైనా వుండవచ్చు. వ్యాపార కార్యకలాపాల కోసం కొంత మూల ధనాన్ని సమకూర్చుకొని వ్యాపార స్థలం, ఫర్నీచర్, స్టేషనరీ తదితరాలను ఏర్పాటు చేసుకొని వ్యక్తిగాని, సంస్థగాని వ్యాపారానికి ఉపక్రమించడం జరుగుతుంది. వ్యాపారంలో ప్రతి రోజూ నగదు లేక అరువు మీద సరుకులు

కొనడం, అమ్మడం, డబ్బు యిచ్చి పుచ్చుకోవడం, బ్యాంకు లావాదేవీలు నిర్వహణా వ్యయాలు, సిబ్బంది వుంటే వారి జీతభత్యాలు ఇలా అనేక వ్యవహారాలు వుంటాయి. వీటినన్నింటినీ మాసాంతంవరకో, సంవత్సరాంతం వరకో జ్ఞాపకం పెట్టుకోవడం సాధ్యంకాదు. సంవత్సరం చివరలో లాభనష్టాలు నిర్ణయించడం అంతకంటే సాధ్యం కాదు. వ్యాపారంలో ప్రతి చిన్న విషయం ప్రతి చిన్న ఖర్చు ఎంతో ప్రాధాన్యం సంతరించుకున్నవే. ఏ వ్యాపారమైనా నిత్యం అభివృద్ధి దిశగా సాగుతూ, సులభసాధ్యంగా నల్లేరుపై బండి నడకలా కొనసాగాలంటే మంచి ప్రణాళిక అవసరం. ఈ మంచి ప్రణాళికను ఎప్పటికప్పుడు పద్ధతి ప్రకారం వ్రాసే "బిజినెస్ అక్కౌంట్స్" ద్వారా రూపొందించుకోవచ్చు. అభివృద్ధిని కోరుకొనే వ్యాపారిగానీ, వ్యాపార సంస్థగానీ అక్కౌంట్స్ నిర్వహించడం తప్పనిసరి. అంతే కాదు వ్యాపారం బాగా పెరిగి లావాదేవీలు అధికమైనప్పుడు చట్టపరంగా ప్రభుత్వ శాఖల వారికి తెలియచేయవలసిన అంశములు కూడా అక్కౌంట్స్‌లో పొందుపరచడం జరుగుతుంది. వ్యక్తిగత ప్రయోజనాలకేగాక ప్రభుత్వ నియమాలను ఆచరణలో పెట్టేందుకు కూడా అక్కౌంట్సు ఉపయోగపడతాయి.

వ్యాపారం సజావుగా సాగాలంటే ముఖ్యంగా మూడు అంశాలను దృష్టిలో పెట్టుకోవాలి. అవి (1) వ్యాపారం నిర్వహించడం, (2) వ్యాపారంలో లాభాలు పొందటం, (3) పొందిన లాభాలను నిలబెట్టుకోవడం. ఇవి ఏ వ్యాపారంలోనైనా అత్యంత ?లకాంశాలు. ప్రాక్టికంగా ఆలోచిస్తే వ్యాపారంలో సంపాదించుకున్న లాభాలను నిలబెట్టుకోవడం ఎలా అన్నది ప్రధాన సమస్యగా తోస్తుంది. దీనికి పరిష్కారం "బిజినెస్ అక్కౌంట్స్" అంటే సత్యం కాదు. లాభాలను నిలబెట్టుకోవడం ఎలా అన్నది బిజినెస్ అక్కౌంట్స్ ద్వారా నేర్చుకోవచ్చు.

## ! బిజినెస్ అక్కౌంట్స్ పరిధి ఏమిటి? !

బిజినెస్ అంటే ఏమిటి? ఎవరెవరిని వ్యాపారులుగా పరిగణిస్తారు? అక్కౌంట్సు బుక్స్ ఏవి? ట్రేడింగ్, నాన్ ట్రేడింగ్, ప్రొఫెషనల్స్‌కు చెందిన అక్కౌంట్స్‌లో వ్యత్యాసాలు ఏమిటి? అక్కౌంట్స్ వ్రాయడంలో ఏ ఏ విషయాలు క్రోడీకరించాలి? అక్కౌంట్స్ బుక్స్ సెలక్షన్ ఎలా? సేల్సు, పర్చేజ్ రిజిష్టరుతో పాటు క్యాష్ బుక్ లెడ్జరు ఉపయోగాలేమిటి? పోస్టింగ్ వేయడం ఎలా? ట్రయల్ బ్యాలెన్స్ ఎలా తయారు చేయాలి? చివరగా ఫైనల్ ఎసెస్‌మెంట్స్ ఏవిధంగా రూపొందించాలి? ఇలా బిజినెస్ అక్కౌంట్స్ పరిధి విస్తరించుకుంటూ పోతుంది. ఎప్పటికప్పుడు జరిగే మార్పులు, చేర్పులతోచేసే వ్యాపారాన్ని అనుసరించి వివిధ అంశాల క్రోడీకరణలతో ప్రతి పద్దు వివరాలతో సమగ్రంగా - బిజినెస్ అక్కౌంట్స్ నిర్వహణ 'వ్యాపారనాడి'ని పట్టి ఇస్తూ సాగుతుంది. ఇక్కడ గమనించాల్సిన విషయం ఒకటి ఉంది. ఏ వ్యాపారమైనా ప్రభుత్వ చట్టాల నియమ నిబంధనలకు కట్టుబడి ఉండాల్సి ఉంటుంది. వ్యాపారి లేదా వ్యాపార సంస్థ ప్రయోజనాలకే కాక ప్రభుత్వశాఖల వారికి కూడా ఉపయుక్తంగా ఉండే విధంగా అక్కౌంట్స్ రాయవలసి వుంది. అలా రాసినప్పుడే ఆ 'అక్కౌంట్స్'కి సార్థకతా సాఫల్యతనూ! లాభాపేక్షతో చేసే ప్రక్రియను వ్యాపారం (బిజినెస్) అని అంటారు. అలా వ్యాపారం చేసే వారందరిని వ్యాపారులుగా పరిగణిస్తారు. వ్యాపారాలను నాలుగు రకాలుగా వర్గీకరించవచ్చు. (1) ట్రేడింగ్, (2) నాన్ ట్రేడింగ్, (3) ప్రొఫెషనల్స్, (4) మాన్యుఫాక్చరర్స్.

**ట్రేడింగ్ (Trading) :-** ఏవైనా సరుకులు కొనుగోలుచేసి వాటి స్వరూపం మారకుండా (as it is) అమ్మకం సాగించడం. ఈ వ్యాపారం చేసేవారిలో రిటైలర్స్, హోల్‌సేలర్స్ వుంటారు. అంటే చిన్న వ్యాపారులు మొదలుకొని పెద్దతరహా వ్యాపారం

సాగించేవారు. వీరేగాక ప్రొడక్టుకు సంబంధించి డిస్ట్రిబ్యూటర్స్, స్టాకిస్టులు కూడా ఉంటారు. వీరందరూ వస్తువును వున్నది వున్నట్లు కొనడం, అమ్మడం సాగిస్తుంటారు.

నాన్ ట్రేడింగ్ (Non-Trading) :- వ్యాపార నిర్వహణ అయితే ఉంటుందిగాని ఏ విధమైన అమ్మకాలు, కొనుగోళ్ళు ఉండవు. వీటిలో ముఖ్యమైనవి చిట్‌ఫండ్ సంస్థలు, రియల్ ఎస్టేట్స్, కాంట్రాక్టులు, వర్క్‌షాపులు, అసోసియేషన్స్, సొసైటీస్, ట్రావెల్ ఏజెన్సీస్, ఫిలిం డిస్ట్రిబ్యూటర్సు, ఫొటో స్టూడియోస్ తదితరాలు.

ప్రొఫెషనల్స్ (Professionals) :- ప్రధానంగా వృత్తిపరమైన వ్యాపారాలు ఈ కోవకి చెందుతాయి. డాక్టర్లు, లాయర్లు, ఆడిటర్లు, సినీనటులు, కమీషన్ ఏజెంట్లు, బ్యూటిషియన్‌లు తదితరులు ఈ పరిధిలోకి వస్తారు.

మాన్యుఫాక్చరర్స్ (Manufacturers) :- పలురకాలైన ముడిసరుకులను కొనుగోలుచేసి వాటిని పరిపూర్ణ వస్తువులుగా తయారుచేసి అమ్మకాలు నిర్వహించేవారు. వీరిని మాన్యుఫాక్చరర్స్ అంటారు.

పైన ఉదహరించిన కేటగిరీల వ్యాపారులందరూ తమతమ వ్యాపారాలకు సంబంధించిన అక్కౌంట్స్‌ను మెయిన్‌టెయిన్ చూస్తూ లాభనష్టాలను బేరీజు వేసుకుంటారు. సంవత్సరాంతంలో తమ వ్యాపారంలో ఎంత లాభం వచ్చింది? లేదా నష్టం ఏరకంగా ఉంది. నష్టాలకు కారణాలు ఏమిటి? అనే విషయాలు అక్కౌంట్స్ ద్వారా తెలుసుకుంటారు.

ట్రేడింగ్ అక్కౌంట్స్ (Trading Accounts) :-

ఏ మార్పులు లేకుండా వస్తువులను కొనుగోలు, అమ్మకాలు సాగించే వ్యాపారాన్ని ట్రేడింగ్ అంటారని తెలుసుకున్నాం. చరణ్ అనే వ్యక్తి ఫ్యాన్సీ సరుకుల వ్యాపారం ఆరంభించదలిచాడనుకుందాం. తాను చేయబోయేది అమ్మకాలకు చెందిన

వ్యాపారం కాబట్టి యిది అమ్మకం పన్ను చట్టం పరిధిలోకి వస్తుంది. కనుక సంబంధిత కమర్షియల్ టాక్స్ డిపార్టుమెంటు వారినుంచి ముందుగా రిజిస్ట్రేషన్ సర్టిఫికెట్ పొందవలసివుంది.

ఈ సేల్సుటాక్సు మొదటగా మద్రాసు రాష్ట్రంలో 1939 సం.లో ప్రవేశపెట్టారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన తరువాత ఆ చట్టాన్ని మన రాష్ట్రానికి కూడా వర్తింపజేశారు. ఇది 15 జూన్ 1957 నుంచి అమలులోకి వచ్చింది. అందుకే దానిని ఆంధ్రప్రదేశ్ జనరల్ సేల్సు టాక్స్ యాక్ట్ (ఎ.పి.జి.ఎస్.టి.యాక్ట్) 1957 అని పిలుస్తారు. ఈ చట్టంలో అప్పటి నుంచి ఇప్పటి వరకు అనేక మార్పులు జరుగుతూ వస్తున్నాయి. కాగా ప్రస్తుత నిబంధనలను అనుసరించి వ్యాపారం ప్రారంభించేందుకు ముందుగా సేల్సు టాక్స్ కార్యాలయము నుంచి రిజిస్ట్రేషన్ సర్టిఫికెట్ కోసం "ఫారం-డి" అప్లికేషనవ్ సమర్పించాల్సి వుంది. అందులో పొందుపర్చాల్సిన వివరాలు ఇలా వున్నాయి.

1. వ్యాపారం ఏ పేరుతో నిర్వహించదలిచారో ఆ పేరు.
2. వ్యాపార స్థలం పూర్తి చిరునామా, డోరునెంబరు, వీధిపేరు, తదితరాలతో పూర్తి అడ్రసు, గోడౌన్‌లు, బ్రాంచీలు వుంటే వాటి పూర్తి చిరునామాలు. వ్యాపార స్థలం అద్దెదైతే రెంట్ అగ్రిమెంట్, సొంతదైతే డిక్లరేషన్ జతచేయాలి.
3. కొనుగోలు అమ్మకాలు చేసే సరుకుల పూర్తి వివరాలు.
4. సెక్యూరిటీ డిపాజిట్టుగా రు.2000లు నేషనల్ సేవింగ్స్ సర్టిఫికెట్.
5. ష్యూరిటీ (గ్యారంటీ) సర్టిఫికెట్. చేయబోయే వ్యాపారంలో టాక్సులు, లైసెన్సులు, వగైరా బకాయిలు పడితే అందుకు హామీగా 1. అతని లేదా

బంధుమిత్రుల స్థిరాస్తిగాని, 2. ఇంకొక వ్యాపారి (ఆర్.సి.హోల్డర్) హామీనిగాని రు.100ల నాన్ జ్యుడీషియల్ స్టాంప్ పేపరుపై హామీ నకలు జతపర్చాలి.

6. పాస్‌పోర్టు సైజు ఫొటోలు రెండు.

7. రిజిస్ట్రేషన్ ఫీజుగా రు.100లు చెల్లించాలి. దీనిని ప్రతి సంవత్సరం రెన్యువల్ చేయించాలి.

8. జాయింటు వ్యాపారమైతే భాగస్వాములు, వారి పూర్తి వివరాలతోపాటు వారి పార్ట్‌నర్‌షిప్ డీడ్‌ను కూడా జతపర్చాలి. అదే ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీ అయితే మెమోరాండమ్ ఆఫ్ ఆర్టికల్స్ జతచేయాలి.

కాగా హాకర్సు (బయట తిరిగి అమ్ముకునేవారు) ఫుట్‌పాత్‌పై సరుకులు అమ్ముకునేవారు ఆర్.సి.పొందనవసరంలేదు. కాజువల్ డీలర్లు అనగా ఎగ్జిబిషన్ స్టాల్స్‌లో తాత్కాలికంగా అమ్మకం సాగించేవారికి కూడా ఆర్.సి. అవసరంలేదు. అయితే ఆయా ప్రాంతాల సేల్సు టాక్సు డిపార్టుమెంటు వారికి జరిగిన అమ్మకాలపై సేల్స్ ట్యాక్స్ చెల్లించాలి.

## ప్రాక్టికల్ అకౌంట్స్ రాయడం:

ఇప్పుడు వ్యాపారంలో జరిగే ట్రాన్స్‌శాక్షన్స్‌కు అనుగుణంగా అక్కౌంట్స్ రాయడం ఎలాగో పరిశీలిద్దాం. అక్కౌంట్ పుస్తకాలలో క్యాష్ బుక్, లెడ్జర్ ప్రధానమైనవి. వీటితోపాటు సేల్సు రిజిష్టరు, పర్చేజి రిజిష్టరు, అమ్మకాల వాపసు, కొనుగోలు వాపసు, స్టాక్ రిజిష్టరు, మొదలైనవి కూడా ఉంటాయి. వ్యాపార స్థాయిని అనుసరించి వీటిని రాసుకోవచ్చు.

## క్యాష్ బుక్ (Cash Book/Day Book) :

అక్కౌంట్ పుస్తకాలలో ఈ క్యాష్ బుక్ మొదటిది. ఇది రోజువారీ పద్దుల పుస్తకం.

దీనినే చిట్టా అని, డే బుక్ అనీ వ్యవహరిస్తూంటారు. ఈ పుస్తకంలో ఏరోజుకారోజు వ్యాపారంలో జరిగిన ట్రాన్‌శాక్షన్స్ ఖాతాల వారీగా రాయాలి. దీని ద్వారా వ్యాపారంలో ఆ రోజు క్యాష్ నిల్వ తెలుసుకోగలుగుతాము. అంతేకాక ఈ పుస్తకంలో ఖాతాల స్వభావాన్ని బట్టి వర్గీకరణ చేసి పద్దులు రాస్తాము కనుక ప్రతి పద్దును ఆవర్జాలో సులభంగా పోస్టింగ్ చేయగలుగుతాము. కాగా వ్యాపార స్వరూప స్వభావాల కనుగుణంగా క్యాష్ బుక్‌ను ప్రాక్టికల్‌గా 3 రకాలుగా రాయవచ్చు. అవి ఎ) సింగిల్ కాలం క్యాష్ బుక్, బి) డబుల్‌కాలం క్యాష్ బుక్, సి) ఫోర్ కాలం క్యాష్ బుక్.

క్యాష్ బుక్ రాయడం ప్రారంభించే ముందు నిర్వహించే వ్యాపారం స్థాయిని గమనించాలి. వ్యాపారంలో జరిగిన వివిధ లావాదేవీల ఆధారాలకు అనుగుణంగా పద్దులు రాయాలి. దాఖలాగా చూపదగిన అంశాలు ఇవి 1) నగదు మరియు అరువు అమ్మకపు బిల్లులు, 2) కొనుగోలు బిల్లులు, 3) అరువు అమ్మకం ద్వారా వచ్చిన వసూళ్ళ రశీదులు, 4) అరువు కొనుగోలుపై చెల్లించిన పేమెంట్స్, 5) బ్యాంక్ అక్కౌంట్ ఉంటే వాడిన చెక్‌బుక్ కౌంటర్ ఫాయిల్స్, 6) బ్యాంక్ డిపాజిట్ చలానా కౌంటర్ పాయిల్స్, 7) పెట్టిన ఖర్చులకు సంబంధించిన ఓచర్లు. వీటి ఆధారంగా క్యాష్‌బుక్‌లో పద్దులు రాయాలి. ఖర్చులను హెడ్ ఆఫ్ అక్కౌంటుగా విభజించడం అనేది అతి ముఖ్యమైన విషయం.

!క్యాష్ బుక్ నమూనా!

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | | | |

పై ఉదాహరణలో మొదటి తేది, ఎల్.ఎఫ్.నెం. అంటే లెడ్జరు ఫోలియో నెంబరు. తరువాతి వివరాలు రాయాలి. డెబ్ట్, క్రెడిట్ అంటే ఖర్చు, జమా. జరిగిన వ్యవహారం ఖర్చు అయితే Debit కాలంలోనూ జమ అయితే credit కాలంలోనూ అంకెలు వేయాలి. జమ అనగా సంస్థకు వచ్చే వసూళ్ళు. ఖర్చు అంటే సంస్థ చెల్లింపులు. అయితే ఏ ఏ ఖాతాలను క్రెడిట్ చెయ్యాలి? ఏ ఏ ఖాతాలను డెబిట్ చేయ్యాలి? అనే విషయంపట్ల జాగ్రత్త వహించాలి. సంస్థలోకి ఇచ్చేవాని ఖాతాలు ఉదాహరణకు రామారావు నుంచి గాని రామా అండ్‌కో వారి నుంచి గాని పేమెంట్ వచ్చినప్పుడు క్రెడిట్ చెయ్యాలి. అంతేగాక సంస్థ నుంచి వెళ్ళిపోయే ఖాతాలు అంటే అమ్మకం వగైరా మరియు ఆదాయాలు, లాభాంశాలు అంటే వచ్చిన వడ్డీలు వగైరా వీటన్నిటిని క్రెడిట్ చేయాలి. అలాగే సంస్థ నుంచి పుచ్చుకునే ఖాతాలు అంటే కొనుగోళ్ళు, అలాగే ఖర్చులు వగైరా ఉదాహరణకు చెల్లించిన అద్దె, జీతాలు తదితరాలు డెబిట్ (ఖర్చు) చెయ్యాలి.

లక్షరూపాయల మూలధనంతో ఒక వ్యక్తి ఫ్యాన్సీ దుకాణం ప్రారంభించాడనుకుందాం. ఈ వ్యవహారాన్ని క్యాష్‌బుక్‌లో ఈ క్రింది విధంగా రాయవచ్చు.

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1-2-98 | | పెట్టుబడి ఖాతా | | 1,00,000 |
| | | By పెట్టుబడి పెట్టినందున | | |

క్రెడిట్‌లో వచ్చే వాటన్నిటికి ముందుగా 'బై' అని రాయాలి. అలాగా డెబిట్‌లో వచ్చే వాటన్నిటికి ముందుగా 'టు' అనిరాయాలి. పై ఉదాహరణలో పెట్టుబడి ఖాతా అన్నది హెడ్ ఆఫ్ అక్కౌంట్. నగదు పెట్టుబడి పెట్టినందున అనేది నేరేషన్.

వ్యాపారానికి పెట్టుబడిగా ఇక్కడ రు.1,00,000లు తెచ్చినందున సంస్థలోకి నగదు వచ్చినట్లే. కనుక పెట్టుబడి ఖాతాకు జమచేయడం జరిగింది.

సేల్సు టాక్సు డిపార్టుమెంటు వారికి సెక్యూరిటీ 2000 రూపాయలు ఎన్.ఎస్.సి.ని డిపాజిట్‌గా తీసుకున్నప్పుడు.

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1-2-2001 | | డిపాజిట్ ఖాతా<br>To ఎస్. టి. నిమిత్తం సెక్యూరిటీగా చెల్లించినందున | 2000 | |

ఇక్కడ సెక్యూరిటీ డిపాజిట్‌గా చెల్లించినందున సంస్థలోని నగదు నుంచి రు.2000లు బయటకు పంపడం జరిగింది. కనుక డిపాజిట్ ఖాతాకు ఖర్చు (డెబిట్) రాశారు.

అలాగే మరో రెండు ఉదాహరణలు:

రు.5000లును అద్దె అడ్వాన్సుగా చెల్లించినాడు. అప్లికేషన్ ఫారమ్స్ నిమిత్తం రు.100లు ఖర్చు అయినది. ఎస్.టి. రిజిస్ట్రేషన్ ఫీజుగా రు.100లు చెల్లించినాడు.

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | | Rent Advance A/C<br>To towards Advance. | 5000 | |
| 2.2.2001 | | Stationery A/C<br>To as per Bill. | 100 | |
| 3.2.2001 | | Licenses & Renewal A/C<br>To Challan No<br>S.T.Regn. Fee | 100 | |

పై ఉదాహరణలో స్టేషనరీ ఖాతాకు అప్లికేషన్ ఫారాలు కొనుగోలు నిమిత్తం రు.100లు ఖర్చు చేసినట్లు రాయడం జరిగింది. అలాగే అన్ని ఖర్చులూ రాయవచ్చు. అయితే స్టేషనరీకి చెందిన అన్ని వ్యవహారాలను 'టు స్టేషనరీ ఖాతా' అని హెడ్ ఆఫ్ అక్కౌంట్ కింద రాయాలి. వ్యాపార నిర్వహణకు కావలసిన అక్కౌంట్ పుస్తకాలు, తెల్లకాగితాలు, కార్బన్స్, లెటర్‌పాడ్స్, బిల్లు పుస్తకాలు, ఓచర్ పుస్తకాలు, ఇంకు బాటిల్స్, పెన్స్ ఇవన్నీ స్టేషనరీ ఖాతా క్రిందికి వస్తాయి. వీటిని కొనుగోలు చేసినప్పుడు ఆయా షాపుల నుంచి తీసుకున్న రశీదుల నెంబర్లను పేర్కొంటూ కొనుగోలు చేసిన వస్తువుల వివరాలు రాయాలి.

**కొనుగోలులు (Purchases):**

ఈ కొనుగోలులు రెండు విధాలుగా జరుగుతూ ఉంటాయి.

1. నగదు కొనుగోలు, 2. అరువుపై కొనుగోలు.

నగదుపై కొనుగోలు చేసినప్పుడు ఎవరివద్ద నుంచి కొనుగోలు చేశామో అనేదానికి ప్రాముఖ్యం ఇవ్వనవసరంలేదు. ఎందుకనగా పూర్తి క్యాష్ చెల్లించి కొనడం జరిగింది కనుక అంతటితోసరి. అదే అరువు కొనుగోలు చేసినట్లయితే కొనుగోలు చేయటం మాత్రం జరిగిందిగాని పేమెంటు చేయడం తర్వాత రోజులలో జరుగుతుంది.

కనుక ఎవరికి ఎంత చెల్లించాలో తెలియవలసిన అవసరం ఉంది. దీనిని రెండు పద్దులుగా క్యాష్ బుక్కులో రాయాలి.

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | | Purchase A/C<br>To Bill No.205<br>Mohan & Co. | 5000 | |
| | | Mohan & Co. A/C<br>By Bill No.205 | | 5000 |

పై విధంగా అరువు కొనుగోళ్ళను రాయాలి. అదే నగదు కొనుగోళ్ళు అయితే ఒకే పద్దు రాస్తే చాలు. రామ్ అండ్‌కో వారికి నగదు 1000 రుపాయలు చెల్లించి సరుకు కొంటే దానిని ఇలా రాయాలి.

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | | Purchase A/C<br>To Bill No. 105<br>Ram & Co. | 1000 | |

ఒకే రోజు ఒక బిల్లు ద్వారా కాక అనేక బిల్లుల ద్వారా కొనుగోలు జరిగితే ప్రతి సారీ పర్చేజ్ ఖాతా అని రాయనవసరం లేదు. పైన ఒకసారి రాసి దాని కింద అన్ని బిల్లులను వివరాలతో రాయవచ్చును. అరువు బిల్లులకు మాత్రం ఇండివిడ్యువల్ పార్టీ ఖాతాకి జమకట్టాలి.

అమ్మకాలు (Sales) :-

ఇవి కూడా పై విధంగానే నగదు మరియు అరువుపై జరుగుతూ ఉంటాయి. ది. 1-2-2001 నగదుపై అమ్మకం జరిగిందనుకుందాం.

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | | Sales A/C | | |
| | | By B.No.1 | | 500 |

ఇక్కడ అమ్మకం ద్వారా నగదు సంస్థలోకి వచ్చింది కనుక ఒక్క ఎంట్రీ మాత్రం రాస్తే సరిపోతుంది. ఎవరికి అమ్మామో వివరణ అవసరం లేదు. అదే రోజున ఒక బిల్లు కాకుండా 10 బిల్లుల ద్వారా అమ్మకం జరిగినప్పుడు బిల్లు నెం.1 టు 10 దాఖలా అని 10 బిల్లుల మొత్తాన్ని కలిపి ఒకే ఎంట్రీగా చూపిస్తే సరిపోతుంది.

1-2-2001 అరువు బిల్లు నెం. 5 దాఖలా వెంకట్ అండ్ కంపెనీ వారికి రు.1000లు మరియు అరువు బిల్లు నెం.6 దాఖలా విష్ణువర్ధనరావు రు. 300లు అమ్మకం చేసినప్పుడు .......

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | | Sales A/C | | |
| | | By B.No.5&6 | | 1300 |
| | | Venkat & Co. A/C | | |
| | | To B.No.5 | 1000 | |
| | | Vishnuvardana Rao A/C | | |
| | | To B.No.6 | 300 | |

ఒకే రోజున ఎంత మందికి అమ్మినా ఎందరి నుంచి కొన్నప్పటికి పైన చూపిన విధంగా రాయడం జరుగుతుంది.

1-2-2001న తేదీన కాఫీ, టీలకుగాను 15 రూపాయలు ఖర్చు అయ్యాయనుకుందాం. ఆ పద్దును ఇలా రాయాలి.

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | | Staff Welfare A/C<br>To Tea expenses<br>as per Voucher | | 15 |

కాఫీ, టీ లే కాకుండా భోజనం, టిఫిన్, కూల్ డ్రింక్స్ ఇతర హోటల్ బిల్లులు అలాగే స్టాఫ్‌కు సంబంధించిన మెడికల్ అలవెన్సులు, తదితర చిన్న చిన్న ఖర్చులు వగైరాలన్నీ స్టాఫ్ వెల్ఫేర్ అనే హెడ్ ఆఫ్ అక్కౌంట్ కిందగాని సాదర్ అనే అక్కౌంటుగా గాని, రిఫ్రెష్‌మెంట్స్ అనే హెడ్ ఆఫ్ అక్కౌంట్ కిందగానీ చూపడం జరుగుతుంది.

ది. 1-2-2001న ఆటో చార్జీకి గాను రు. 25లు చెల్లించినట్లయితే...

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | | Conveyance A/C<br>To Auto charge paid | 25 | |

స్థానికంగా వ్యాపారం నిమిత్తం ఆటోలోగాని, సిటీ బస్‌లో గాని, సైకిల్ అద్దెకు తీసుకొనిగాని ప్రయాణించి ఖర్చు పెట్టినప్పుడు 'కన్వేయన్స్ చార్జెస్ అనే హెడ్ ఆఫ్ అక్కౌంట్' కింద చూపాలి.

- 1-2-2001న పోస్టల్ స్టాంపుల కోసం రు.20లు ఖర్చు పెట్టారు. ఈ పద్దును ఇలా రాయాలి.

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Licenes & RenewalsA/C | | |
| | | To S.T.Regn. Fee | 100 | |
| | | Purchase A/C | | |
| | | To B.No.105 Rama & Co. | 1000 | |
| | | To B.No.205 Mohan & Co | 5000 | |
| | | Mohan & Co. A/C | | |
| | | By B.No.205 | | 5000 |
| | | Sales A/C | | |
| | | By B.No.1 | | 500 |
| | | By B.No. 5& 6 | | 1300 |
| | | Venkat & Co.A/C. | | |
| | | To B.No.5 | 1000 | |
| | | Vishnuvardhana Rao A/C | | |
| | | To B.No.6 | 300 | |
| | | Staff Welfare A/C | | |
| | | To Tea & Coffee | 15 | |
| | | Conveynance A/C | | |
| | | To Auto charges | 25 | |

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | | Postage & Tel. A/C | | |
| | | To Postage Stamps | 20 | |

పోస్టేజి స్టాంపులు, రెవిన్యూ స్టాంపులు, కొరియర్ చార్జీలు, మనీ ఆర్డరు చార్జీలు, రిజిష్టరు పోస్టు ఖర్చులు, టెలిగ్రాం ఖర్చులు ఇవన్నీ 'పోస్టేజ్ అండ్ టెలిగ్రామ్స్' అనే హెడ్ ఆఫ్ అక్కౌంట్' కింద రాయవలసి ఉంటుంది.

ఇప్పటి వరకూ ఖర్చులకు, జమలకు సంబంధించిన కొన్ని వ్యవహారాలను క్యాష్ బుక్‌లో ఎలా రాయాలో తెలుసుకున్నాం. ఇవే అంశాలను ఫ్యాన్సీ షాపుకు చెందిన క్యాష్ బుక్‌లో ఎలా ఎంటర్ చేస్తారో, బ్యాలెన్సు ఎలా చూపుతారో పరిశీలిద్దాం.

Charan Fancy Centre వారి క్యాష్ బుక్

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | | Capital A/C | | |
| | | By cash towards capital | | 1,00,000 |
| | | Deposit A/C | | |
| | | To NSC No. For S.T | 2000 | |
| | | Rent Advance A/C | | |
| | | To towards | | |
| | | Advance Paid | 5000 | |
| | | Stationery A/C | | |
| | | To As per Bills | 100 | |

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | Postage & TelegramsA/C | | |
| | | To Postal Stamps | 20 | |
| | | | 14560 | 1,06,800 |
| | | | | 14, 560 |
| | | | | 92,240 |

క్రెడిట్ కాలంను మొత్తం కూడి అందు నుంచి డెబిట్ కాలం మొత్తాన్ని తీసివేస్తే ఎంత నిల్వ ఉన్నదో తెలుస్తుంది. ఎప్పుడూ డెబిట్ బ్యాలెన్స్ కంటే క్రెడిట్ బ్యాలెన్స్ ఎక్కువగా ఉంటుంది. అలా లేని పక్షంలో ఎక్కడో తప్పుజరిగి ఉంటుంది. దానిని గమనించాలి. ఏరోజుకారోజు ఈ విధంగా నిల్వ తేల్చుకుంటూ మరుసటి రోజుకు క్రెడిట్‌కు ఈ ఓపెనింగ్ క్యాష్‌ను కలుపుకుని మళ్ళీ డెబిట్ బ్యాలెన్స్ తీసివేసి నిల్వతేల్చుకుంటూ వెళ్ళాలి.

ఈ విధంగా పద్దులు రాసిన తర్వాత వాటన్నింటినీ క్రమబద్ధంగా ఆవర్జాలో పోస్టింగ్ వేయాలి.

ఆవర్జా (LEDGER) :-

క్యాష్ బుక్‌లో రాసిన ప్రతి పద్దునూ ఆవర్జాలో పోస్టింగ్ చేయాలి. ఆవర్జాలో ఏ ఖాతాకు ఆ ఖాతా విడివిడిగా వర్గీకరించి ఉంటుంది. ప్రతి ఖాతాకు కొన్ని పేజీలు కేటాయించి ఉంచుతారు. దీనిలో క్యాష్ బుక్‌లో నమోదు చేసిన పద్దులు ఖాతావారీగా రాయడం జరుగుతుంది. అందువల్ల ఒక ఖాతాకు సంబంధించిన పూర్తి వివరాలు ఒకేచోట చూడవచ్చు. ఆవర్జా ప్రత్యేకత ఇదే. ఉదాహరణకు

కొనుగోలు ఖాతాను రాసిన పద్దులు ఆవర్జాలో కొనుగోలు ఖాతాకు కేటాయించిన పేజీలో ఒకేచోట కొనుగోలు పద్దులను నమోదు చేయడం జరుగుతుంది. అందువల్ల ఒక నిర్ణీత కాలంలో కొనుగోలు మొత్తం ఎంతో దీని ద్వారా తెలుసుకోవచ్చు. అలాగే రావలసిన, ఇవ్వవలసిన బాకీలు ఏ ఏ ఖాతా ద్వారా ఎంతెంత ఖర్చు చేశామో అనేది ఆవర్జా ద్వారా తెలుసుకోవడం సులభ సాధ్యమవుతుంది.

ఆవర్జా నమూనా (LEDGER)

CAPITAL A/c — Page No.1

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 1 | By Cash | | 1,00,000 |

ఆవర్జా చూడడానికి క్యాష్ బుక్‌లాగే ఉంటుంది. కాకపోతే దీని మొదట 'ఇండెక్సు' ఉంటుంది. ఏఏ ఖాతాలు ఏఏ పేజీలలో ఉన్నాయో దీని ద్వారా తెలుసుకోవచ్చు. అంతే తేడా.

ఆవర్జాలో ఒక్కో ఖాతాకు కొన్ని పేజీలు చొప్పున కేటాయించుకుని పేజీ పైభాగంలో ఆ ఖాతా పేరు రాయాలి. ఇలా ఖాతాలు ఓపెన్‌చేసిన తర్వాత ఇండెక్సులో వాటి వివరాలు పేజీ నంబర్లు రాసుకోవాలి. ఇందువల్ల ఒకే ఖాతా రెండుసార్లు వేర్వేరు పేజీలలో రావడానికి అవకాశం ఉండదు. అలాగే ఏ ఖాతా ఏ పేజీలో నమోదై ఉందో సులభంగా గుర్తించేందుకు 'ఇండెక్సు' ఉపయోగపడుతుంది.

క్యాష్ బుక్‌లోని పద్దును ఆవర్జాలో పోస్టింగ్ చేసిన తరువాత ఆవర్జాలో ఆ ఖాతానమోదైన పేజీ నంబరును మళ్ళీ క్యాష్ బుక్‌లో ఎల్. ఎఫ్. నెం. అనేచోట రాయాలి. దీనివల్ల ప్రతి పద్దూ ఆవర్జాలో తప్పనిసరిగా పోస్టింగ్ అయ్యేందుకు వీలవుతుంది.

DEPOSIT A/C

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 1 | To NSC No.for S.T | 2000 | |

RENT ADVANCES A/C P.54

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 1 | To Cash towards rent | 5000 | |

STATIONERY A/C P.75

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 1 | To As per Bills | 100 | |

LICENCE & RENEWAL A/C P.77

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 1 | To S.T. Renewal fee | 100 | |

PURCHASE A/C P.9

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 1 | To B.No.105 Rama & Co. | 1000 | |
| | | To B.No.205 Mohan & Co. | 5000 | |

MOHAN & Co. A/C P.53

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 1 | By B.No.205 | | 5000 |

SALES A/C P.15

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 1 | To B.No.1 | | 500 |
| | | To B.No.5 & 6 | | 1300 |

VENKAT & Co. A/C P.55

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 1 | To B.No.5 | 1000 | |

VISHNUVARDHANA RAO A/C P.56

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 1 | To B.No.6 | 300 | |

STAFF WELFARE A/C P.78

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 1 | To Tea & Coffee Exp. | 15 | |

Conveyance A/C P.81

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 1 | To Auto Charges paid | 25 | |

P & T A/C P.85

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 1 | To Postal Stamps | 20 | |

పై విధముగా ఏ రోజుకారోజు డే బుక్ నుండి లెడ్జర్ ఖాతాలలో నమోదు చెయ్యాలి.

వ్యాపార నిర్వహణలో ఉపయోగించేందుకుగాను కుర్చీలు, టేబుల్స్ కొనుగోలు చేసినపుడు:

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 2-2-2001 | | Furniture & Fixtuers A/C | | |
| | | To B.No.16 Ajantha | | |
| | | Traders Towards | 1000 | |
| | | purchase of | | |
| | | Table & Chair | | |

అలాగే క్యాష్ బాక్స్‌లు, బీరువాలు, సరుకులు ఉంచేందుకు రాక్‌లు, స్టీలు అల్మైరాలు, పార్టీషన్, కేబిన్స్ మొదలైనవి ఏవి కొన్నా ఏవి చేయించినా పై విధంగా రాయాలి. వీటిని వ్యాపారానికి చెందిన ఆస్తి (అస్సెట్స్) అంటారు. వీటికి సంవత్సరాంతంలో రూల్స్‌కు అనుగుణంగా తరుగుదల చూపవలసి ఉంటుంది.

షాపు పేరుతో స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో ఖాతా తెరచి అందులో రూ.25,000/-లు డిపాజిట్ చేసినపుడు:

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 2-2-2001 | | State Bank of India A/C | | |
| | | To cash deposit | 25,000 | |

అలాగే బ్యాంకు నుంచి వాడకం నిమిత్తం రు. 1000లు విత్‌డ్రా చేసినపుడు:

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 2-2-2001 | | State Bank of India A/C | | |
| | | By Ch. No. 1632 | | 1000 |

బ్యాంకులో నగదు డిపాజిట్ చేసినపుడు క్యాష్ చలానా రాసి కౌంటర్ ఫాయిల్‌ను భద్రపరచాలి. అదే విధంగా బ్యాంకు నుంచి క్యాష్ విత్‌డ్రా చేసినపుడు, ఇతరులకు బ్యాంకు చెక్ ద్వారా చెల్లింపులు జరిపినపుడూ చెక్ కౌంటర్ ఫాయిల్ మీద పూర్తి వివరాలు రాయాలి.

వెంకట్ అండ్ కో వారి నుంచి అరువు ఖాతా దాఖలా రు.1000లు వసూలైనప్పుడుః

సదరు వెంకట్ అండ్ కో నుంచి సంస్థకు రావలసిన బాః వసూలై వచ్చింది కాబట్టి వారి బాః నిమిత్తం సంస్థకు చెందిన వసూలు రశీదు పుస్తకం నుంచి రశీదు (1+1) రాసి ఒక కాపీని సదరు కంపెనీకి ఇవ్వాలి. తరువాత ఆ రశీదు పుస్తకంలోని రశీదు నెం.1 ద్వారా పద్దు రాయాలి.

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | | Venkat & Co. A/C | | |
| | | By Receipt No.1 | | 1000 |

అదే విధంగా విష్ణువర్ధనరావు ఇవ్వవలసిన రు.300లకు గాను చెక్కు ఇచ్చినప్పుడు

పై విధంగానే ముందుగా రశీదు రాయాలి. ఇక్కడ క్యాష్ రూపంలో కాకుండా చెక్‌రూపేణా వచ్చింది కనుక ఈ వ్యవహారం పద్దు రాసేటప్పుడు ఒక ఎంట్రీ కాకుండా రెండు ఎంట్రీలు వస్తాయి.

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 2-2-2001 | | Vishnuvardhana Rao A/C | | |
| | | By Receipt No.2, | | |
| | | " Ch.No.321492 | | 300 |
| | | State Bank of India A/C | | |
| | | To Ch.No.321492 | 300 | |

వచ్చిన చెక్‌ను సంస్థ పేరుతో ఉన్న స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా ఖాతాలో చెక్ చలానా ద్వారా డిపాజిట్ చేసి కౌంటర్ ఫాయిల్‌ను జాగ్రత్త చేయాలి.

మోహన్ అండ్‌కో వారికి ఇవ్వవలసిన బాకీ (అరువు కొనుగోలు) లో నగదుగా రు.1000, బ్యాంక్ చెక్ రు.2000, మరియు రు.2000 డిమాండ్ డ్రాఫ్ట్‌ల ద్వారా చెల్లించినట్లయితే...

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 2-2-2001 | | Mohan & Co. A/C | | |
| | | To Rt. No. 37 | 1000 | |
| | | To Ch. No.163202 | | 2000 |
| | | To D.D.No.741467 | | |

| | | | |
|---|---|---|---|
| | State Bank of India A/C | | |
| | By Ch. No. 163202 | | 2000 |
| | By Ch. No. 163203 | | 2040 |
| | Bank Commission A/C | | |
| | To D.D. Charges | 40 | |

పై వ్యవహారంలో మోహన్ అండ్‌కో వారికి ఇవ్వవలసిన బాకీ రు.5000లు ఇవ్వడం జరిగింది. బ్యాంకు కమీషన్ కంపెనీ వారికి సంబంధం లేదు. కనుక విడిగా బ్యాంకు కమీషన్ ఖాతాలో రాయడం జరిగింది. ఇది ఖర్చు కిందికి వస్తుంది. కాబట్టి ఖర్చులో నమోదు చేయాలి. బ్యాంకు నుండి చెక్ నెం.163203 ద్వారా రు.2040లు డ్రాచేసి డి.డి. తీసుకోబడినది కావున బ్యాంక్ ఖాతాకు రు.2040లు జమకట్టాలి.

ది. 2-2-2001న కొత్త టెలిఫోన్ సౌకర్యం కోసం టెలికం డిపార్టుమెంట్ వారికి రు.3000లు చెల్లించినపుడు...

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 2-2-2001 | | Deposits A/c. | | |
| | | To New Phone | | |
| | | Connection | 3000 | |

అలాగే టెలిఫోన్ వాడుకున్నందుకు డిపార్టుమెంట్ వారికి ఆర్.టి.నెం.17 దాఖలా ది.3-2-2001న రు.375/-లు చెల్లించినందున.

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 2-2-2001 | | Telephone Charges A/C. | | |
| | | To. Rt.No.17 | 375 | |

అదే బ్యాంకు ద్వారా చెల్లిస్తే పై పద్దులు యధావిధిగా రాస్తూ మళ్ళీ బ్యాంకు ఖాతాకు క్రెడిట్‌చేయాలి. ఈ వ్యవహారంలో ఇక్కడ రెండు పద్దులు వస్తాయనేది గుర్తుంచుకోవాలి. కాగా బయటి ఎస్.టి.డి. బూత్ నుంచి ట్రంకాల్ చేసినా ఇదే హెడ్ ఆఫ్ అక్కౌంట్ కింద ఖర్చు రాయాలి.

ది.3-2-2001న వ్యాపార ఉపయోగం కోసం వాహనం కొనుగోలుకై బజాజ్ కంపెనీ వారికి బి.నెం.401 దాఖలా రు.20,000/-, బి.నెం.116 రంగా ఆటోమొబైల్స్ కు రు.275/-లకు నగదు, ఇన్సూరెన్సువారికి బ్యాంకు చెక్ నెం.163204కు, రు. 400/-లు. ఈ విధంగా రాయాలి.

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 3-2-2001 | | Scooter A/C | | |
| | | To B.No.401. Bajaj Co | | |
| | | Purchase of Scooter No. | 20,000 | |
| | | To Regn fee | 600 | |
| | | To Ch.No.163204 | | |
| | | Insurance | 400 | |
| | | To B.No.116 Ranga | | |
| | | Automobiles (Spares) | 275 | |
| | | State Bank of India A/C | | |
| | | By Ch.No.163204 | | 400 |

స్కూటర్, మోపెడ్, కారు, జీప్, ట్రక్ వీటిలో ఏదైనా కొనుగోలు చేసినపుడు దాని రిజిస్ట్రేషన్ ఫీ గాని, ఇన్సూరెన్సుగాని, స్పేర్స్ గాని ఇవన్నీ వెహికల్ అక్కౌంట్ కిందికి వస్తాయి. కాగా ఆ తదుపరి ఆ వెహికిల్‌కు స్పేర్ పార్టులు అమర్చినపుడు, పెట్రోలు, డీజిలు, రిపేర్లు తదితర ఖర్చులు "వెహికల్ మెయింటెన్స్" ఖాతాలో చూపాలి. స్కూటరు, మోపెడ్ వంటివి సంస్థ ఆస్తిగా పరిగణింపబడతాయి. సంవత్సరాంతంలో వీటికి తరుగుదల చూపాల్సి ఉంటుంది.

ట్రావెలింగ్ చార్జీలు (TRAVELING CHARGES) :-

వ్యాపారానికి కావలసిన సరుకులు కొలుగోలు చేసేందుకు ఇతర ప్రాంతాలకు వెళ్ళి అక్కడ రెండు రోజులు ఉండి చేసిన ఖర్చులు ఎలా అక్కౌంటు పుస్తకాలలో రాయాలో పరిశీలిద్దాం. రు.20,000-00 నగదు తీసుకుని వెళ్ళగా - కొనుగోలు నిమిత్తం బిల్లు నెం. 16 దాఖలా రు.5000, బిల్లునెం.77 దాఖలా రు.7,100, అరువు బిల్లు నెం.801 దాఖలా కిరణ్ అండ్ కో నుంచి రు.6000 ఖర్చు చేశారు. అక్కడ ఉన్న రెండు రోజులలో లోకల్ సిటీ బస్సు, ఆటో చార్జీలు రు.150, భోజనం, టిఫిన్ వగైరాలకు రు.115, లాడ్జింగ్ రు.150, లోకల్ ఫోన్సు తదితర ఖర్చులు రు.60లు, మరియు ట్రైన్ ఫెయిర్‌కు రు.350/-లు ఖర్చు చేయటం జరిగింది.

పై వ్యవహారంలో మొదటగా - కొనుగోలు కోసం రు.20 వేలు అడ్వాన్సుగా తీసుకొని వెళ్ళడం జరిగింది కనుక -- దీనిని క్యాష్ బుక్‌లో పద్దు ఇలా రాయాలి.

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | ట్రావెలింగ్ అడ్వాన్స్ ఖాతా | | |
| | | To సరుకు కొనుగోలు నిమిత్తం | | |
| | | తీసుకు వెళ్ళిన నగదు | 20,000 | |

రెండు రోజుల తరువాత సరుకు కొనుగోలు చేసి తిరిగి రావడం జరిగింది.

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | ట్రావెలింగ్ అడ్వాన్స్ ఖాతా | | |
| | | By చరణ్ తీసుకున్ననగదు | | 20,000 |
| | | కొనుగోలు ఖాతా | | |
| | | To బిల్లు నెం. 16 | 5000 | |
| | | To బిల్లు నెం. 77 | 7100 | |
| | | To బిల్లు నెం. 81 | | |
| | | కిరణ్ అండ్ కో. | 6000 | |
| | | కిరణ్ అండ్ కో ఖాతా | | |
| | | By బిల్లు నెం. 801 | | 6000 |
| | | ట్రావెలింగ్ ఎక్స్‌పెన్స్‌స్ ఖాతా | | |
| | | To ఓచరు దాఖలా ఖర్చులు | | |
| | | (350+150+115+150+60) | 825 | |

ట్రావెలింగ్ చార్జీలలో బయలుదేరినది మొదలు తిరిగి వచ్చినప్పటి వరకు అన్ని ఖర్చులనూ కలిపి ఒకే ఓచరు రాసి ట్రావెలింగ్ చార్జెస్ ఖాతా అనే హెడ్ ఆఫ్ అక్కౌంట్ కింద చూపాలిగాని ఫోన్‌చేశాము కాబట్టి టెలిఫోన్ ఖాతా కిందనో, భోజనం, టిఫిన్‌లు చేశాము కనుక సాదరు అక్కౌంటు కిందనో రాయకూడదు.

వ్యాపార స్థలానికి - అద్దె కింద నెలకు రు.1000లు చెల్లించినపుడు--

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | అద్దె ఖాతా | | |
| | | To జనవరినెల అద్దె కింద | | |
| | | చెల్లించినది | 1000 | |

వ్యాపార స్థలముతోపాటు ఇతర ప్రాంతాలలో ఏవైనా బ్రాంచీలుగాని, గొడౌనులు గాని అన్నట్లయితే వాటి అద్దెలు కూడా ఇదే హెడ్ ఆఫ్ అక్కౌంట్ క్రింద రాయాలి.

ఇక వ్యాపారాల సంస్థలోని ఉద్యోగులకు జీతాలు ఇచ్చినప్పుడు ఎలా రాయాలో గమనిద్దాం. నెలవారీ జీతంగా గోవిందరావుకు రు.2000, అరుణకు రు.1800, రవి కిరణ్‌కు రు. 1500, ప్రకాష్‌కు రు.1350లు ది. 3-2-2001న చెల్లించడం జరిగింది.

| Date | L.F. | Particulars | | Dr. | Cr. |
|---|---|---|---|---|---|
| 3-2-2001 | | జీతాలు ఖాతా | | | |
| | | To గోవిందరావుకు | | | |
| | | జీతం | 2000 | | |
| | | అరుణకు | 1800 | | |
| | | రవి కిరణ్‌కు | 1500 | | |
| | | ప్రకాష్‌కు | 1350 | 6,650 | |

మరి - గోవిందరావు ఒక నెలలో ముందుగా తన జీతం నుంచి అడ్వాన్సుగా రు.500లు తీసుకున్నాడనుకుందాం. దానిని ఇలా రాయాలి.

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | గోవిందరావు ఖాతా | | |
| | | To జీతం నుంచి | | |
| | | అడ్వాన్సుగా యిచ్చినది. | 500 | |

ఈ అడ్వాన్సును నెల జీతంలో తగ్గించి చెల్లించినపుడు

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | గోవిందరావు ఖాతా | | |
| | | By అడ్వాన్సు అడ్జస్టుమెంట్ | | |
| | | జీతం నుంచి | | 500 |

ఈ విధంగా రాస్తే సరిపోతుంది. జీతాల ఖాతా మామూలుగానే ఉంటుంది. దానిని మార్చనవసరం లేదు. కాగా మార్చి 31 లోగా జీతాలు చెల్లించకపోతే వాటిని "అవుట్ స్టాండింగ్ ఎక్స్‌పెన్సెస్"లో చూపాలి. మార్చిలో చెల్లించాల్సిన జీతాలు ఏప్రిల్‌లో చెల్లించడం జరిగితే .....

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 31-3-2001 | | జీతాల ఖాతా | | |
| | | To మార్చి నెల చెల్లించ | | |
| | | వలసిన జీతాలు | 6,350 | |
| | | అవుట్ స్టాండింగ్ | | |
| | | ఎక్స్‌పెన్సస్ ఖాతా | | |
| | | By ఉద్యోగులకు | | |
| | | మార్చి నెల జీతాలు | | 6,350 |

అద్దె విషయం కూడా ఇదే విధంగా ఉంటుంది. జీతాలు లేబర్ యాక్టు ప్రకారం మాత్రమే రాయాలి.

కరెంటు చార్జీల నిమిత్తం ఆర్.టి.నెం.1647 దాఖలా 250 రూపాయలు ది.5-2-2001న చెల్లించినట్లయితే - - -

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 5-2-2001 | | ఎలక్ట్రిసిటీ చార్జెస్ ఖాతా | | |
| | | To Rt.No.1647 | 250 | |

వడ్డీ బాకీ INTEREST A/C

వ్యాపార నిర్వహణలో పెట్టుబడి సరిపోక పోవడంతో రాజు అనే వ్యక్తి నుంచి అప్పుగా రు.10,000లు నెలసరి 2 రూపాయలు వడ్డీ చెల్లించే ఏర్పాటుతో ది.1-1-2001న తీసుకోవడం జరిగింది. దానిపై ది.2-2-2001న రు. 200/-లు వడ్డీ చెల్లించడం జరిగింది. ఈ సందర్భంలో మొదటగా - రాజు నుంచి నగదు తీసుకున్నాం కనుక --

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1-2-2001 | | రాజు ఖాతా | | |
| | | By వ్యాపార నిమిత్తం రాజు నుంచి వడ్డీకి తీసుకున్న పైకం | | 10,000 |

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1-2-2001 | | వడ్డీ ఖాతా | | |
| | | To రాజుకి వడ్డీ చెల్లించినది (ఫిబ్రవరినెల) | 200 | |

కొన్ని సందర్భాలలో అసలు వడ్డీ కలిపి చెల్లించే ఏర్పాటు ఉండవచ్చును. లేదా ఐదారు నెలలకొకసారి చొప్పున కేవలం వడ్డీ చెల్లించవచ్చును. సందర్భానుసారంగా క్యాష్ బుక్‌లో ఎంట్రీ రాయవలసి ఉంటుంది. మార్చి 31కి ఐదు నెలల వడ్డీ చెల్లించాల్సి వచ్చిందనుకుందాం, దానినిలా రాయాలి.

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 31-3-2001 | | వడ్డీ ఖాతా | | |
| | | To రాజుకు చెల్లించాల్సిన | | |
| | | వడ్డీమార్చి 31 వరకూ | | |
| | | (5నెలలు) | 1000 | |
| | | రాజు ఖాతా | | |
| | | By వడ్డీ | | 1000 |

అదే బ్యాంకు నుంచి లోన్ తెచ్చినట్లయితే వడ్డీ ఖాతాకు డెబిట్ చేసి బ్యాంకు ఖాతాకు క్రెడిట్ చేయాలి.

### కిరాయి ఖర్చుల ఖాతా (FREIGHT CHARGES)A/C :

వేరే ప్రాంతం నుంచి కొనుగోలు చేసిన సరుకులు లారీ ట్రాన్స్‌పోర్టు ద్వారా దిగుమతి చేసుకున్నప్పుడు లారీ ట్రాన్స్‌పోర్టు వారికి కిరాయిగా రు.4000/-లు ఇచ్చినప్పుడు....

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | కిరాయి ఖర్చుల ఖాతా | | |
| | | To రసీదు | | |
| | | నెం.137247 | 4000 | |

ట్రాన్స్‌పోర్టు ద్వారా కాకుండా డైరెక్టుగా లారీలో సరుకులు తెచ్చినప్పుడు కూడా కిరాయి ఖర్చులు ఖాతా కింద లారీ నెంబరు రాసి డెబిట్ చేయాలి. సరుకులు కొనుగోలు నిమిత్తం లారీ లోడింగ్ అన్‌లోడింగ్ (ఎగుమతి, దిగుమతి) ఖర్చులు కేరేజ్ ఇన్‌వార్డ్స్ అక్కౌంట్ కిందా, అమ్మకం జరిగినప్పుడు లారీ ఎగుమతి దిగుమతి ఖర్చులను కేరేజ్ అవుట్ వార్డ్స్ అక్కౌంట్ కింద డెబిట్ చెయ్యాలి.

### అడ్వర్టయిజ్‌మెంట్ ఖాతా (ADVERTISEMENT A/C):

వ్యాపారం అభివృద్ధి కోసం ప్రచారం నిమిత్తం హోర్డింగ్స్ రాసేందుకుగాను ప్రకాష్ ఆర్ట్స్‌వారికి బిల్లునెం. 38రు దాఖలా ది.5-2-2001న రు.5000లు చెల్లించారనుకుందాం.

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 5.2.2001 | | అడ్వర్టయిజ్‌మెంట్ ఖాతా<br>To బిల్లు నెం.38 ప్రకాష్ ఆర్ట్సుకు<br>హోర్డింగ్స్ రాసేందుకు ఇచ్చినది. | 5000 | |

దినపత్రికలలో ప్రకటనలు, క్లాత్ బ్యానర్స్, సినిమా స్లైడ్స్, వాల్ పోస్టర్సు, కేలెండర్స్, మనీ పర్సులు, బ్యాగులు, గిఫ్ట్ ఐటమ్స్ తదితరాలపై ఆయా వ్యాపారాల కనుగుణంగా ఖర్చులు చేస్తూ ఉంటారు. వీటన్నిటికి పైఖాతా క్రిందగాని, సేల్సు ప్రమోషన్ అక్కౌంటు కిందాగాని, బిజినెస్ ప్రమోషన్ ఎక్స్‌పెన్సెస్ అక్కౌంటు కిందగాని పద్దు రాయడం జరుగుతుంది.

## డొనోషన్స్ ఖాతా (DONATIONS A/C):

విద్యా సంస్థలకుగాని, దేవాలయ నిర్మాణాలకుగాని ఇతర సంస్థలకుగాని విరాళాల రూపేణా డబ్బు చెల్లిస్తే దానిని డొనేషన్స్ ఖాతాకు డెబిట్ చెయ్యాలి. విరాళాలు పొందే సంస్థ ఇన్‌కంటాక్స్ డిపార్టుమెంట్ నుంచి సర్టిఫికేట్ పొంది విరాళం ముట్టినట్లుగా మనకు ఇచ్చే రశీదుపై ఆ వివరాలు ముద్రించినట్లయితే డొనేషన్‌లపై 50 శాతం ఇన్‌కమ్‌టాక్స్ రిబేట్ ఉంటుంది. ఈ వివరాలు లేని విరాళాలను ఖర్చుగా పరిగణించరు కాబట్టి టాక్స్ కట్టవలసిన పరిస్థితి ఏర్పడుతుంది.

## బ్యాంక్ కమీషన్ ఖాతా (BANK COMMISSIONS A/C):

డిమాండ్ డ్రాఫ్టులు తీసుకున్నప్పుడు వాటిపై అయ్యే బ్యాంకు చార్జీలు, చెక్‌లు డిస్ ఆనర్ అయినప్పుడు బ్యాంకు వారు వసూలు చేసే చార్జీలు, బ్యాంకు నుంచి లోన్ తీసుకున్నప్పుడు బ్యాంకు వసూలు చేసే చార్జీలు, ఇన్‌స్పెక్షన్ చార్జీలు, లీగల్ చార్జీలు తదితర ఖర్చులు అన్నీ బ్యాంకు కమీషన్ ఖాతా కిందికి వస్తాయి. ఇవన్నీ బ్యాంకు పాస్ బుక్‌లో నమోదై ఉంటాయి. లెడ్జర్‌లో బ్యాంక్ ఖాతాను, బ్యాంక్ పాస్ బుక్‌లో సరిచూసుకోవలసి ఉంటుంది.

## సబ్‌స్క్రిప్షన్స్ ఖాతా (SUBSCRIPTIONS A/C) :

అసోసియేషన్‌కు కట్టే నెలవారీ సంవత్సరం వారీ చందాలు, ఏవైనా మేగ్‌జైన్‌లకు చెల్లించే చందాలు, చిల్లరచందాలు (దేవాలయాలకు, దేవీ నవరాత్రులకు తదితారాలకు) ఇవన్నీ సబ్‌స్క్రిప్షన్ ఖాతాకు చేరుతాయి.

## సన్‌డ్రి ఎక్స్‌పెన్సెస్ ఖాతా (SUNDRY EXPENES A/C.) :

పూజ వగైరాలకు, కొబ్బరికాయ, అగరబత్తీ, ఇతర పూజా ద్రవ్యాలకుగాను చేసిన

ఖర్చులు "సన్‌డ్రీ ఎక్స్‌పెన్సెస్ ఖాతా" కిందకు వస్తాయి. కొన్ని సంస్థలలో మిస్‌లేనియస్ ఖాతాలో చూపడం జరుగుతుంది.

**మిస్‌లేనియస్ ఖాతా (MISCELLANEOUS A/C) :**

ఇంతవరకూ వివరించిన హెడ్ ఆఫ్ అక్కౌంట్ కిందికి రాని చిన్న చిన్న ఖర్చులన్నీ ఈ మిస్‌లేనియస్ ఖాతాకు చేరుస్తారు. వాచ్‌మెన్‌లకు, స్వీపర్లకు, గుర్కాకు ఇచ్చే చిన్న చిన్న మొత్తాలు, రిపేరింగ్ ఖర్చులు, ఎలక్ట్రికల్ రిపేర్‌లకు, నీళ్ళ కుండ, బల్బులు ఇలా చిన్న చిన్న ఖర్చులన్నీ ఈ ఖాతాలో నమోదు చేస్తారు.

**ఆఫీసు మెయింటెనెన్స్ ఖాతా (OFFICE MAINTENANCE A/C) :**

వ్యాపార సంస్థ పెద్దదైన సందర్భంలో ఈ హెడ్ ఆఫ్ అక్కౌంట్ వాడతారు. ఆఫీసు నిర్వహణా ఖర్చులు అధికంగానే ఉండవచ్చు. కాఫీ ఫ్లాస్కులు, కప్పులు, డోర్‌కర్టెన్‌లు. తదితరాలు ఆఫీసు నిర్వహణకు అయ్యే ఇతర ఖర్చులు ఆఫీసు మెయింటెనెన్స్ ఖాతా కింద నమోదు చేయాలి.

సొంతవాడకం ఖాతా (DRAWINGS A/C) :

వ్యాపారి తన ఇంటి ఖర్చుల నిమిత్తం వ్యాపార సంస్థ నుంచి ప్రతి నెలా రు.2000లు తీసుకుంటున్నప్పుడు అతని కేపిటల్ అక్కౌంట్‌కు వాడకం జరిగిన రోజున డెబిట్ చేయాలి. టు పర్సనల్ డ్రాయింగ్స్ అని పేర్కొనాలి.

ఇన్సూరెన్స్ ఖాతా (INSURENCE A/C) :

వ్యాపార వ్యవస్థలో ఇన్సూరెన్స్ అనేది మూడు పరిధులలో జరుగుతూ ఉంటుంది. (1) లైఫ్ ఇన్‌సూరెన్స్:- ఇది వ్యాపారి పేరు మీద మాత్రమే జరుగుతుంది. దీనిలో వ్యాపార సంస్థ నుంచి నగదుగా కాని, బ్యాంకు చెక్ ద్వారా గాని చెల్లిస్తే

ఎల్.ఐ.సి. ప్రీమియం ఖాతాకు చూపాలి. ఆర్థిక సంవత్సరం పూర్తయి కొత్త అక్కౌంటు పుస్తకాలు ఆరంభించేటప్పుడు సంస్థ లాభ నష్టాల్లో దీని ప్రమేయం ఉండదు. కనుక దీనిని తర్వాతి సంవత్సరం అక్కౌంట్ పుస్తకంలోకి సి/ఎఫ్ చేసుకోవాలి. అంటే అస్సెట్స్‌లో ఉంటుంది. కొన్ని సంస్థలలో దీనిని కేపిటల్ అక్కౌంట్‌కు డెబిట్ చేస్తుంటారు. (2) వెహికల్ ఇన్సూరెన్స్:- వాహనం కొనుగోలు చేసినపుడు దానికి చెల్లించే ఇన్సూరెన్స్ చేసినట్లైతే దానిని వెహికల్ మెయింటెనెన్స్ అక్కౌంట్‌లో చూపాలి. (3) జనరల్ ఇన్సూరెన్స్:- అనగా ఉన్న సరుకుపై గాని, యంత్రాలు భవనాలపై గాని ఇన్సూరెన్స్ చేయడం. దీనిని ఇన్సూరెన్స్ అక్కౌంట్‌కు డెబిట్ చేయాలి.

## కమీషన్ ఖాతా (COMMISSION A/C) :

వ్యాపారాన్ని అభివృద్ధి చేయడంలో భాగంగా ఏజెంట్లను నియమించుకోవలసి ఉంటుంది. వీరికి తగిన కమీషన్ ఇవ్వవలసి ఉంటుంది. కమీషన్ ఎంత ఇవ్వాలనేది ఏజెంట్లు జరిపిన అమ్మకాలపై ఆధారపడి ఉంటుంది. ఇలా ఏజెంట్లకు చెల్లించే కమీషన్‌లు కమీషన్ ఖాతాకు డెబిట్ చెయాలి. ఏ అమ్మకం బిల్లు తాలూకు అనేది ఓచరు ప్రకారం ఎవరెవరికి ఎంతెంత కమీషన్ ఇచ్చిందీ వివరంగా రాసుకోవాలి.

## డిప్రిసియేషన్ ఖాతా: (DEPRECIATION A/C)

సంవత్సరాంతంలో అక్కౌంటు పుస్తకాలు క్లోజ్ చేసి లాభనష్టాలు ఆస్తి అప్పుల పట్టిక తయారు చేస్తున్నప్పుడు ఇన్‌కంటాక్స్ నిబంధనలకు అనుగుణంగా ఫర్నీచర్, వాహనాలు ఇతర ఆస్తులకు అరుగుదల (డిప్రిసియేషన్) చూపాలి. దీనిని అక్కౌంటు పుస్తకాలలో డిప్రిసియేషన్ ఖాతాకు డెబిట్‌చేసి (ఏ అస్సెట్స్‌పై ఎంత?) మరల అస్సెట్స్ ఖాతాలకు అదే మొత్తాన్ని క్రెడిట్ చేయాలి.

## ప్రొవిజెన్ ఫర్ ఎక్స్‌పెన్‌సెస్ ఖాతా (PROVISION FOR EXPENSES):

సంవత్సరాంతంలో - మార్చి 31 లోగా చెల్లించాల్సిన బిల్లులు గాని, మరేయితర బాకీలుగాని మరుసటి సంవత్సరంలో చెల్లించేటట్లయితే (ఉదా: జీతాలు, సేల్సుటాక్సు, టెలిఫోన్ బిల్స్, వగైరా) వాటిని ఏ ఖాతాకు ఆ ఖాతా డెబిట్ చేసి వాటన్నిటినీ ప్రొవిజన్ ఫర్ ఎక్స్‌పెన్సెస్ ఖాతాకు క్రెడిట్ చేయాలి.

అరువు కొనుగోళ్ళు, అరువు అమ్మకాలు ఎక్కువగా ఉండే వ్యాపార సంస్థలలో పర్చేజ్ రిజిష్టరు, సేల్సు రిజిష్టరు విడివిడిగా పెట్టి పద్దులు రాస్తుంటే అక్కౌంటింగ్ సులభతరంగా ఉంటుంది. దీని ద్వారా ఏనెల కానెల నెలవారీగా అరువు అమ్మకాల మొత్తాన్ని ఆవర్జాలో అమ్మకాల ఖాతాకు, అరువు కొనుగోలు మొత్తాన్ని కొనుగోలు ఖాతాకు అవార్జీ చేసుకొని పార్టీ ఖాతాలకు మాత్రం తేదీలవారీగా బిల్సు సొమ్మును అమ్మకమైతే డెబిట్, కొనుగోలైతే క్రెడిట్ చేయడం జరుగుతుంది.

పర్చేజ్ రిజష్టరు నమూనా(PURCHASE REGISTER)

| Date of Account | Bill No.& Date | Name of the Party & Place | Amount | L.F. No. |
|---|---|---|---|---|
| | | | | |

సేల్సు రిజష్టరు నమూనా(SALES REGISTER)

| Date of Account | Bill No.& Date | Name of the Party & Place | Amount | L.F. No. |
|---|---|---|---|---|
| | | | | |

ఎల్.ఎఫ్.నెం. అనే చోట లెడ్జరులో ఏ నెంబరు నమోదు చేశారో ఇక్కడా నమోదు చేయాలి. పర్చేజ్ రిజిష్టరులో డేట్ ఆఫ్ అక్కౌంట్ అనే చోట కొనుగోలు వేరే ప్రాంతముద్దై ఉన్నప్పుడు ఆ బిల్లు రిసీవ్ చేసుకొని అక్కౌంటులో రాసే రోజును రాయవలసి ఉంది. ఉదా: మనోజ్ అండ్ కో., హైదరాబాద్ వారి వద్ద నుంచి 1-2-20001న బిల్లు నెం.47 దాఖలా రు. 1000లు కొనుగోలు జరిగి అది వ్యాపార సంస్థకు ట్రాన్స్‌పోర్టు ద్వారా 4-2-2001న చేరినదనుకుంటే డేట్ ఆఫ్ అక్కౌంట్ అన్నచోట 4-2-2001 అని బి.నెం. వద్ద బిల్లు నెంబర్లు బిల్లు డేట్ అనే చోట 1-2-2001 అని రాయాలి.

పర్చేజ్ రిటన్సు రిజష్టరు నమూనా

| Date of Account | Debit Note No. | Bill No. & Date | Name of the Party & Place | Amount | L.F. No. |
|---|---|---|---|---|---|
| | | | | | |

సేల్సు రిటర్న్స్ రిజష్టరు నమూనా

| Date of Account | Debit Note No. | Bill No. & Date | Name of the Party & Place | Amount | L.F. No. |
|---|---|---|---|---|---|
| | | | | | |

స్టాకు రిజష్టరు నమూనా

| Date | Opening Balance | Purchase | Total | Sales | Closing Balance |
|---|---|---|---|---|---|
| | | | | | |

ది.1-2-2001 తేదీన 50 వస్తువులు కొన్నాడనుకుందాం. పాత నిల్వ ఏమీ లేదు. అదే రోజు 5 వస్తువులు అమ్మకం జరిగింది. మళ్ళీ 2-2-2001న అమ్మకంగాని కొనుగోలు గాని ఏమీలేదు. 3-2-2001న అమ్మకం 10 వస్తువులు. దీనిని ఇలా చూపవచ్చు.

| Date | Opening Balance | Purchase | Total | Sales | Closing Balance |
|---|---|---|---|---|---|
| 1-2-2001 | 0 | 50 | 50 | 5 | 45 |
| 3-2-2001 | 45 | - | 45 | 10 | 35 |
| | 35 | | | | |

పెట్టీ క్యాష్ బుక్ (చిల్లర నగదు చిట్టా)PETTY CASH BOOK :

ప్రతి చిన్న చిన్న ఖర్చులు మెయిన్ క్యాష్ బుక్‌లో రాయడం ఇబ్బంది కలిగించే అంశం. అందుకని చిల్లర ఖర్చులకోసం మెయన్ క్యాష్ బుక్‌లో పెట్టీ క్యాష్ బుక్ కోసం కొంత మొత్తాన్ని డెబిట్ చేసి చిల్లర ఖర్చులను దాని నుంచి వాడడం జరుగుతుంది. ఆ మొత్తం నుంచి రోజు వారీ చిన్న చిన్న ఖర్చులు పెట్టి నెల చివరలో క్యాష్ బుక్‌లో జమకట్టడం జరుగుతుంది. ఉదాహరణ: 1-2-2001న మెయిన్ క్యాష్ బుక్‌లో రు.100లు పెట్టీ క్యాష్ బుక్ పేర రాసి ఇచ్చారు. దాని నుంచి రోజువారీ కింద విధంగా ఖర్చు చేశారు.

| | | | |
|---|---|---|---|
| 2001 ఫిబ్రవరి | 2 | పోస్టల్ స్టాంపులు | రు. 10.00 |
| " | 5 | రిక్షాకు | రు. 12.00 |
| " | 6 | కాఫీలకు | రు. 9.00 |
| " | 9 | జిరాక్స్ | రు. 2.00 |

| | | | |
|---|---|---|---|
| " | 12 | ఆఫీసు ఖర్చులు | రు. 20.00 |
| " | 18 | సిటీబస్సు చార్జీలు | రు. 5.00 |
| " | 21 | బాల్ పెన్ | రు. 6.00 |
| " | 25 | బల్బు | రు. 7.00 |
| " | 27 | టెలిఫోన్ | రు. 2.00 |

## పెట్టీ క్యాష్ బుక్

| రిసీప్ట్ | డేట్ | వివరాలు | మొత్తం | పోస్టేజీ | స్టేషనరీ | కన్వేయన్స్ | సాదరు | మి. | టెలిఫోన్ |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 100 | 2001 | | | | | | | | |
| | ఫిబ్ర1 | పోస్టేజీ | 10 | 10 | | | | | |
| | 5 | రిక్షా | 12 | | | 12 | | | |
| | 6 | కాఫీ | 9 | | | | 9 | | |
| | 9 | జిరాక్సు | 2 | | 2 | | | | |
| | 15 | రిపేరు | 20 | | | | | 20 | |
| | 18 | సిటీబస్సు | 5 | | | 5 | | | |
| | 21 | బాల్పెన్ | 6 | | 6 | | | | |
| | 25 | బల్బు | 7 | | | | | 7 | |
| | 27 | టెలిఫోన్ | 2 | | | | | | 2 |
| | | టోటల్ | 73 | 10 | 8 | 17 | 9 | 27 | 2 |
| 100 | సి.యఫ్ | 27 | | | | | | | |
| 27 | బై సి.డి | | | | | | | | |

పెట్టీ క్యాష్ కింద ఇచ్చిన రు.100 లకు గాను రు.73లు ఖర్చు అయినవి. కావున ఈ రు.73లు మెయిన్ క్యాష్ బుక్‌లో పెట్టీ క్యాష్ బుక్ అక్కౌంటు పేరుతో జమకట్టి ఖర్చుల ఖాతాకు డెబిట్ చేసి దాని నుంచి లెడ్జర్‌కు అవార్జీ చేయాలి. అవసరం అయిన సంస్థలలోనే ఈ విధంగా పెట్టీ క్యాష్ బుక్ మెయింటెనెన్స్ చేయడం జరుగుతుంది. ప్రతి సంస్థలోను యీలా పెటీ క్యాష్ బుక్ మెయిన్‌టైన్ చేయనవసరం లేదు.

ఇప్పటి వరకు వ్యాపారం ప్రారంభం గురించి, అలాగే దానికి సంబంధించిన అక్కౌంటు పుస్తకాలు, క్యాష్ బుక్, లెడ్జర్ ఎలా ప్రారంభించాలో క్యాష్ బుక్‌లో ఎలా "హెడ్ ఆఫ్ అక్కౌంట్సు" విడగొట్టి ఖాతాలు ఎలా ప్రారంభించాలో, తేదీ వారీగా క్యాష్ బుక్‌లో రాసిన అంశాలను లెడ్జరులో ఎలా పోస్టింగ్ చేయాలో తెలుసుకున్నాం. దీనితో క్యాష్ బుక్ (చిట్టా), లెడ్జర్ (ఆవర్జా) లపై సమగ్రంగా కాకపోయిన మంచి అవగాహన తప్పక ఏర్పడుతుంది. చిట్టా రాయడంలోనూ, ఆవర్జా పోస్టింగ్ వేయడంలోనూ ఎప్పటికప్పుడు చెప్పిన సూత్రాలను మననం చేసుకుంటూ పలు విధాలుగా ప్రాక్టీసు పదేపదే చేస్తుంటే సబ్జక్టు మరింత బాగా అర్థం అవుతుంది. ఉదాహరణలను మార్చి మార్చి రాస్తుండాలి. ఒక సంస్థలో ఏ ఏ రాబడులు ఏ ఏ ఖాతాల కింద జమలు అవుతాయో అలాగే ఏఏ ఖర్చులు ఏఏ ఖాతాలకింద ఖర్చులు అవుతాయో కాగితాల మీద రాస్తూ అభ్యాసం చేయాలి. ఇలా చేయడం కొత్తగా అక్కౌంట్స్ నేర్చుకుంటున్నవారికి బాగా ఉపకరిస్తుంది. నిజానికి కొద్దో గొప్పో అక్కౌంట్సు రాస్తున్నవారు కూడా 'వ్యాపార సరళి' ని అవగతం చేసుకునేందుకు పలు అంశాల మీద దృష్టి కేంద్రీకరిస్తూ వ్యాపార లావాదేవీలపైన సమగ్రమైన పట్టు సాధించడం అవసరం. అందుకు

సబ్జెక్టుకు సంబంధించి తెలిసిన విషయాలను నిరంతరం మననం చేసుకుంటూ తెలియని విషయాలను ఎప్పటికప్పుడు నేర్చుకుంటూ ప్రతి అంశాన్ని ప్రాక్టికల్‌గా అభ్యాసం చేయడం ఒక్కటే మార్గం. సదా అన్వేషణాశీలుడైన వ్యక్తి ఎప్పుడూ సునాయాసంగా విజయం సాధిస్తూ ఉంటాడు.

ఇప్పుడు డబుల్ కాలం క్యాష్ బుక్ గురించి తెలుసుకుందాం.

(నమూనా)

క్రెడిట్ (వసూళ్ళు) | డెబిట్ (చెల్లింపులు)

| Date | L.F. | Particulars | Cash | Bank | Date | L.F. | Particulars | Cash | Bank |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | | | |

పైనమూనాలో ఎడమవైపున క్రెడిట్ (వసూళ్ళు) క్యాష్ రూపేణా వస్తే క్యాష్ కాలంలో హెడ్ ఆఫ్ అక్కౌంట్ కింద జమకట్టుకోవాలి. కుడివైపు అంతా డెబిట్ (చెల్లింపులు) క్యాష్ ద్వారా చెల్లిస్తే క్యాష్ కాలంలో హెడ్ ఆఫ్ అక్కౌంటుకు డెబిట్ చేసుకోవాలి. ఈ తరహా క్యాష్ బుక్‌ను బ్యాంకు లావాదేవీలు ఎక్కువగా ఉన్న సంస్థ మెయింటెయిన్ చేస్తుంది. దీని వలన ఉపయోగం ఏమిటంటే బ్యాంకు అక్కౌంటును లెడ్జరులో వేరుగా నమోదు చేయనవసరంలేదు. బ్యాంకు బ్యాలెన్సు తెలుసుకోవాలంటే క్యాష్ బుక్ కాలం చూసి తెలుసుకోవచ్చు. అంతేగాక రావలసిన బాకి చెక్కు ద్వారా పేమెంట్ వచ్చినపుడు వారి పేరుతో జమకట్టి డైరెక్టుగా బ్యాంకు కాలంలో రాయాలి. అదే విధంగా ఎవరికైనా ఇవ్వవలసిన బా॥ చెక్కు ద్వారా చెల్లించినపుడు డెబిట్ వైపు ఎవరికి ఇచ్చామో వారి పేరున అక్కౌంట్ రాసి బ్యాంకు

కాలంలో మొత్తం వేయాలి. అదే సింగిల్ కాలం క్యాష్ బుక్ అయితే ఒకే పద్దు రెండుసార్లు రాయవలసి వచ్చేది. ఇటువంటి సందర్భాలలో ఈ విధానం రాయడానికి చాలా సులభంగా ఉంటుంది. మరో విషయం ఏమంటే సంస్థ అవసర నిమిత్తం బ్యాంకు నుంచి చెక్ ద్వారా క్యాష్ విత్‌డ్రా చేసినపుడు క్రెడిట్ వైపున బ్యాంక్ ఖాతాకు బై చెక్ నెం. అని రాసి క్యాష్ కాలంలో ఎమౌంట్‌ను చూపాలి. ఎందువల్లనంటే క్యాష్ సంస్థలోకి వచ్చింది కాబట్టి. మళ్ళీ డెబిట్ వైపున క్యాష్ అని రాసి బ్యాంకు కాలంలో అదే ఎమౌంట్ చూపాలి. ఇలా ఎందుకంటే బ్యాంకులో ఉన్న బ్యాలెన్సు విత్‌డ్రా చేయడంలో నిల్వ తరిగిపోయింది కాబట్టి. ఈ రెండు పద్దుల మీదా ఎల్.ఎఫ్. అనే చోట 'సి' *('C') అంటె కంట్రీఎంట్రీ (పోటీపద్దు) అనిఅర్థము. అని రాసుకోవాలి. దీనిని లెడ్జరులోకి పోస్టింగ్ చేయనవసరం లేదు. ఇది పోటీ పద్దు కనుక ఒక వైపు రాసి మరో వైపు రాయడంలో మిస్ జరగకుండా ఉండేందుకు గాను ఈ గుర్తు ఉపయోగ పడుతుంది. అదే విధంగా బ్యాంకు ఖాతాలో క్యాష్ డిపాజిట్ చేసినపుడు డెబిట్ వైపు బ్యాంక్ ఖాతా టు క్యాష్ డిపాజిట్ అని రాసి క్యాష్ కాలంలో ఎమౌంట్‌ను చూపాలి. మళ్ళీ క్రెడిట్ వైపున క్యాష్ అని రాసి బ్యాంకు కాలంలో ఎమౌంట్ చూపడం జరుగుతుంది. దీనికి కూడా ముందు 'సి' అనే గుర్తు ఉంచాలి.

ఉదాహరణ:

ది.1-2-2001న సంస్థలో ఈ క్రింది ట్రాన్‌సక్షన్స్ జరిగాయనుకుందాం

1. నగదు బి.నెం. 10 దాఖలా అమ్మకం రు. 500-00 లు
2. నగదు కొనుగోలు చె.నెం.15 దాఖలా సూర్య అండ్ కో నుంచి కొనుగోలు రు.1500-00

3. రామమోహన్ నుంచి చె.నెం.741683 దాఖలా రు.2000-00 వసూలు

4. బ్యాంకు నుంచి రు.1000-00 చె.నెం.414653 దాఖలా విత్‌డ్రా

5. రహమాన్ ఎంటర్ ప్రైజస్ చె.నెం.414654 ద్వారా రు.2500-00 చెల్లింపు

6. బ్యాంకులో రు.5000-00లు నగదు డిపాజిట్

క్రెడిట్ డెబిట్

| Date | L.F. | Particulars | Cash | Bank | Date | L.F. | Particulars | Cash | Bank |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1.2.2001 | | సేల్సుఖాతా | | | 1.2.2001 | | పర్చేజ్‌ఖాతా | | |
| | | By బి.నెం. | 500 | | | | To బి.నెం. | 1500 | |
| | | రామాఅండ్‌కో | | | | C | క్యాష్ | | 2000 |
| | | By చె.నెం. | | | | | రెహమాన్ | | |
| | | 741683 | | 2000 | | | ఎంటర్‌ప్రైజస్ | | |
| | C | బ్యాంకు ఖాతా | | | | | To చె.నెం. | | |
| | | By చె.నెం. | | | | | 414654 | | 2500 |
| | | 414653 | 2000 | | | C | బ్యాంకు ఖాతా | | |
| | C | క్యాష్ | | 5000 | | | To క్యాష్ | 5000 | |

లెడ్జర్ నమూనా

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | | | |

క్రెడిట్స్ అన్నింటినీ క్రెడిట్ కాలంలోనూ నమోదు చేసి, డెబిట్స్ అన్నింటినీ డెబిట్ కాలం లోనూ నమోదుచేసి ఎల్.ఎఫ్. అనేచోట డేబుక్ పేజి నెంబరును ఆవర్జాలోనూ, ఆవర్జాపేజి నెంబరును డే బుక్‌లోనూ వేయాలి. మరో విషయం ఏమంటే క్యాష్ బుక్‌లో క్రెడిట్ వైపు ఉన్న క్యాష్ కాలం, బ్యాంక్ కాలం కూడా లెడ్జర్‌లో క్రెడిట్ కాలంలోనే ఎంటర్ చేసుకోవాలి. క్యాష్ రూపేణా అయినా, బ్యాంకు ద్వారా గానీ రెండు కూడా క్రెడిట్‌యే కదా! అదే విధంగా క్యాష్ బుక్‌లో డెబిట్ వైపు ఉన్న క్యాష్ కాలం, బ్యాంక్ కాలం కూడా లెడ్జరులో డెబిట్‌వైపునకే వస్తాయి. ఈ క్యాష్‌బుక్ రాసేటప్పుడు జర్నల్ బుక్ వేరుగా రాయాలి. దానిలో క్యాష్, బ్యాంక్, క్రెడిట్ సేల్సు, క్రెడిట్ పర్చేజ్ కానటువంటి పద్దులు (కాంట్రా ఎంట్రీస్) దీని ద్వారా చూపించడం జరుగుతుంది. అటువంటివి ఉదాహరణకు ఆస్తులపై డిప్రిసియేషన్, ప్రావిజన్ ఫర్ ఎక్స్‌పెన్స్‌స్, డిస్కౌంట్స్ లాంటివి. ఉదా: (1) స్కూటరు విలువ రు.25000లపై 20% డిప్రిసియేషన్ చొప్పున.

2. చెల్లించ వలసిన అద్దె రు.2000-00

జర్నల్

| Date | L.F. | Particulars | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | | డిప్రిసియేషన్ ఖాతా Dr. | 5000 | |
| | | To సూటరు ఖాతా | | 5000 |
| | | (రు.2500లపై 20% | | |
| | | డిప్రసి యేషన్ | | |
| | | చేసినందువల్ల) | | |

| | | |
|---|---|---|
| అద్దె ఖాతా Dr. | 2000 | |
| To ప్రొవిజన్ ఫర్ ఎక్స్‌పెన్సెస్ (అద్దె చెల్లించవలసి వున్నందున) | | 2000 |

దీని ద్వారా లెడ్జర్ పోస్టింగ్ చేసుకోవాలి. మిగిలినవన్నీ మామూలే. సింగిల్ కాలం క్యాష్ బుక్‌లా లెడ్జరు బ్యాలెన్సు తేల్చి ట్రేడింగ్, ప్రాఫిట్ అండ్ లాస్ అక్కౌంట్,

బ్యాలన్స్ షీట్లను తయారు చేయాలి. దీనిని మరింత విపులంగా నాన్ ట్రేడింగ్, చిట్ ఫండ్ అక్కౌంట్స్ తెలుసుకునేటప్పుడు పరిశీలిద్దాం.

4 కాలం క్యాష్ బుక్ నమూనా

| Date | L.F. | Particulars | Cash | | Credit | |
|---|---|---|---|---|---|---|
| | | | Dr. | Cr. | Dr. | Cr. |
| | | | | | | |

ఈ క్యాష్ బుక్ ద్వారా క్యాష్ అమ్మకాలు, క్యాష్ వసూళ్ళు అన్నీ క్యాష్ జమ కాలంలోనూ, క్యాష్ కొనుగోలు క్యాష్ పేమెంట్స్ అన్నీ క్యాష్ ఖర్చు కాలంలోనూ చూపడం జరుగుతుంది. అదే విధంగా క్రెడిట్ అమ్మకాలు, అరువు జమ కాలంలో చూపించి మరల ఎవరికైతే అమ్మామో వారి పేరున ఖర్చూ, అలాగే ఎవరివద్ద

నుంచి చెక్కు వచ్చిందో వారి పేరున జమ కట్టి బ్యాంకు పేరున ఖర్చు రాయాలి. అలాగే అరువు కొనుగోళ్ళు, బ్యాంకు ద్వారా చెక్కు చెల్లింపులూ దీనికి వ్యతిరేకంగా రాయాల్సి ఉంటుంది. ఒక రకంగా చెప్పాలంటే క్యాష్ వసూలుగాని క్యాష్ చెల్లింపుగాని క్యాష్‌కు సంబంధించినవన్నీ క్యాష్ కాలంలోనూ కాంట్రా ఎంట్రీస్ అన్నీ కూడా అరువు కాలంలోనూ చూపడం జరుగుతుంది. దీని ద్వారా క్యాష్ ట్రాన్‌శాక్షన్‌ను క్రెడిట్ ట్రాన్స్‌శాక్షన్‌నూ విడివిడిగా తెలుసుకోవడం మరియు క్యాష్ బ్యాలెన్సును సులభంగా తేల్చడం జరుగుతుంది. దీని లెడ్జరు మామూలుగా సింగిల్ కాలం క్యాష్ బుక్‌కు చెందిన లెడ్జరు మాదిరిగానే ఉంటుంది. మిగతా వ్యవహారాలలో ఏమీ తేడా ఉండదు.

ఇప్పటి వరకూ ట్రేడింగ్‌కు సంబంధమైన వ్యాపారం ప్రారంభించేందుకు ముందుగా సేల్సు టాక్సు డిపార్టుమెంట్ నుంచి R.C.పొంది వ్యాపారంలో జరిగే వ్యవహారాలకు అనుగుణంగా కాష్ బుక్, లెడ్జరు పోస్టింగ్, వివిధ ఖాతాల వివరణ, మొదలైనవి తెలుసుకున్నాం.

వ్యాపారి A.P.G.S.T. లైసెన్సు తీసుకోవడం ద్వారా అతడు వ్యాపారానికి కావలసిన సరుకులను ఈ రాష్ట్రంలో మాత్రమే కొనుగోలు అమ్మకాలు జరిపేందుకు అర్హత పొంది ఉన్నాడు. ఇతర రాష్ట్రాలలో కూడా వ్యాపార లావాదేవీలు నిర్వహించాలంటే A.P.G.S.T. లైసెన్సుతోపాటు C.S.T. లైసెన్సు కూడా పొందాలి (సెంట్రల్ సేల్సు టాక్స్). ఇది ఇండియా అంతటికీ వర్తిస్తుంది. ఈ C.S.T. లైసెన్సు వల్ల వ్యాపారి అనేక ప్రయోజనాలు పొందే అవకాశం ఉంది. చాలా తక్కువ ధరలకు లభ్యమయ్యే సరుకులను ఇతర రాష్ట్రాలనుంచి కొనుగోలు చేయవచ్చు. అలాగే

మన రాష్ట్రంలోని సరుకులను గిరాకి ఉన్న రాష్ట్రాలలో అమ్మకాలు సాగించి మంచి లాభాలను గడించవచ్చు. ఇవన్నీ C.S.T. లైసెన్సు వల్ల సాధ్యమవుతాయి. ఈ C.S.T. లైసెన్సు ప్రధానోద్దేశం ఏమంటే వ్యాపార వ్యవహారాలలో వివిధ రాష్ట్రాల మధ్య క్రమబద్దీకరణ సాధించడమే.

ఏ వ్యాపారానికైనా అధిక లాభార్జనే ప్రధాన ధ్యేయం కాబట్టి - వ్యాపారి తన వ్యాపారాన్ని విస్తృతపరచుకునే దిశగా ఈ C.S.T. లైసెన్సు పొందాల్సి ఉంటుంది. దీనిక A.P.G.S.T. మాదిరిగానే సంబంధిత సేల్సు టాక్సు అధికారి కార్యాలయంలో Form No.A పూర్తిచేసి సెక్యూరిటీ డిపాజిట్టుగా రు.4000-00లు N.S.C. రూపేణా చెల్లించాలి. A.P.G.S.T., C.S.T. రెండూ ఒకేసారి పొందవచ్చు. లేదా ముందుగా A.P.G.S.T. పొందాలి. రెంటికి కలిపి సెక్యూరిటీ డిపాజిట్ రు.6000లు N.S.C. ద్వారా చెల్లించాలి. C.S.T. కి వేరుగా లైసెన్సు ఫీజు, రెన్యువల్ గాని ఉండవు.

కాగా A.P.G.S.T. కి C.S.T. కి తేడా ఏమంటే A.P.G.S.T యాక్టు షెడ్యూల్సు ప్రకారంగా కమోడిటీ టాక్సేషన్‌ను తెలుపుతుంది. అదే C.S.T. యాక్టు అయితే ట్రాన్సాక్షన్ ప్రకారం టాక్సేషన్ తెలియజెపుతుంది.

A.P.G.S.T. యాక్టులో సరుకులు అన్నింటినీ 7 షెడ్యూల్సుగా విభజించారు. ఆయా సరుకులను బట్టి అమ్మకపు పన్ను నిర్ణయించారు. కాగా ఏఏ వస్తువులకు ఎంతెంత Tax విధిస్తారో, ఏ పాయింట్ మీద అంటే సరుకు అమ్మకం మీదనా కొనుగోలు మీదనా అనే విషయం తెలుసుకోవాలంటే 1 - 7 షెడ్యూల్సు వరకూ వున్న సరుకులను గురించి Sales Tax రెడీ రెక్నర్ ద్వారా తెలుసుకోవచ్చు.

బిజినెస్ అక్కౌంట్స్ పరిభాషలో - ఈ రాష్ట్రంలో సరుకులు కొని ఈ రాష్ట్రంలోనే అమ్మితే ఆ సరుకులను సెకండ్ సేల్సు అని అంటారు. అలాగే ఇతర రాష్ట్రంలో కొని ఈ రాష్ట్రంలో అమ్మిన సరుకులను ఫస్టు సేల్సు అని అంటారు. అదే ఈ రాష్ట్రంలో కొన్నవైనా ఇతర రాష్ట్రాలలో కొన్నవైనా ఇతర రాష్ట్రాలలో అమ్మిన సరుకులకు C.S.T. సేల్సు అని పేర్కొంటారు. కాగా ఏ సరుకులైనా ఇతర దేశాలకు ఎగుమతి చేస్తే ఎక్స్‌పోర్టు సేల్సు అని అంటారు.

**వాల్యూయాడెడ్ టాక్స్ (VAT):**

గ్రాస్ ప్రాఫిట్ మీద వేయబడే టాక్స్‌ను వాట్ అంటారు. సేల్సు వాల్యూ నుంచి పర్చేజ్ వాల్యూ తీసివేస్తే గ్రాస్ ప్రాఫిట్ వస్తుంది. అదనపు విలువపై విధించే సుంకమే వాట్. ఉత్పత్తి మొదలు తుది అమ్మకాల వరకు అదనంగా చేసే విలువపై పన్ను విధిస్తారు. అమ్మిన అమ్మకంపై ఎంత శాతం టాక్సో చూసి అదే సరుకు కొనుగోలు చేసినప్పుడు ఎంత టాక్స్ కట్టి ఉన్నామో (కొనుగోలు బిల్లుపై ఎంత అనేది ఉంటుంది) ఆ టాక్స్‌ను అమ్మకం చూపిన టాక్స్ నుంచి తగ్గిస్తే కట్టవలసిన వాట్ వస్తుంది. ఓ ఉదాహరణను పరిశీలిద్దాం. మనోజ్ ఎలక్ట్రికల్స్ నుంచి ఒక ఫ్యాన్‌ను కొనుగోలు చేశారనుకుందాం. ఫ్యాన్ ఖరీదు రు.560లు మనోజ్ ఎలక్ట్రికల్స్ వారి రాసి ఇచ్చిన బిల్లులో ఫ్యాన్ ఖరీదు రు. 500/-లు, దానిపై ఎస్.టి. 12% చొప్పున రు. 60/-లును మొత్తం రు. 560/-లుగా పేర్కొన్నారు. అదే ఫ్యాన్‌ను కిషోర్ ఎలక్ట్రికల్స్ వారు రు. 600/-లకు అమ్మదలుచుకున్నారనుకోండి దానిపై ఎంత వాట్ చెల్లించాలో చూద్దాం. రు.600/-లకు ఎస్.టి.12% చొప్పున రు.72లు అవుతుంది. ఈ రు. 72/-లు నుంచి కొనుగోలు సమయంలో మొదట కట్టిన రు.60/-లను తగ్గిస్తే రు.12/-లు ఉంటుంది. ఇప్పుడు రు.600/-లకు టాక్స్ రు.12/-లు కలిపి మొత్తం రు.612/-లకు ఫ్యాన్ అమ్మాలి. ఈ రు.12లు సేల్సు

టాక్స్ డిపార్టుమెంట్ వారికి వాట్ టాక్స్‌గా కట్టవలసి ఉంది.

పది లక్షల రూపాయల టర్నోవర్ దాటిన వ్యాపారులకు మాత్రమే వాట్ వర్తిస్తుంది. అయితే పది లక్షలకు తగ్గినా సరుకులు రిజిష్టర్డు డీలరుకు అమ్మినట్లయితే 'వాట్' వేటు పడుతుంది.

టర్నోవర్ టాక్స్ (TOT):

అమ్మకాలు సాగించే వస్తువులు ఏ కమోడిటీకి చెందినవైనప్పటికీ వాటి రేట్ ఆఫ్ టాక్స్‌తో సంబంధం లేకుండా టోటల్ సెకండ్ సేల్సు టర్నోవర్‌పై 1 శాతం చొప్పున ఎస్.టి. వసూలు చేసి సేల్సు టాక్స్ డిపార్టుమెంట్ వారికి చెల్లించాల్సి ఉంటుంది. దీనినే టర్నోవర్ టాక్స్ అంటారు. ఇది కూడా 10 లక్షల రూపాయల టర్నోవర్‌లోపు వ్యాపారులకు వర్తించదు. ఫస్ట్ షెడ్యూలులోని ఔషధాలు, ఎరువులు, పురుగుమందులు, టైర్లు, ట్యూబులు, లూబ్రికెంట్లు, మైదా, విజిటబుల్స్ వీటికి మాత్రం టర్నోవర్ టాక్స్ ఉండదు. మిగతా వాటికి ఉంది. డాల్డాకు ఉంది. 3, 4, 5 షెడ్యూలులోని సరుకులకు పూర్తిగా ఈ TOT వర్తించదు. ఐదో షెడ్యూలులో ఉన్న ఒకే ఒక సరుకు బెల్లం. దీనికి TOT ఉండదు. ఇక ఆరో షెడ్యూలులోని సరుకులు వాట్ పరిధిలోకి వస్తాయి కనుక వాటికిTOT లేదు. కాగా ఏడో షెడ్యూలులోని జనరల్ గూడ్స్ అన్నింటికీ ఈ టర్నోవర్ టాక్స్ ఉంటుంది.

వాట్ వర్తించే వాటికి టర్నోవర్ టాక్స్ ఉండదు. టర్నోవర్ టాక్స్ పరిధిలోని వాటికి వాట్ వర్తించదు. మరికొన్ని వాటికి ఈ రెండు టాక్స్‌లు లేవు. అయితే ఫస్ట్ సేల్సు సరుకులన్నింటికీ టాక్స్ తప్పనిసరిగా ఉంటుంది.

టర్నోవర్ టాక్స్ అనేది మొదట్లో "అడిషనల్ టాక్స్"గా ఉండేది. ది.1-8-1996 నుంచి TOTగా అమలులోకి వచ్చి ప్రస్తుతం కొనసాగుతోంది.

'సి' ఫారం ఉపయోగం ఏమిటి?

ఒక వ్యాపారి ఇతర రాష్ట్రాలలో సరుకు కొనుగోలు చేస్తే దానికి సి.ఎస్.టి. చెల్లించవలసి ఉంటుంది. కొనుగోలు బిల్లులో సి.ఎస్.టి. ఎంతో రాస్తారు. అయితే ఆ వ్యాపారికి 'సి' ఫారం కనుక ఉన్నట్లయితే కొనుగోలుపై చెల్లించే టాక్స్ తగ్గుతుంది.

సి.ఎస్.టి. 10 శాతం వసూలు చేస్తారు. 'సి' ఫారం కనుక ఉంటే కేవలం 4 శాతం సి.ఎస్.టి. చెల్లిస్తే సరిపోతుంది. అంటే ఆ వ్యాపారి 6 శాతం లాభం పొందుతాడన్నమాట. మరి - ఇతర రాష్ట్రాల నుంచి సరుకు కొనుగోలు చేయదలచిన వ్యాపారులు ఈ 'సి' ఫారంను పొందడం ఎలా అనేది పరిశీలిద్దాం.

'సి' ఫారాలను సేల్సు టాక్సు డిపార్టుమెంట్ వారు సరఫరా చేస్తారు. దీనికోసం రు.54లు బ్యాంకు చలానా ద్వారా అసెసింగ్ అధారిటీ వారి పేరున చెల్లించి 'సి' ఫారాలను పొందవచ్చు. లేటెస్టు జి.ఓ.(7-8-98) ప్రకారం ఒకే పార్టీ నుంచి ఒక సంవత్సర కాలంలో ఎన్ని బిల్లులకైనా బిల్లుల విలువ ఎంతైనా ఒకే 'సి' ఫారం ఇస్తే సరిపోతుంది. వేర్వేరు డీలర్ల నుంచి సరుకులు కొనుగోలు చేస్తే ఒక్కొక్కరికి ఒక్కో 'సి' ఫారం ఇవ్వాలి.

ఈ విధంగా సేల్సు టాక్సు డిపార్టుమెంట్ నుంచి ఎ.పి.జి.ఎస్.టి. మరియు సి.ఎస్.టి. లైసెన్సులు పొంది వ్యాపారం నిర్వహిస్తున్నప్పుడు రూల్ నెం. 7 అండ్ 17ల ప్రకారం వ్యాపారి సదరు సేల్సు టాక్సు డిపార్టుమెంట్ వారికి రిటన్ ఫారాలను దాఖలు చేయవలసి ఉంటుంది.

ఫారం - A2:

వ్యాపారి తన వ్యాపారం ఆరంభించింది మొదలుకొని ప్రతి నెలా ఎ-2 ఫారమ్స్‌ను వ్రాసి సంబంధిత ఎస్.టి. కార్యాలయమునందు క్రితం నెల అమ్మకాలపై ఏమైనా టాక్స్ చెల్లించవలసి ఉన్నయెడల అట్టి టాక్స్ బ్యాంక్ డ్రాఫ్టు ద్వారాగాని, నగదుగా గాని చెల్లించేటట్లయితే జరుగుచున్న నెలలో ప్రతినెల 20వ తేదీకి ముందుగాను. అదే Tax బ్యాంక్ చెక్కు ద్వారా చెల్లించుచున్నట్లయితే జరుగుచున్న నెలలో ప్రతి నెల 15వ తేదికి ముందుగాను దాఖలు చేయాలి. ఈ రిటిన్ ఫారాలను రెండు కాపీలు (1+1)గా దాఖలు చేయాలి. అమ్మకాలు లేకపోయినా రిటన్‌ఫారాలు సమర్పించాలి. ఒకవేళ అమ్మకాలపై టాక్స్‌లు చెల్లించనవసరం లేకపోతే అంటే సెకండ్ సేల్సు అయితే A2 ఫారంతో పాటు ఫారం -E అని కూడా పొందుపరచాలి. అందులో ఈ రాష్ట్రంలో మాత్రమే కొన్న బిల్లుల వివరాలు పేర్కొనాలి. కొనుగోలు వివరాలు పూర్తిగా రాయాలి. ఎవరి నుంచి కొనుగోలు చేశామో వారి పూర్తి చిరునామా, ఆర్.సి.నెంబరు, డేట్, సరుకు విలువ, సరుకుల వివరాలు, అన్ని వివరంగా రాయాలి. రిటన్ ఫారం (A2)లో అమ్మకాలకు చెందిన వివరాలు, ఫారం-Eలో కొనుగోలుకు సంబంధించిన వివరాలు పొందు పరచవలసి ఉంటుంది.

అదే విధంగా వ్యాపారికి సి.ఎస్.టి. కూడా ఉన్నట్లయితే ఇతర రాష్ట్రాలకు అమ్మిన అమ్మకాల వివరాలను "Form C.S.T. VI"లో పొందుపరచి A2 ఫారంతో పాటు సేల్సు టాక్స్ డిపార్టుమెంట్ వారికి ప్రతి నెలా 20వ తేదీలోగా దాఖలు చేయాలి. అమ్మకాలు ఏమీ లేనప్పటికీ ఈ C.S.T. ఫారం VI ను అమ్మకాలు నిల్ అని రాసి దాఖలు చేయాల్సిందే.

## ప్రశ్నాపత్రం నెం.1

1. ది.1-2-2001న మురారి అండ్ కో వారి వ్యాపార ట్రాన్‌శాక్షన్స్‌ను క్యాష్ బుక్‌లో వ్రాసి ఆవర్జాలో నమోదు చేయండి.

ఎ) రు.20లు వెచ్చించి కార్బన్ పేపర్సు కొన్నారు.

బి) నాగు అండ్ కంపెనీ వారి నుండి అరువు బిల్లు నెం.14 దాఖలా రు.5000లు సరుకులు కొనుగోలు చేయడం జరిగింది.

సి) కేశవ్ ఇండస్ట్రీస్ వారి వద్ద నుండి రు.1400లు బ్యాంకు చెక్ నెం.321487 ద్వారా వసూలు అయినది.

డి) స్కూటర్ పెట్రోలు నిమిత్తం రు.90లు చెల్లించారు.

2. ఫాతిమా ఇండస్ట్రీస్‌లో 1-2-2001న జరిగిన ట్రాన్‌శాక్షన్స్‌ని క్యాష్ బుక్ ఆవర్జాలలో రాసి బ్యాలెన్సులు తేల్చండి.

ఎ) నీలిమా దేవికి జీతంలో అడ్వాన్సుగా రు.250లు చెల్లించారు.

బి) కుర్చీలు, కరెంటు రిపేర్సు నిమిత్తం రు.100లు ఖర్చు చేశారు.

సి) సినిమా స్లైడ్సు నిమిత్తం అలంకార్ థియేటర్ వారికి రు.500లు ముందుగా అడ్వాన్సు చెల్లించడం జరిగింది.

డి) నీలిమా దేవికి చెల్లించవలసిన నెల జీతం రు.1200లు నుండి అడ్వాన్సుగా చెల్లించిన రు.250లు తగ్గించడం జరిగింది.

ఇ) అలంకార్ థియేటర్ వారు సినిమా స్లైడ్స్ వేసినందుకుగాను రు.3000లకు క్రెడిట్ బిల్లు పంపారు.

3. ఈ క్రింది రెండు ట్రాన్స్‌శాక్షన్స్‌కు సింగిల్ కాలం క్యాష్ బుక్ మరియు డబుల్ కాలం క్యాష్ బుక్‌లకు సంబంధించి ఎంట్రీస్‌ని పాస్‌చేసి ఆవర్జాలో చూపండి.

ఎ) సేల్సు టాక్స్ రు.6000లు చెల్లించవలసియున్నప్పటికి చెల్లించడం జరగలేదు.

బి) రు.45000లు మిషనరీపై 25% చొప్పున అరుగుదల చూపాలి.

4. ది. 1-2-2001వ తేదీన భజన్‌లాల్ ఏజెన్సీస్ వారి వద్ద నుండి అరువు బిల్లు నెం.702 ద్వారా కొన్న రు.7150ల సరుకు 5-2-2001న చేరింది. దీనిని కొనుగోలు రిజిష్టరులోనూ, ఆవర్జాలోనూ చూపండి.

5. ఎలక్ట్రికల్ ఫ్యాన్స్ 1-2-2001కి స్టాకు రిజిష్టరు ప్రకారం 10 ఉన్నాయి. ది.2-2-2001న 6 ఫ్యాన్స్ కొనడం జరిగి అదే రోజు మూడింటిని, మరల 5వ తేదీన రెండింటిని అమ్మగా 6వ తేదీకి స్టాక్ రిజిష్టరు ద్వారా బ్యాలెన్స్ చూపండి.

6. మైసూర్ సాండల్ వారికి చెల్లించవలసిన రు.1,00,000ను ది. 3-2-2001న చెక్ నెం.176243 ద్వారా రు. 1,00,100ను డ్రా చేసి డి.డి.నెం.164742 ద్వారా చెల్లించడం జరిగింది. డబుల్ కాలం క్యాష్ బుక్‌లో రాసి ఆవర్జాలో నమోదు చేయండి.



# EXPORT SALES

ఈ ఎక్స్‌పోర్టు సేల్సు రెండురకములు. అందు మొదటిది అసలు పార్టీయే డైరెక్ట్‌గా సరుకులను ఇతర దేశములకు అమ్మకము చేసేటి విధానము. యిట్టి అమ్మకములు చేయునప్పుడు సేల్‌బిల్‌తోపాటుగా Bill of loading ద్వారా ఇతర దేశములకు సరుకులు పంపడం జరుగును. ఇట్టి అమ్మకములపై సేల్సుటాక్స్ ఏమియును లేదు. ఈ రకపు అమ్మకములు CST Act లోని Section 5 (1) క్రిందికు వర్తింపబడతాయి.

రెండవది ఎక్స్‌పోర్టర్ ద్వారా అమ్మకము చేసుకొనే సౌకర్యం (3rd Party.) దీనివలన ఎక్స్‌పోర్టు సేల్సుకు ముందు ఉన్న కొనుగోలులకుగాని, అమ్మకములకు గాని కూడా టాక్స్ మినహాయింపు వర్తించును. ఉదాహరణకు (1) ఈ రాష్ట్రములోని వర్తకుడు గ్రౌండ్‌నట్ సీడ్సును రైతులవద్ద కొనుగోలు చేసి ఎక్స్‌పోర్టర్ ద్వారా (3rd Party) ఇతర దేశములకు అమ్మకము చేసినట్లయితే ఈ కొనుగోలులపై (Last Purchase) కూడా సేల్సుటాక్స్ మినహాయింపు వర్తిస్తుంది.

(2) ఎలక్ట్రానిక్ వస్తువులకు సంబంధించినవి అనుకొందాం. ఈ సరుకులను మలేషియా ఎక్స్‌పోర్ట్ చేయుటకొరకు మద్రాసులో కొనుగోలు చేసి బొంబేలో ఉన్న ఎక్స్‌పోర్టర్ ద్వారా (3rd Party) ఎగుమతి చేసినట్లయితే Inter-state (ఎక్స్‌పోర్టర్ ఉన్నది యితర రాష్ట్రమైన బొంబేగా వున్న) Sales కు కూడా టాక్స్ మినహాయింపు వర్తిస్తుంది. అసలు ఎక్స్‌పోర్టర్ అయిన బొంబేవారు 'H' ఫారంను, Bill of lading ను మనకు యివ్వడం జరుగుతుంది. (ఈ రాష్ట్రము నుండి అసలు సరుకులు పంపేవారికి)

# TRANSIT SALES

Lorry Freight Charges, Loading & Unloading Expenses లాంటివి తగ్గించుకొని వ్యాపార లావాదేవీలు గావించుకొనుటకు ఈ రకపు Sales in Transit బహు ఉపయోగకారి. ఉదాహరణకు ఒక Transaction ను పరిశీలిద్దాం. విజయవాడలో ఉండే 'X' అనే వ్యాపారస్తుడు Eluru లో ఉండే 'Y' అనే వ్యాపారస్తునికి సరుకు Supply చేయాల్సి వచ్చింది అనుకొందాం. ఈ Supply చేయాల్సిన సరుకు ప్రస్తుతం తనవద్ద లేక అట్టి సరుకును Bombay లో ఉన్న 'Z' అనే వ్యాపారస్తుని వద్ద నుండి కొనుగోలు చేసి Supply చేసేటి పరిస్థితులు వస్తే అట్టి సందర్భములలో ఈ విధముగ ఆచరించిన సరిపడును. Vijayawada లో ఉన్న 'X' అనే వ్యాపారి Bombay లో ఉన్న 'Z' అనే వ్యాపారస్తుని నుండి సరుకుకు Purchase Order ని Place చేసి తను Supply చేయడానికి Book చేసుకొన్న Eluru లో ఉన్న 'Y' అనే వ్యాపారస్తుని పేరుతో Delivery at Eluru అని ఉదహరించాలి. అప్పుడు Bombay వారు సరుకును Eluru కు Delivery ఇస్తూ Bill ను మాత్రం Vijayawada కు పంపడం జరుగుతుంది. ఆ Bill పై Transit Sales booked by 'X' Vijayawad, Delivery at 'Y' Eluru అని పేర్కొనబడుతుంది. ఇట్టి సందర్భములో Vijyawada వారు Transit Purchase, Transit Sales అనే Heads గా వ్రాసుకోవాలి. Eluru వార్కి (Y) Vijayawad Party (X) యిప్పుడు Bill raise చేస్తుంది. యిట్టి సరుకులు ఎంత విలువైనా కొని ఎంత విలువకైనా అమ్మ వచ్చును. 'Y' అనేవారు ఆ Bill Value కి 'C' From ను 'X' అనే వారికి యివ్వాలి. 'X' అనే వారు వారి 'C' From ను 'Z' అనే వారికి

పంపితే 'Z' అనేవారు 'X' అనేవారికి Form $E_1$ ను పంపడం జరుగుతుంది. 'A' అనేవారు వారి Assessment time లో 'Y' నుంచి వచ్చిన 'C' Form ను 'Z' నుండి వచ్చిన $E_1$ ఫారంను డిపార్ట్‌మెంట్ వారికి Submit చేయవలసి ఉంటుంది. యిట్టి Transaction పై 'X' అనేవారు Commercial Tax Department వారికి Taxes ఏమియు చెల్లించనవసరము లేదు.

అటులనే A.P. లో Head Office ఉండి వేరే State లో Branch Office ఉండి Head Office లో ఉన్న Stock నుండి కొంత సరుకులు Branch Office కు పంపవలసిన పరిస్థితులు ఉంటే యిట్టి వాటిని Stcok Transfer అనే Head of A/c క్రింద వ్రాసుకొని 'F' ఫారంను పంపిన యెడల కూడా యిట్టి Stock Transaction పై Tax చెల్లించనవసరము ఉండదు.

వ్యాపార సంబంధమైన Accounts Financial Year ending కి ఆ సంవత్సరమంతయు వ్రాసిన Accounts Books ద్వారా Trial Balance వేసి దాని ద్వారా Trading A/c, Profit & Loss A/c, Balance Sheet తయారు చేయడం జరుగుతుంది. ఈ Statements అన్నియు చేయడం ద్వారా ఆ Financial Year లో వ్యాపార సంస్థ ఆర్జించిన లాభనష్టములు, ఆస్థి, అప్పుల స్థితిని తెల్సుకోగల్గుచున్నాము. ఈ విధముగా Finalise చేయబడిన Account Books నుండి (Ledger) వారు మరుసటి సంవత్సరమునకు ఖాతాలవారీ Balances (Cr. or Dr) ఉండే Transactions ని మాత్రమే Carry forward చేసుకోవలసియున్నది. ఉదాహరణకు Capital A/c, Assets, రావలసిన బాకీలు, యివ్వవలసిన బాకీలు, నగదు, బ్యాంక్ వంటివి. మిగిలినవి ఏమియును (Ex-

penses) ఉదా॥ Rent, Salaries, Postage, Travelling etc; కాక Sales, Purchases కూడా, ఎందులకనగా యిట్టివన్నియు Trading మరియు P & L A/c లకు మళ్ళించి లాభనష్టములు తేల్చుట జరిగినదిగావున అనే విషయం గమనించాలి. ఆస్తులు, అప్పులు మాత్రమే తీసుకోవడం జరుగుతుంది. అదియును ఏ ఖాతకు ఆ ఖాతాల వారీగా జమలో ఉంటే జమగాను, ఖర్చులో ఉంటే ఖర్చుగాను, Carry Forward చేసుకోవాలి. అయితే యిందు ముఖ్యముగా '2' Transaction ని మాత్రం పరిశీలించవలసి యున్నది. 1) ఆ సంవత్సరం Balance Sheet లో చూపిన Closing Stock తదుపరి సంవత్సరం Books లో (Ledger) opening stock గా (పాత సంవత్సరంలో Credit Coloumn లో ఉన్నప్పటికిని) Debit Coloumn లో చూపాలి. 2) Assets వైపు ఉన్న Cash on hand next year cash Book లో జమ (Credit) కాలంలో చూపాలి. మిగిలినవన్నియూ మామూలే.

# MONTHLY $A_2$ RETURN FORM FILL చేయువిధానం - $A_2$ FORM నమూనా

Form a2 was subs by G.O.Ms.No.688 Rev. dt.11-101988 and the Statements I & II were substituted by G.O.Ms.No.788 dt. 21-9-1996

## FORM - A2

RETURN OF MONTHLY TURNOVER

(see Rules 7 and 17)

To

The Deputy / Commercial Tax Officer

..................................................

I,......................................................................................................................

Son/Daughter/wife of.........................................................on behalf of the dealer carrying business known as .................................................... (Dealer Name/Firm Name) furnish herewith the statement of the total and net turnover for the said business during the month of .................2000 and ending on.................. and give the following connected particulars.

1. Registration Certificate Number APGST [ ]

   CST [ ]

2. Address of Principal Place of business

3. Particulars of payment

   (a) Total tax payable [ ]

   (b) Deduct

   (i) Adjustment of refund tax [ ]

   C.Notice No. [ ] Date: [ ]

   (ii) Amount of rebate of tax as per Form 1/as enclosed to this form [ ]

   (c) Net tax payable (a) - (b) [ ]

   (d) Total tax paid

   (i) Cheque/DD/Particulars

   Number [ ] Date [ ]

   Bank [ ] Branch [ ]

   (ii) Cash (Receipt No.) if paid

   Receipt No. [ ] Date [ ]

   (iii) Challan particulars

   Number [ ] Date [ ]

   Name of Treasury [ ]

   (e) Blance payable if any (c) - (d) [ ]

వ్యాపారసంస్థ ఏ నెలకానెల అమ్మిన అమ్మకములు ఖాతాల వారీగా Commodity Vide $A_2$ ఫారంలో చూపి అట్టి అమ్మకములపై చెల్లించవలసిన Tax ను నగదుగా గాని, Bank Cheque, Demand Draft లేదా Treasury చెలానా ద్వారా గాని చెల్లించి, చెలానాను return form కు జతపర్చి సంబంధిత కమర్షియల్ టాక్స్ కార్యాలయమునందు దాఖలు చేస్తూ, Local Tapal Book నందు (Acknowledgement) సంబంధిత కార్యాలయము వారి ముద్ర (Seal) వేయించుకోవలసి యున్నది. అట్లు Local Tapal Book లో entry చేయించుకొనని పక్షమున కొన్ని సందర్భములలో ఏ నెల కానెల $A_2$ ఫారంలను దాఖలు చేసినప్పటికి Department వారి రికార్డులందు వ్యాపారస్తుడు File చేసిన Return ఫారం ఏదైనా కనిపించని పక్షమున ఫలానా Return form ను మీరు file చేసి, యుండలేదు కావున (Intime లో) యిప్పుడు return form file చేసి యిప్పటి వరకు అయిన deley కి Penalty కూడా చెల్లించమని Notice జారీ చేయవచ్చును. అట్టి సందర్భములలో ఈ Local Tapal Book లో (Atual గా Return Form ను intime లో File చేసినట్లుగా ఉన్న Acknowledg-ment) Note చేయించుకొన్నదానిని సంబంధిత Department వారికి చూపిన యెడల $A_2$ ఫారంను వ్యాపారస్తుడు నిర్ణీత కాలములోనే కార్యాలయములో దాఖలు చేసినట్లు, Department వారి రికార్డులో ఆ నెల Form కనిపించక పోవటం dealer పొరపాటు గాదు అని Department వారు భావించి Penalty లేకుండా సంబంధిత నెల $A_2$ ఫారం యొక్క Copy ని మాత్రం డిపార్ట్మెంట్ వారు వారి రికార్డు కొరకు తీసుకోవడం జరుగుతుంది.

Examples:

ఇప్పుడు Kiran Enterprises అనే పేరుతో A. Kiran Kumar అనే వ్యక్తి Electronic Computers వ్యాపారం నిర్వహిస్తూ 2000 సం॥ April నెలలో అతని వ్యాపారపు అమ్మకములు 1st Sales 1,35,000, 2nd sales 55,000 లు జరిగినాయి. వాటిని ఈ క్రింది విధముగా $A_2$ Form లో పొందుపరచాము.

ఈ Kiran Enterprises వారు ఈ రాష్ట్రంలో ఆ నెలలో 1) Rahim Enterprises, Hyd., వారి నుండి B.No.1765 రు దాఖలా ది. 5-4-2000న Rs. 15,000, 2) Yakub Agency, Hyd., వారి నుంచి B.No.116 దాఖలా ది. 12-4-2000న 10,000. Neelam Industries, Hyd., వారి నుంచి B.No. 55 దాఖలా ది. 18-4-2000 న 20,000 కొనుగోలు చేసారనుకొందాం. వాటిని ఈ క్రింది విధంగా Form - E లో పొందుపర్చాలి.

Form A2 was subs by G.O.Ms.No.688 Rev. dt.11-101988 and the Statements I & II were substituted by G.O.Ms.No.788 dt. 21-9-1996

# FORM - A2

RETURN OF MONTHLY TURNOVER April, 2000
(see Rules 7 and 17)

To
The Deputy / Commercial Tax Officer
Governorpet, VZA

I, A. Kiran Kumar
Son/Daughter/wife of Ramaiah on behalf of the dealer carrying business known as Kiran Enterprises (Dealer Name/Firm Name) furnish herewith the statement of the total and net turnover for the said business during the month of ...April...2000 and ending on................ and give the following connected particulars.

1. Registrationg Certificate Number APGST: VJ11/05/2/1641
   CST: VJ11/05/2/1345
2. Address of Principal Place of business

   Kiran Enterprises
   Opp. Andhra Bank, Governorpet,
   VIJAYAWADA-2

3. Particulars of payment

| | | | | |
|---|---|---|---|---|
| (a) | Total tax payable | 5,400/- | | |
| (b) | Deduct | | | |
| (i) | Adjustment of refund tax | / | | |
| | C.Notice No. | / | Date: | / |
| (ii) | Amount of rebate of tax as per Form 1/as elosed to this form | | | / |
| (c) | Net tax payable (a) - (b) | 5,400/- | | |
| (d) | Total tax paid | | | |
| (i) | Cheque/DD/Particulars | | | |
| | Number | 163274 | Date | 20.5.2000 |
| | Bank | S.B.I. | Branch | Governorpet Vza-2 |
| (ii) | Cash (Receipt No.) if paid | | | |
| | Receipt No. | / | Date | / |
| (iii) | Challan particulars | | | |
| | Number | / | Date | / |
| | Name of Treasury | 5400/- | | |
| (e) | Balance payable if any (c)-(d) | - Nil - | | |

పరిశీలించారు గదా చెల్లించే Tax, Cheque / D.D. అయితే ఆ సంబంధిత Coloumn లోను, Challan అయిన ఆ Coloumn లోను చూపవలసి ఉంది. వెనుకవైపు అమ్మకములు, Commodity, Rate of Tax వివరములు చూసారుగా అట్లాగే ఏ వ్యాపారమునకు సంబంధించిన Commodity అయితే అది వ్రాసి సంబంధిత Rate of tax ప్రకారం చూపి చెల్లించవలెను. గమనించాల్సిన విషయము 1st sales అంటే Taxable Sales. వాటిపై చెల్లించవలసిన టాక్సు చెల్లిస్తున్నాము. 2nd sales అంటే non taxable sales (with in the state లో కొన్ని సరుకుల సంబంధించిన అమ్మకములన్న మాట) యిట్టి అమ్మకములు యింతకుముందే (యితనికి అమ్మిన వ్యాపారసంస్థ) ఈ State లో ఒకసారి Tax చెల్లించడం జరిగింది. యిట్టి అమ్మకములపై మరల Tax చెల్లించనవసరం లేదు గావున వీటిని Exempted Sales అంటారు. యిట్టి అమ్మకములకి సంబంధించిన కొనుగోలులను ఏ నెలకానెల Form E; Return ద్వారా దాఖలు చేయవలసి ఉన్నది. (ఈ రాష్ట్రంలోని Regd. Dealers ద్వారానే కొనుగోలు చేసాము, యిట్టి కొనుగోలులపై ఒకసారి Tax చెల్లించడం జరిగింది. అని రూఢిపర్చడం.)

# Form - E నమూనా

## Form - E

## RETURN OF EXEMPTIONS CLAIMED

(See Rule 19-A)

To

The Assistant/Deputy Commmercial Tax Officer

..........................................................(Place)

I..........................................................................................

son of...........................................................................................on behalf of the Dealer carying Business known as..................................................... Furnish here with the Statements showing the details of the transactions for the said business..............................................................................which are not liable to tax & give following connected purticulars.

| | |
|---|---|
| 1. Name of the Manager of the Business | |
| 2. Status or Relation of the Person who signs the return (Manager, Partner, Proprietor etc.) | |
| 3. Name of the principal place of Business and address. | |
| 4. Name (s) other places of Business and the address of every such place. | |

STATEMENT..1 : Showing the details of goods liable to tax at the point of the First Sale/First Purchase in state in respect of which exemption is claimed on the ground that the Dealer is not the First Seller or First purchaser as the case may be.

| Sl. No. | Description of the goods | Particulars of the dealer from whom he purchased | | Quantity | Value of the Goods Purchased | Invoice No. & Date | Remarks |
|---|---|---|---|---|---|---|---|
| | | Name and Full Address including Dr.No. and locality | Registration No. with code letters | | | | |
| 1 | 2 | 3 A | 3 B | 4 | 5 | 6 | 7 |

STATEMENT.II : Showing the details of goods sold or purchased through Commission Agents and Exemption is claimed on the ground that the said agent paid tax.

| Sl. No. | Description of the goods | Particulars of the Agent who paid tax on the goods | | Quantity | Value of the Goods | Invoice No. & Date | Remarks |
|---|---|---|---|---|---|---|---|
| | | Name and Full Address including Dr.No. and locality | Registration No. with code letters | | | | |
| 1 | 2 | 3 A | 3 B | 4 | 5 | 6 | 7 |

STATEMENT.III : Showing the details of goods liable to tax at the point of last purchase or Last Sale in respect of which exemption is claimed on the ground that the dealer is not the last purchaser or last sellar in the state.

| Sl. No. | Description of the goods | Particulars of the dealer whom the goods are sold | | Quantity | Value of the Goods Purchased | Invoice No. & Date | Remarks |
|---|---|---|---|---|---|---|---|
| | | Name and Full Address including Dr.No. and locality | Registration No. with code letters | | | | |
| 1 | 2 | 3 A | 3 B | 4 | 5 | 6 | 7 |

STATEMENT.IV :-Showing the details of Exemptions Claimed for reasons for other than those mentioned in statement - I to III

| Sl. No. | Turnover in respect of which exmption claimed | Section or Rule Under Which Exemption is Claimed | Nomber of Exmptions claimed | Remarks |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 |

# పూర్తిగావించబడిన Form - E

## FORM-E
## Return of exemption Claimed
## (Sales Rule 19-A)

To
The Deputy/Commercial Tax Officer
Governorpet, VZA

I A. Kiran Kumar

Son/Daughter of Ramaiah

on behalf of the dealer carrying on business known as Kiran Enterprises

furnish herewith the statement showing the details of the transactions for the said business during the month of April, 2000 which are not liable to tax give the following connected particulars.

1. Name and address of the Manager of the business

A.Kirna Kumar

2. Status or relationship of the person who signs this return (Manager/Partner/Proprietor etc) Proprietor

3. Name and address of the principal place of business with particulars of registration.

Name

Registration Certificate No: APGST VJ11/05/2/1641 CST VJ11/05/2/1345

Address
Kiran Enterprises
Opp. Andhra Bank, Governorpet.
VIJAYAWADA-2

4. Name(s) of other places business and the address of every such place
(if space prov ded for is not submitec information shall be furn sehd in a separate sheet and enclosed to this return)

------ Nil ---------

## STATEMENT - I

(Not being first sale/1st purchase)

| Sl. No. | Commodity | | Details of Dealer from whom purchased | | | Invoice/DC Details | | | | Way Bill/ Details | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | Name | Code | Name | Address | R.C.No. | Number | Date | Quantity. | Value | No. | Date |
| | | | | Nil | | | | | | | |
| Total for the month | | | | | | | | | | | |

## STATEMENT - II

Form-E

(Being Agency Transactions)

| S. No. | Commodity | | Details of Agent from whom paid tax | | | sale patti / tax patti / invoice details | | | | Way Bill/ Details | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | Name | Code | Name | Address | R.C.No. | Number | Date | Quantity. | Value | No. | Date |
| | Electronics | | M/s. Rahim Enterprises, | Hyderabad | Hyr / C2 / 1/ 1672 | | | | 15000 | 1765 | 5-4-2000 |
| | " | | Yakub Agencies, | Hyderabad | Hyr / 05 / 2 / 1451 | | | | 10000 | 116 | 12-4-2000 |
| | " | | Neelam Industries, | Hyderabad | Hyr / C3/1/2150 | | | | 20000 | 55 | 18-4-2000 |
| | | | | | | | | | 45000 | | |
| Total for the month | | | | | | | | | | | |

Where the consignment was moved in a goods vehicle

## STATEMENT - III

(Not being Last Purchase / Last Sale)

| Sl. No. | Commodity | | Details of Dealer to whom sold | | | Invoice/DC Details | | | | Way Bill/ Details | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | Name | Code | Name | Address | R.C.No. | Number | Date | Quantity. | Value | No. | Date |
| | | | ---Nil--- | | | | | | | | |
| Total for the month | | | | | | | | | | | |

Where the consignment was moved in a goods vehicle

## STATEMENT - IV

| S. No. | Commodity | | Turnover in respect of which exemption is claimed | Section/Rules under which claimed | Invoice/DC Details | | | | Way Bill/ Details | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | Name | Code | | | Number | Date | Quantity. | Value | No. | Date |
| | | | ---Nil--- | | | | | | | |
| Total for the month | | | | | | | | | | |

*If applicable

For Kiran Enterprises

Proprietor

Note: (i) Form E was substitued by G.O.Ms.No.1445, Rev., dt.5.11.1986
(ii) By G.O.Ms.No.788 Rev.dt.21-9-1996 Statements 1, II, III and IV were subs,

ఆ నెలలో ఉన్న 2nd Purchases నన్నింటిని Dealer Vise విడివిడిగా నమోదు చేయాలి. ఒకవేళ ఆనెలలో జరిగిన Purchases అన్ని Return Form లో ఇచ్చిన Space లో సరిపడని యెడల విడి Paper పై ఈ Form - E కు Attach చేయ్యాలి. అట్లాగే

2000, ఏప్రిల్ నెలలో 1st Sales, 2nd sales కాక యితర రాష్ట్రములకు అమ్మిన అమ్మకములు కూడా రూ.50,000/- ఉన్నాయి. అనుకొందాం. ఈ C.S.T. అమ్మకములనుకూడా $A_2$ Return Form లో Interestate Sales అని వ్రాసి G.T.O. Rs.50,000/-, ETO. 50,000/- NTO.-Nil అని చూపాలి. యిప్పుడు Total GTO. 2,40,000/-, ETO 1,05,000/-, NTO 1,35,000/- లుగా ఉంటాయి.

వ్యాపారస్తుడు CST Licence తీసుకొని యుండి సంబంధిత నెలలో CST అమ్మకములు చేయకుండినప్పటికిని ప్రతినెలా $A_2$ Return తో పాటుగా CST-VI Monthly Return form ను కూడా Nil గా వ్రాసి దాఖలు చేయాలి.

# Form C.S.T. VI నమూనా

FORM OF RETURN UNDER RULE 15 OF THE CENTRAL SALES TAX (ANDHRA PRADESH) RULES, 1957

Return for the period from.................................to ...............................

Registration No. ________________ Name of the Dealer ________________

Status (Where individual, Hindu Undivded Family, Association, Club, Company, Firm, Guardian or Trustee)

Style of business

1. Gross amount received or receivable by the dealer during the period in respect of sale of goods.

Deduct:

(i) Sales of goods outside the State through Commission Agents Rs.

(ii) Sales of goods outside the state otherwise than through Commission Agents Rs.

(iii) Sales of goods in the course of export outside India (as defined in Section 5 of the Act) Rs.

(iv) Total Value of the goods transferred to other States otherwise than as a result of sale Rs.

Rs.

2. Balance: Turnover on Inter-State sales and sales within the State Rs.

Deduct - Turnover on sales within the State Rs.

3. Balance: Turnover on Inter - State Sales

Deduct - Turnover on Inter-State sales exempt under section 6 being second or subsequent sales (Vide certicicates in Form E-I or E-II attached) Rs.

4. Balance: Turnover on Inter-State sales liable to tax Rs.

Deduct - Cost of freight, delivery or installation when such cost is separately charged

5. Balance: Total turnover in Inter-States Sales Rs.

6. Goods - - wise break-up of above.

| Nature of Goods | Commodity Code No. | Rate of Tax | Sales relating to Registered Dealers on prescribed declaration Form-C | Sales to Government not being a registered Dealer on prescribed certificate in Form-D | Other Sales | Total Sales | Tax Due |
|---|---|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) |
| | | | | | | | |

7. (i) Taxable at [ ] Percent Rs. [ ] on which tax amounts to Rs. [ ]

(ii) Taxable at [ ] Percent Rs. [ ] on which tax amounts to Rs. [ ]

(iii) Taxable at [ ] Percent Rs. [ ] on which tax amounts to Rs. [ ]

(IV) Taxable at [ ] Percent Rs. [ ] on which tax amounts to Rs. [ ]

(V) Taxable at [ ] Percent Rs. [ ] on which tax amounts to Rs. [ ]

(VI) Taxable at [ ] Percent Rs. [ ] on which tax amounts to Rs. [ ]

8. Total Tax payable on Rs. [ ] amount Rs. [ ]

9. Tax Paid if any by means of Treasury

Challana/Crossed Cheqe No./ Mo.No. [ ] Dated [ ]

10. Balance due/excess paid, if any [ ]

1. I enclose with this return the original copy of each of the declarations and certificates received by me in respect of sales made to registered dealers and to Government not being a registered dealer together with a signed list of such declarations and certificates. I shall submit the declarations and certificates still due before the time prescribed therefor.

2. I d declare that to the best of my knowledge and belief the information furnished in the above statement is true and complete.

Place: signature

Date status

# Form C.S.T. VI నమూనా

FORM OF RETURN UNDER RULE 15 OF THE CENTRAL SALES TAX (ANDHRA PRADESH) RULES, 1957

Return for the period from.................................to ...............................

Registration No. ______________ Name of the Dealer ______________

Status (Where individual, Hincu Undivded Family, Association, Club, Company, Firm, Guardian or Trustee)

Style of business

1. Gross amount received or receivable by the dealer during the period in respect of sale of goods.

Deduct:

(i) Sales of goods outside the State through Commission Agents Rs.

(ii) Sales of goods outside the state otherwise than through Commission Agents Rs.

(iii) Sales of goods in the course of export outside India (as defined in Section 5 of the Act) Rs.

(iv) Total Value of the goods transferred to other States otherwise than as a result of sale Rs.

Rs.

2. Balance: Turnover on Inter-State sales and sales within the State Rs.

Deduct - Turnover on sales within the State Rs.

3. Balance: Turnover on Inter - State Sales

Deduct - Turnover on Inter-State sales exempt under section 6 being second or subsequent sales (Vide certicicates in Form E-I or E-II attached) Rs.

4. Balance: Turnover on Inter-State sales liable to tax Rs.

Deduct - Cost of freight, delivery or installation when such cost is separately charged

5. Balance: Total turnover in Inter-States Sales Rs.

6. Goods - - wise break-up of above.

| Nature of Goods | Commodity Code No. | Rate of Tax | Sales relating to Registered Dealers on prescribed declaration Form-C | Sales to Government not being a registered Dealer on prescribed certificate in Form-D | Other Sales | Total Sales | Tax Due |
|---|---|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) |
| | | | | | | | |

7. (i) Taxable at [ ] Percent Rs. [ ] on which tax amounts to Rs. [ ]

(ii) Taxable at [ ] Percent Rs. [ ] on which tax amounts to Rs. [ ]

(iii) Taxable at [ ] Percent Rs. [ ] on which tax amounts to Rs. [ ]

(IV) Taxable at [ ] Percent Rs. [ ] on which tax amounts to Rs. [ ]

(V) Taxable at [ ] Percent Rs. [ ] on which tax amounts to Rs. [ ]

(VI) Taxable at [ ] Percent Rs. [ ] on which tax amounts to Rs. [ ]

8. Total Tax payable on Rs. [ ] amount Rs. [ ]

9. Tax Paid if any by means of Treasury

Challana/Crossed Cheqe No./ Mo.No. [ ] Dated [ ]

10. Balance due/excess paid, if any [ ]

1. I enclose with this return the original copy of each of the declarations and certificates received by me in respect of sales made to registered dealers and to Government not being a registered dealer together with a signed list of such declarations and certificates. I shall submit the declarations and certificates still due before the time prescribed therefor.

2. I d declare that to the best of my knowledge and belief the information furnished in the above statement is true and complete.

Place: signature

Date status

ACKNOWLEDGEMENT

Received From ______________________

a Dealer possessing

Registration Certificate No. ______________________

a Return of Sales Tax in Form CST (vi) Payable by him for the period.

From ______________ To ______________

with enclosures mentioned therein.

Place                                        Receiving Officer

---

The above form was inserted by G.O.Ms.No.1805, Revenue(s) Dated 30-9-1968 and later it was amended by the following G.O.'S.

1. G.O.Ms.No.651, Revenue(s) Dated 10-7-1974
2. G.O.Ms.No.1173, Revenue(s) Dated 5-11-1976

పూర్తిగావించబడిన Form CST - VI

# FORM OF RETURN UNDER RULE 15 OF THE CENTRAL SALES TAX (ANDHRA PRADESH) RULES, 1957

Return for the period From 1-4-2000 To 30-4-2000

Registration No. U511/05/2/1345 Name of the Dealer Kiran Enterprises

Status (Whether Individual, Hindu Undivided Family, Asscociation, Club, Company, Firm, Guardian or Trustee)

Individual

Styles of Business

1. Gross amount received or receivable by the dealer during the period in respect of sale of goods 2,40,000

Deduct - -

(i) Sales of goods outside the state through commission agents Rs. ---

(ii) Sales of goods outside the State otherwise than through Commission Agents Rs. ---

(iii) Sales of goods in the course of export outside India (as defined in Section 5 of the Act) Rs. ---

(iv) Total Value of the goods transterred to other States otherwise than as a result of sale Rs. ---

2. Balance: Turnover on Inter-State Sales within the state Rs. 2,40,000

Deduct- Trunover on sales with in the state Rs. 1,90,000

3. Balance: Turnover on Inter - State Sales Rs. 50,000

Deduct - Turnover on Inter State sales exempt under section-6 being 2nd or Subsequent sales (vide certificates in Form-E-1 or E-2 attach) Rs. - - -

4. Balance: Turnover on Inter - State Sales liable to tax Rs. 50,000

Deduct - Cost of freight delivery or installation when such cost is separtly charged Rs. - - -

5. Balance Total Turnover in Inter - Sate Sales Rs. 50,000

6. Goods - Wise Break-up of above

| Nature of Goods | Commodity Code No. | Rate of Tax | Sales relating to Registered Dealers on prescribed declaration Form-C | Sales to Government not being a registered Dealer on prescribed certificate in Form-D | Other Sales | Total Sales | Tax Due |
|---|---|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) |
| Electrionics | | 4% | 50,000 | Nil | - | 50000 | 2000 |

7. (i) Taxable at [4%] Percent Rs. [50,000] on which tax amounts to Rs. [2000/-]

(ii) Taxable at [ ] Percent Rs. [ ] on which tax amounts to Rs. [ ]

(iii) Taxable at [ ] Percent Rs. [ ] on which tax amounts to Rs. [ ]

(IV) Taxable at [ ] Percent Rs. [ ] on which tax amounts to Rs. [ ]

(V) Taxable at [ ] Percent Rs. [ ] on which tax amounts to Rs. [ ]

(VI) Taxable at [ ] Percent Rs. [ ] on which tax amounts to Rs. [ ]

8. Total Tax payable on Rs. [50,000] amount to Rs. [2000/-]

9. Tax Paid if any by means of Treasury

Challan/Crossed Cheque No./ Mo.No. [168432] Dated [20.5.2000]

10. Balance due/excess paid, if any [- - Nil - -]

1. I enclose with this return the original copy of each of the declarations and certificates received by me in respect of sales made to registered dealers and to Government not being a registered dealer together with a signed list of such declarations and certificates. I shall submit the declarations and certificates still due before the time prescribed therefor.

2. I declare that to the best of my knowledge and belief the information furnished in the above statement is true and complete.

Place: VZA signature For KIRAN ENTERPRISES

Date 20.5.000 status PROPRIETOR

## ACKNOWLEDGEMENT

Received From ____________________

a Dealer possessing

Registration Certificate No. ____________________

a return of Sales Tax in Form CST (vi) Payable by him for the period.

From ____________________ To ____________________

with enclosures mentioned therein.

Place Receiving Officer

The above form was inserted by G.O.Ms.No.1805, Revenue(s) Dated 30-9-1968 and later it was amended by the following G.O.'S.

1. G.O.Ms.No.651, Revenue(s) Dated 10-7-1974
2. G.O.Ms.No.1173, Revenue(s) Dated 5-11-1976

# SALES RETURNS

వ్యాపారస్తుడు అమ్మిన అమ్మకములకు సంబంధించి కొన్ని కొన్ని సందర్భములలో అమ్మిన అమ్మకములనుండి కొంత సరుకులుగాని లేదా అమ్మకము బిల్లు తాలూకు మొత్తం సరుకులుగాని వాపసులు రావడం జరుగుతూ ఉంటుంది. ఇట్టి వాపసులు ఆ నెలలో అమ్మకములకు సంబంధించిగాని, లేదే అంతకు ముందు అమ్మకములకు సంబంధించిన వయినా గాని అయి ఉండవచ్చు. ఈ వాపసులను అమ్మకముల వాపసు ఖాతాకు డెబిట్ వ్రాసుకుంటాము. అయితే యిట్టి వాపసులనుకూడా ప్రతినెలా పంపుతూ ఉండే $A_2$ return Form లో గూడా చూపవలసియున్నది.

ఉదా:- Umesh Enterprise వారి 2000 మే నెల 1st Sales of Medicines Rs.1,05,200/-., 2nd Sales of Medicines Rs. 95,500/-., అయి ఉండగా ఆ నెలలో 20-5-2000న 1st sales నుండి రూ.10,150/-లు రిటర్న్ రావడం జరిగింది. ఈ అమ్మకములను 2000 ఏప్రియల్ నెలలో ది.5-4-2000న మల్లికా ఏజన్సీ వారికి బి.నెం.132 దాఖలా రూ.25,000లు అమ్మకం చేయగా అందుండి వాపసు రావడం జరిగింది. అట్లాగే 2nd sales of medicinces నుండి రిటర్న్స్ రూ.5500/-లు బి.నెం.25 ది.20-4-2000న Veeresh Industries వారికి అమ్మిన అమ్మకముల నుంచి వాపసురావడం జరిగింది. యిట్టి వాటిని మే నెల ఎ2 ఫామ్‌లో ఈ క్రింది విధంగా చూపించవలెను.

## Second Page in $A_2$ return Form

| Commodity | GTO | ETO | NTO | % | Amount |
|---|---|---|---|---|---|
| 1st sales of Medicines | 1,05,200 | 10,150 | 95,050 | 10 | 9505 |
| 2nd sales of Medicines | 90,000 | 90,000 | Nil | Nil | Nil |
| | 1,95,200 | 1,00,150 | 95050 | | 9505 |

మే నెల 1st sales Rs. 1,05,200/- ల నుండి ఆ నెలలో వచ్చిన వాపసులు ETO లో రూ.10,150/-లు చూపగా NTO రు. 95,050/-లుగా తేల్చి దానిపై అయ్యే టాక్సులు చెల్లించాలి. అయితే 2nd sales మొత్తం కూడా Exempted కావున ఆ నెలలో వచ్చిన 2nd వాపసులను ఆ నెల సేల్స్ నుండి తీసివేసి GTO లో ETO లో అదే మొత్తమును చూపించి NTO లో మాత్రము Nil గా చూపాము. యిప్పుడు ఎ2 కు ఆ నెల 1st sales returns Rs.10,150/- వివరముల లిస్టును వేరుగా దాఖలు చేయాలి.

Return goods of first sales of medicines for the month of May 2000

| A/c Date | Bill No & Date | Name of the party | Amount |
|---|---|---|---|
| 20-5-2000 | 132/5.4.2000 | Mallik Agencies Eluru | 10150/- |
| | | Total | Rs.10150/- |

Note: ఆ నెలలో ఎన్ని వాపసులు అయితే రావటం జరుగుతాయో వాటన్నిటిని కూడా ఇదే విధముగా వివరముగా వ్రాసి టోటల్ చేసి ఆ మొత్తమును ఎ2 రిటన్‌లో ఇ.టి.ఒ. అనే కాలమ్‌లో చూపాలి.

ఈ విధముగా నెలవారి రిటన్స్‌లో చూపిన అమ్మకపు వాపసులపై మాత్రమే ఫైనల్ ఎసెస్‌మెంట్ టైమ్‌లో సేల్స్ టాక్స్ మినహాయింపు యివ్వడం జరుగుతుంది. ఈ విధముగా మినహాయింపు కోరే అమ్మకపు వాపసులు రిటర్న్ వచ్చే తేదీకి 6 నెలల ముందు మాత్రమే అమ్మకముచేసి ఉండి ఉండాలి. 6 నెలలు దాటితే వాటిని నెలవారి రిటర్న్‌లో పొందుపరచినప్పటికి వాటిపై టాక్స్ రాయితీ ఇవ్వబడదు.

## FORM - AA9

వ్యాపారస్తుని యొక్క సంవత్సరపు టర్నోవరు (సేల్స్) రూ.10,00,000లు గాని లేదా ఆ సంవత్సరపు అమ్మకములపై చెల్లించవలసిన టాక్స్ రు.12,000 వేల రూపాయల లోపు గాని ఉన్నయెడల వారు ప్రతి నెల ఎ2 రిటన్స్ దాఖలు చేయనవసరం లేకుండా సంవత్సరమున కంతటకును కలిపి ఒకేసారి AA9 ఫారంను దాఖలు చేసిన సరిపడును. ఇది జరిగిన సంవత్సరమునకు సంబంధించి జరుగుతున్న సంత్సరములో మే నెల చివరిలోగా సంబంధిత కమర్షియల్ టాక్స్ కార్యాలయము నందు దాఖలు చేయవలసియున్నది. అయితే ఈ విధానము వ్యాపారస్తులు లైసెన్సు తీసకున్న మొదటి సంవత్సరమునకు వర్తించబడదు. తదుపరి సంవత్సరము నుండి అమలులోనికి వచ్చును. (మొదటి సంవత్సరము ప్రతి నెల ఎ2 రిటన్స్ ద్వారా టర్నోవరు తెలియపరచినపుడు ఆ సంవత్సరాంతమునకు ఈ లిమిట్‌లో వ్యాపారమున్న యెడల 2వ సంవత్సరము నుండి అమలు లోనికి వచ్చును.

# AA9 నమూనా

PART-A

RETURN OF TURNOVER TO BE FILED BY DEALERS UNDER SECTION 14-E (SEE RULE 15-D(1)

To

The Assistant Deputy Commerical Tax Officer

.................................Circe.

I........................................... Son/Daughter / Wife of ..............................

on behalf circe dealer carrying business known as ..............................................

(dealer name firm name with R.C. No.) opt to be assessed under section 14-E and furnish herewith the statement of the total turnover and tax due thereon under the Act as assessed by me for the said business during the year commencing from ....................
................................................ and ending on ........................................ and given the following connected particulars.

1. Registration Certificate Number: APGST CST

2. Address of principal place of business ......................................................
..................................................................................................................

3. Particulars of Payment:

a) Total tax payable ..................................................................................

b) Total tax paid ......................................................................................

i) DD Particulars ..........................................................................

Number.................................................Date ......................

Bank...................................................Branch ....................

ii) Cash Receipt No. if paid........................Date ........................

Challan Particulars:

Number.................................................Date ........................

Name of Treasury ......................................................................

c Balance Payable if any:

a) b)

4. Tax Paid by the dealer for the previous year:

No. of Commodities for which particulars are given

| Sl. No. | Commodity Description | Code | Total Turnover | Exempted Turnover | Net Turnover | Rate of Tax | Tax Due to be paid |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| | | | | | | | |
| | | | | | | | |
| | | | | | | | |
| | | | | | | | |
| | | | | | | | |
| | | | | | | | |
| | | | | | | | |
| | | | | | | | |
| | | | | | | | |
| | | | | | | | |
| | | | | | | | |
| | | | | | | | |
| | | | | | | | |
| | | | | | | | |
| | | | | | | | |
| | | | | | | | |

## DECLARATION

I/We........................................................................ Son/Daughter/Wife of............................................ declare to the best of my/our knowledge and belief that the information furnished in the above statements true and complete.

Place:

Date :

Signature

Status & Relationship to the dealer

అరవింద్ ఆటోమొబైల్స్ వారి 99 - 2000 సంవత్సరమునకు 1st sales of Automobile spares రు.35,000/- 2nd sales of Automobile spares Rs.3,50,000/- గా ఉండి ఉన్నాయి అని అనుకుందాం. వాటిని ఈ పైవిధంగా ఎఎ9 అనే ఫారంలో చూపాలి. దీనితోపాటుగా ఫారం 'ఇ' (2nd Purchase list), Trading A/c From, (దీనిని గూర్చి ఫైనల్ ఎసెస్‌మెంట్స్ అనే అంశములో తెలుసుకుందాం.) ఆ సంవత్సరంలో వాడిన 'వే' బిల్లుల వివరములు అటులనే వాడిన 'సి' ఫారం వివరములు కూడా దాఖలు చేసినయెడల సమ్మరీ ఎసెస్‌మెంట్ గావించబడి డిపార్టుమెంటు వారి నుండి వ్యాపారస్తునికి Acknowledgement పంపబడుతుంది. ఇట్టివి ఎఎ9 షరతులకు లోబడియున్నయెడల ఆ సంవత్సరపు సంబంధిత ఎక్కౌంటు బుక్స్‌ను ఫైనల్ ఎసెస్‌మెంట్ కొరకై డిపార్టుమెంటు వారికి సబ్‌మిట్ చేయనవసరము లేకుండగనే ఎసెస్‌మెంట్ పూర్తి గావించబడుతుంది.

## F NAL ASSESSMENTS

ఫైనాన్షియల్ సం॥ చివరకు వ్యాపార సంస్థలో ఎక్కౌంట్ బుక్స్ అన్నింటిని క్లోజ్‌చేసి కొత్త సంవత్సరమునకు మరల కొత్త ఎక్కౌంట్ బుక్స్‌ను ప్రారంభించటం జరుగుతుంది. (డే బుక్, లెడ్జర్, సేల్ బిల్స్, రిసీప్ట్స్) దీనినే వాడుకగా వ్యాపారానికి దస్త్రం పెట్టారు అంటుంటారు. యిట్లే క్లోజ్ చేయబడిన బుక్స్ నుండి తదుపరి సంవత్సరములలో సేల్స్ టాక్స్ డిపార్ట్‌మెంట్ వారి సంబంధిత కార్యాలయములో ఎసెస్‌మెంట్ ఫైనలైజ్ చేయించుకోవలసి యుండి యున్నది.

# పూర్తిగావించబడిన AA9 నమూనా

PART-A

RETURN OF TURNOVER TO BE FILED BY DEALERS UNDER SECTION 14-E (SEE RULE 15-D (1))

To

The ~~Assistant~~ Deputy Commerical Tax Officer

Suryaraopet ..........Circle
Vijayawada

I.....E.Aravinda Rao.............Son/~~Daughter~~ / ~~Wife~~ of ........Jagan..........

on behalf of the dealer carrying business known as ARAVINDA AUTOMOBILES

(dealer name firm name with R.C.No.) opt to be assessed under section 14-E and furnish

herewith the statement of the total turnover and tax due thereon under the Act as

assessed by me for the said business during the year commencing from ..........

.....1-4-99......... and ending on .........31-3-2000......... and give

the following connected particulars.

1. Registration Certificate Number: APGST VJ11/04/2/1176 CST VJ11/04/2/1324

2. Address of principal place of business ARAVINDA AUTOMOBILES
D.No.14-71-84, Eluru Road, Vijayawada-2

3. Particulars of Payment:

a) Total tax payable ........2,800/-........

b) Total tax paid ........2,800/-........

i) DD Particulars ..........

Number .......... Date ..........

Bank .......... Branch ..........

ii) Cash Receipt No. if paid ....../...... Date ..........

Chalan Particulars:

Number .......... Date ..........

Name of Treasury ..........

Balance Payable if any:

a) b) - - Nil - -

4. Tax Paid by the dealer for the previous year: 2150/-

No. of Commodities for which particulars are given

| Sl. No. | Commodity Description | Code | Total Turnover | Exempted Turnover | Net Turnover | Rate of Tax | Tax Due to be paid |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 1st Sales of Automobile | | | | | | | |
| | Spares | | 35,000 | -Nil- | 35000 | 8% | 2800 |
| 2nd Sales of Automobile | | | | | | | |
| | Spares | | 3,50,000 | 3,50,000 | -Nil- | --- | --- |
| | Total: | | 3,85,000 | 3,50,000 | 35,000 | --- | 2,800 |

DECLARATION

I/We B. Aravinda Rao Son/Daughter/Wife of Jagan declare to the best of my/our knowledge and belief that the information furnished in the above statements true and complete.

For ARAVINDA AUTOMOBILES

Signature

Proprietor

Place: VZA

Date : 30-5-2000

States & Relationship to the dealer

# JOB WORK / SERVICING CHARGES

కొన్ని కొన్ని వ్యాపార వ్యవస్థలలో అమ్మకము, కొనుగోలులతో పాటుగా జాబ్ వర్క్, కలక్షన్స్, సర్వీసింగ్ ఛార్జెస్ లాంటివి కూడా ఉండటం జరుగుతుంది. ఉదా:- టి.వి.లు అమ్మే సంస్థ ఉంది. అందు టి.వి.లు అమ్మకంతోపాటుగా ఇంతకుముందుగా వారు అమ్మిన టి.వి.లుగాని, వేరే కంపెనీ టి.వి.లుగాని పాడయిపోయి బాగుచేయుటకొరకు కష్టమర్ తీసుకొని వస్తే దానిని సరిచేసి యివ్వడం జరగవచ్చు. అట్టి సందర్భములలో ఈ ట్రాన్స్‌శాక్షన్‌కి సంబంధించి కొనుగోలులు, అమ్మకములు ఏమియూ లేకపోయినప్పటికిని అట్టి జాబ్ చేసినందుకుగాను కష్టమర్ నుంచి కొంత ఫీజుగా తీసుకోవడం జరుగుతుంది. యిట్టి కలక్షన్స్ ఒక నెలలో 5,000లు వచ్చినాయి అనుకుందాం. యిట్టి వాటిని సర్వీస్/జాబ్‌వర్క్ అని వేరుగా బిల్లు బుక్ పెట్టి అందులో బిల్స్ రాసి సర్వీసింగ్ చార్జెస్ అనే హెడ్ ఆఫ్ అకౌంట్‌కు క్రెడిట్ చేసుకోవాలి. వీటిని కూడా ప్రతి నెలా ఎ2 రిటన్స్‌లో సర్వీసింగ్ చార్జెస్ అని వ్రాసి జి.టి.ఒ., ఇ.టి.ఒ. లోను అదే మొత్తమును చూపి ఎన్.టి.ఒ.లో మాత్రము నిల్‌గా రాసి పంపాలి. యిట్టి కలక్షన్స్‌పై సేల్సుటాక్స్ ఏమీ ఉండదు.

SALES TAX FINAL ASSESMENT (TRADING ACCOUNT) FORM **నమూనా**

**అసిస్టెంట్ / డిప్యూటి / కమర్షియల్ టాక్సు ఆఫీసురు గార్కి**

అయ్యా,

లెక్కల తనిఖీ విషయములో ఈ దిగువ విషయములను తెలుపుకొనుచున్నాము

1. ఎసెస్మెంట్ నెంబరు :

ఎసెసీపేరు : 2. ఎసెస్మెంట్ సంవత్సరము:

3. (ఎ) భాగస్తుల పేర్లు :

| సీరియల్ నెం | భాగస్తుని పేరు | తండ్రిపేరు | అడ్రసు | వాటా వివరం |
|---|---|---|---|---|
| | | | | |
| | | | | |
| | | | | |
| | | | | |
| | | | | |
| | | | | |

4. ఏ కంపెనీ చట్టము క్రింద రిజిష్టరు కాబడినదో
రిజిస్ట్రేషను నెంబరు మరియు తేది : ----------------

5. వ్యాపారము స్థలము : ---------------

6. బ్రాంచి స్థలము : ---------------

7. లెక్కల పుస్తకములు
వ్రాయబడిన సంవత్సరం : ---------------

8. (ఎ) రిజిస్ట్రేషను సర్టిఫికేటు నెంబరు : స్టే

(బి) బ్రాంచీలకు రిజిస్ట్రేషను సర్టిఫికేటు
కాపీలు పొందబడినవా : ---------------

9. (ఎ) షెడ్యూలు వస్తువులకు పొందిన రిజిస్ట్రేషను
సర్టిఫికెటు నెంబర్లు : స్టే

(బి) తనిఖీ సంవత్సరమునకు చెల్లించిన
రిజిస్ట్రేషను రుసుము/తేది/చలానా
లేక రశీదు నెంబరు : స్టే

(సి) చెల్లించిన సంవత్సరమునకు చెల్లించిన
రుసుము/తేది/చలానా లేక రశీదు నెం. : ---------------

(డి) తనిఖీ సంవత్సరమునకు చెల్లించిన వృత్తి
పన్ను/రుసుము/చలానా లేక రశీదు
నెంబరు : ---------------

(ఇ) జరుగుచున్న సంవత్సరమునకు,
చెల్లించిన వృత్తిపన్ను, పన్నురుసుము
/తేది/చలానా లేదా రశీదు నెంబరు : ---------------

10. ఎసెస్‌మెంట్ సంవత్సరమునకు జారీచేసిన
ఇన్‌కంటాక్స్ ఆర్డరు
నకలు జతపర్చవలెను : ---------------

11. (ఎ తనిఖీ నిమిత్తము హాజరుపర్చిన
పుస్తకముల జాబితా : ---------------

12. వ్యాపారస్తుడు హాజరుకానియెడల
అకౌంటుచేయించుకొనవచ్చిన ఆసామిపేరు : ---------------
(అతనిచ్చిన ఆథరైజేషన్ జతపర్చవలెను : ---------------

## ట్రేడింగ్ అక్కౌంట్

(ఎసెసీ) ఏ సంత్సరమునకు అకౌంట్లు ప్రాసెసో ఆ సంవత్సరమునకే ఈ స్టేటుమెంటు పూర్తిచేయవలెను

| పేజీ నెంబరు | ఖాతాపేరు | ప్రారంభ నిల్వ రు.నపై | సం లో కొనుగోలు రు.నపై. | మొత్తము కొనుగోలు రు.నపై. | అంత్య నిల్వ రు.నపై | నికరపు కొనుగోలు రు.నపై | అమ్మకం రు. నపై. |
|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | |
| | | | | | | | |
| | | | | | | | |
| | | | | | | | |
| | | | | | | | |
| | | | | | | | |
| | | | | | | | |
| | | | | | | | |

## మినహాయింపు వివరములు
### 2వ అమ్మకములు లేక 2వ కొనుగోలులు

| సరుకుపేరు | బిల్లు నెంబరు | ఖరీదు తేది | ఎవరివద్ద కొన్నది | అడ్రసు | ఖరీదు సొమ్ము |
|---|---|---|---|---|---|
| | | | | | |

ఈ లిస్టు రెండు కాపీలు దాఖలు చేయాలి.

## ఎసెస్‌మెంట్ సంవత్సరమునకు టర్నోవరు వివరములు

| సరుకుపేరు ఖాతా | పన్ను విధింపు రేట్లు | | | | |
|---|---|---|---|---|---|
| | 2% | 3% | 4% | 5% | 6% |
| | | | | | |
| వెరశి టర్నోవరు | | | | | |

ఎసెస్‌మెంట్ సంవత్సరమునకు లేక రిటరనులో తెలియపర్చిన టర్నోవరు

| రిటర్న్ దాఖలు చేసిన తేది | నెల | వెరశి టర్నోవరు రు. | నైపై | మినహాయింపు టర్నోవరు రు. | నైపై | నికర టర్నోవరు రు. | నైపై | చెల్లించిన టాక్సు రు. | నైపై |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | ఏప్రియల్ | | | | | | | | |
| | మే | | | | | | | | |
| | జూన్ | | | | | | | | |
| | జూలై | | | | | | | | |
| | ఆగష్టు | | | | | | | | |
| | సెప్టెంబరు | | | | | | | | |
| | అక్టోబరు | | | | | | | | |
| | నవంబరు | | | | | | | | |
| | డిశంబరు | | | | | | | | |
| | జనవరి | | | | | | | | |
| | ఫిబ్రవరి | | | | | | | | |
| | మార్చి | | | | | | | | |
| | మొత్తం | | | | | | | | |

ఉదా:- Ritish Exports అను వ్యాపారసంస్థ వారి 99 - 2000 సంవత్సరపు లెక్కల పుస్తకముల ప్రకారము వివరములు ఈ క్రింది విధముగా ఉండియున్నవి.

| Sales | | Purchases | |
|---|---|---|---|
| 1st Medicines | 15,40,500 | 1st Medicines | 13,26,665 |
| 2nd Medicines | 20,15,500 | 2nd Medicines | 18,19,415 |
| Interstates | 5,10,000 | Interstates | 4,79,400 |
| Job work collections | 15,000 | Ist sales returns | 55,500 |

| Opening Stock as on 1-4-99 | | Closing Stock as on 31-3-2000 | |
|---|---|---|---|
| 1st Medicines | 2,50,000 | 1st Medicines | 1,90,000 |
| 2nd Medicines | 1,50,000 | 2nd Medicines | 95,000 |

## నెలవారీ దాఖలు చేసిన
## $A_2$ return forms యొక్క వివరములు.

| Month | GTO | ETO | NTO | Tax |
|---|---|---|---|---|
| April 99 | 3,08,270 | 2,15,620 | 92,650 | 9,265 |
| May | 2,87,675 | 1,99,875 | 87,800 | 8,780 |
| June | 2,66,215 | 1,63,715 | 1,02,500 | 10,250 |
| July | 3,24,235 | 2,42,520 | 81,715 | 8,172 |
| August | 3,40,855 | 2,37,635 | 1,03,220 | 10,322 |
| September | 4,57,765 | 3,00,150 | 1,57,615 | 15,762 |
| October | 3,50,480 | 2,27,610 | 1,22,870 | 12,287 |
| November | 3,53,430 | 1,87,810 | 1,65,620 | 16,562 |
| December | 3,98,980 | 2,14,765 | 1,84,215 | 18,421 |
| Jan 2000 | 3,93,735 | 2,31,125 | 1,62,610 | 16,261 |
| February | 2,76,145 | 1,60,270 | 1,15,875 | 11,587 |
| March | 3,78,715 | 2,14,905 | 1,63,810 | 16,381 |
| Total | 41,36,500 | 25,96,000 | 15,40,500 | 1,54,050 |

2000 - 2001 సంవత్సరమునకు లైసెన్స్ రెన్యువల్ ఫీజు రశీదు నెం. 3767812 దాఖలా ది.25-4-2000 రూ.100/- చెల్లించినారు.

2000 - 2001 సంవత్సరమునకు లైసెన్సు రెన్యువల్ ఫీజును రశీదు నెం.5731475 దాఖలా ది. 20-4-2001న రూ. 100/-లు చెల్లించినారు.

2000 - 2001 సంవత్సరమునకు వృత్తి పన్నును బ్యాంకు చెక్కు నెం.156176 దాఖల ది.30-4-2000న రూ.1,500/-లు చెల్లించినారు.

2001 - 2002 సంవత్సరమునకు వృత్తి పన్నును బ్యాంకు చెక్కు నెం.234761 దాఖల ది.25-4-2001న రూ.1,500/-లు చెల్లించినారు.

ఈ సంస్థలో

1) కె. జగదీష్ S/o. వినోద్, డోర్‌నెం. 16-72-31, మేరీ స్ట్రీట్, మొగల్‌రాజపురం, విజయవాడ - 2, వాటా 65%,

2) ఆర్. శ్రీలత W/o. రాహుల్, డోర్ నెం. 11-21-63, క్రాంబే రోడ్, విద్యాధరపురం, విజయవాడ, వాటా 35% నిష్పత్తుల ప్రకారము డోర్ నెం. 41-67-19 రెహమాన్‌స్ట్రీట్, గవర్నర్‌పేట, విజయవాడ - 2, నందు వ్యాపారము చేయుచున్నారు. వీరి APGST No. VJ II/06/5/1721/, CST No.1034, G.I. No. 785.

## పూర్తిగావింపబడిన TRADING A/C FORM

### అసిస్టెంట్ / డిప్యూటి / కమర్షియల్ టాక్సు ఆఫీసురు గార్కి

Governorpet, Vijayawada

అయ్యా,

లెక్కల తనిఖీ విషయములో ఈ దిగువ విషయములను తెలుపుకొనుచున్నాము

1. ఎసెస్మెంట్ నెంబరు : 785

ఎసెసీపేరు Ritish Exports : 2. ఎసెస్మెంట్ సంవత్సరము: 2000 - 2001

3. (ఎ) భాగస్తుల పేర్లు :

| సీరియల్ నెం | భాగస్తుని పేరు | తండ్రిపేరు | అడ్రసు | వాటా వివరం |
|---|---|---|---|---|
| 1. | K. Jagadish | S/o Vinod | 16-72-31, Marry St., mogalrajpuram Vijayawada | 65% |
| 2. | R. Sri Latha | W/o Rahul | 11-21-63, crombayRoad Vidyadharapuram VIJAYAWADA | 35% |
| | | | | |
| | | | | 100% |

4. ఏ కంపెనీ చట్టము క్రింద రిజిష్టరు కాబడినదో రిజిస్ట్రేషను నెంబరు మరియు తేది : - Nil -

5. వ్యాపారము స్థలము : D.No.41-67-19, Rehman St.,Governorpet, Vijayawada-2

| | | | |
|---|---|---|---|
| 6. | బ్రాంచి స్థలము | : | - Nil - |
| 7. | లెక్కల పుస్తకములు వ్రాయబడిన సంవత్సరం | : | 1-4-99 to 31-3-2000 |
| 8. | (ఎ) రిజిస్ట్రేషను సర్టిఫికేటు నెంబరు | : | APGST VJ11/06/5/1721<br>CST VJ11/06/5/1034 |
| | (బి) బ్రాంచీలకు రిజిస్ట్రేషను సర్టిఫికేటు కాపీలు పొందబడినవా | : | - Nil - |
| 9. | (ఎ) షెడ్యూలు వస్తువులకు పొందిన రిజిస్ట్రేషను సర్టిఫికెటు నెంబర్లు | : | - Nil - |
| | (బి) తనిఖీ సంవత్సరమునకు చెల్లించిన రిజిస్ట్రేషను రుసుము/తేది/చలానా లేక రశీదు నెంబరు | : | Rt.No.37678/2 dt.25.4.2000<br>Rs.100/- |
| | (సి) జరుగుతున్న సంవత్సరమునకుచెల్లించిన రిజిస్ట్రేషనురుసుము/తేది/చలానా లేక రశీదు నెం. | : | Rt.No.57311475 dt.20-4-2001<br>Rs.100/- |
| | (డి) తనిఖీ సంవత్సరమునకు చెల్లించిన వృత్తి పన్ను/రుసుము/చలానా లేక రశీదు నెంబరు | : | Ch.No.156176 Dt.30-4-2000<br>Rs.1500/- |
| | (ఇ) జరుగుచున్న సంవత్సరమునకు, చెల్లించిన వృత్తిపన్ను, పన్నురుసుము /తేది/చలానా లేదా రశీదు నెంబరు | : | Ch.No.234761 dt. 25-4-2000<br>Rs.1500/- |
| 10. | ఎసెస్‌మెంట్ సంవత్సరమునకు జారీచేసిన ఇన్‌కంటాక్స్ ఆర్డరు నకలు జతపర్చవలెను | : | Not Yet Completed |
| 11. | (ఎ తనిఖీ నిమిత్తము హాజరుపర్చిన పుస్తకముల జాబితా | : | Day Book, Ledger, Sales & Purchase Bills |
| 12. | వ్యాపారస్తుడు హాజరుకానియెడల అకౌంటుచేయించుకొనవచ్చిన ఆసామిపేరు | : | |
| | (అతనిచ్చిన ఆధరైజేషన్ జతపర్చవలెను | : | |

## ట్రేడింగ్ అక్కౌంట్

(ఎసెపీ) ఏ సంవత్సరమునకు అకౌంట్లు ప్రాసెస్ అ సంవత్సరమునకే ఈ స్టేటుమెంటు పూర్తిచేయవలెను

| పేజీ నెంబరు | ఖాతాపేరు | ప్రారంభ నిల్వ రు.న్పై | సం.లో కొనుగోలు రు.న్పై. | మొత్తము కొనుగోలు రు.న్పై. | అంత్య నిల్వ రు.న్పై | నికరపు కొనుగోలు రు.న్పై | అమ్మకం రు. న్పై. |
|---|---|---|---|---|---|---|---|
| | 1st Sale of Medi... | 2,50,000 | 13,26,625 | 15,76,665 | 1,90,000 | 13,86,665 | 15,40,400 |
| | 2nd Sale of Medi... | 1,50,000 | 18,19,415 | 19,69,415 | 95,000 | 18,74,415 | 20,15,500 |
| | Inter State Sales | | 4,79,400 | 4,79,400 | Nil | 4,79,400 | 5,10,000 |
| | Job Work Collect... | --- | --- | --- | --- | --- | 15,000 |
| | Total | 4,00,000 | 36,25,480 | 40,25,480 | 2,85,000 | 37,40,480 | 40,80,900 |

## మినహాయింపు వివరములు
## 2వ అమ్మకములు లేక 2వ కొనుగోలులు

| సరుకుపేరు | బిల్లు నెంబరు | ఖరీదు తేది | ఎవరివద్ద కొన్నది | అడ్రసు | ఖరీదు సొమ్ము |
|---|---|---|---|---|---|

Seperate lists enclosed in duplicated
Rs.18, 19, 415/-

ఈ లిస్టు రెండు కాపీలు దాఖలు చేయాలి.

## ఎసెస్‌మెంట్ సంవత్సరమునకు టర్నోవరు వివరములు

| సరుకుపేరు ఖాతా | పన్ను విధింపు రేట్లు 2% | 3% | 4% | 5% | Total |
|---|---|---|---|---|---|
| 1St Sales of Medicines | 15,40,400 | | | | |
| 2nd Sales of Medicines | | 2015500 | | | |
| Inter State Sales | | | | 15,000 | |
| Job Work Collection | | -- | -- | 15,000 | |
| వెరశి టర్నోవరు | 1540400 | 2015500 | 510000 | 15000 | 4080900 |

మినహాయింపులు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1st Sales Returns | 55,500 | | | | |
| 2nd Sales Returns | | 20,15,500 | | | |
| Inter State Sales | | 5,10,000 | | | |
| Job Work Collection | | | | 15,000 | 40,80,900 |
| మినహాయింపుమొత్తం | 55,500 | 20,15,500 | 510000 | 15000 | 25,96,000 |
| నికరపు టర్నోవరు | 14,84,900 | నిల్ | నిల్ | నిల్ | 14,84,900 |

వాపసు అమ్మకములు లేక ఖరీదులు

| సరుకు అమ్మినతేది లేక ఖరీదు తేది | బిల్లు నెంబరు | సరుకు పేరు | ఎవరికి అమ్మినది లేక ఎవరివద్దకొన్నది | వాపసు తేది | మినహాయింపు కోరినసొమ్ము |
|---|---|---|---|---|---|
| | | | | | |
| | | | | | |
| | | | | | |

List enclosed Seperatly Rs.55,500/-

ఎసెస్‌మెంట్ సంవత్సరమునకు లేక రిటరనులో తెలియపర్చిన టర్నోవరు

| రిటర్న్ దాఖలు చేసిన తేది | నెల | వెరశి టర్నోవరు రు. నపై | మినహాయింపు టర్నోవరు రు. నపై | నికర టర్నోవరు రు. నపై | చెల్లించిన టాక్సు రు. నపై |
|---|---|---|---|---|---|
| 19.05.99 | ఏప్రియల్ | 308270 00 | 215620 00 | 92650 00 | 9265 00 |
| 20.06.99 | మే | 287675 00 | 199875 00 | 87800 00 | 8780 00 |
| 18.07.99 | జూన్ | 266215 00 | 165715 00 | 102500 00 | 10250 00 |
| 20.08.99 | జూలై | 324235 00 | 242520 00 | 81715 00 | 8172 00 |
| 17.07.99 | ఆగష్టు | 340855 00 | 237635 00 | 103220 00 | 10322 00 |
| 19.10.99 | సెప్టెంబరు | 457765 00 | 300 150 00 | 157615 00 | 15762 00 |
| 20.11.99 | అక్టోబరు | 350480 00 | 223610 00 | 122870 00 | 12287 00 |
| 15.12.99 | నవంబరు | 353430 00 | 187810 00 | 165620 00 | 16562 00 |
| 16.01.00 | డిశంబరు | 398980 00 | 214765 00 | 184215 00 | 18421 00 |
| 18.02.00 | జనవరి | 393735 00 | 231125 00 | 162610 00 | 16261 00 |
| 15.03.00 | ఫిబ్రవరి | 276145 00 | 160270 00 | 115875 00 | 11587 00 |
| 20.04.00 | మార్చి | 378715 00 | 214905 00 | 163810 00 | 16381 00 |
| | మొత్తం | 4136500 00 | 2596000 00 | 150500 00 | 154050 00 |

సెంట్రల్ సేల్సు టాక్సు ఆక్టు క్రింద అమ్మకము

| తేది | బిల్లు నెంబరు | ఎవరికి అమ్మినది వారి పేరు అడ్రసు | సరుకు వివరం | అమ్మకము సొమ్ము | సి ఫారం నెంబరు తేది |
|---|---|---|---|---|---|
| 20-4-99 | 185 | Murali Medical Distributor<br>Hubli | medicines | 47,655/- | CA/2 186172<br>30.8.99 |
| 29-8-99 | 767 | - do - | " | 39,815/- | |
| 10-4-99 | 241 | Venkat Medical Agencies<br>Surat | medicines | 61675/- | B5 914761<br>27.8.99 |
| 8-6-99 | 539 | Charu Medicals<br>Delhi | medicines | 83190/- | Zo 831367<br>21.10.99 |
| 3-10-99 | 893 | Mahi Traders<br>Madhuari | medicines | 42732/- | ST 396879<br>5.4.99 |
| 16-01-00 | 1112 | Parimala Agencies<br>Nasic | medicines | 74630/- | J 661474<br>25.2.00 |
| 28-01-00 | 1215 | Nemali Distributors<br>Nivali | medicines | 92635/- | LB 521439<br>14.3.00 |
| 19-02-00 | 1235 | Lumbini Traders<br>Dharwad | medicines | 67665/- | A5 743210<br>15.4.00 |
| | | | | | |
| | | | | | |
| | | | | | |
| | | | | | |
| | | | Total Rs. | 5,10,000 | |

Form లోని మొదటి పేజీని పరిశీలించిన యెడల అసిస్టెంట్/ డిప్యూటీ, కమర్షియల్ టాక్స్ ఆఫీసర్, అన్నవాటిలో ఎసెసీ ఏ ఆఫీసర్ రోల్స్‌కు సంబంధించిన వారో దానికి R మార్క్ చేసి ఆ కార్యాలయపు అడ్రసును వ్రాయాలి. మనం చూస్తున్న Ritish Exports అను వ్యాపార సంస్థ సంవత్సరపు టర్నోవర్ రు.25,00,000/- పైనే ఉన్నది కావున సి.టి.ఓ. పరిధికి చెందినవారుగా భావించి అసిస్టెంట్, డిప్యూటీ అను వాటిపై మార్కును X చేసి సి.టి.ఓ. పై R మార్కును వుంచి కార్యాలయపు అడ్రస్ అయిన గవర్నరుపేట, విజయవాడ అని వ్రాయడం జరిగింది.

వ్యాపారస్థునకు ఆర్.సి.నెంబరుతో పాటుగా అసెస్‌మెంటు నెంబరు సపరేటుగా ఉంటుంది. ఈ నెంబరును అసెస్‌మెంటు నెంబరు అన్నచోట చూపవలయును. ఈ రితీస్ ఎక్స్‌పోర్ట్స్ వారి వార్షిక టర్నోవర్ 25 లక్షల నుండి 50 లక్షల మధ్య ఉండినది గావున వృత్తి పన్ను రూ.1500/-లు చెల్లించడం జరిగింది అని గమనించాలి. అసెస్‌మెంటుకు హాజరు కావడానికి సబ్‌మిట్ చేయవలసిన పుస్తకముల జాబితా అన్నచోట క్యాష్ బుక్, లెడ్జెర్, సేల్సు, పర్చేజ్ బిల్లులు, అని వ్రాసి వీటితోపాటు ఆ సం॥లో వాడిన 'వే' బిల్లులు, 'సి' ఫారములు లాటి అన్ని వివరములతో సహా హాజరు కావలయును.

2వ పేజీలో ఖాతా వారీగా చూపడం జరిగింది. ఈ వివరములు అన్నియు ముందుగా ఉదాహరణలో యివ్వబడినవే. అయితే నికరపు కొనుగోలులు అన్నది మొత్తం కొనుగోలు విలువలో నుండి అంత్య నిల్వ (క్లోజింగ్ స్టాక్) తీసివేయగా మిగులు అని అవగతపర్చుకోవాలి. దాని క్రింద మినహాయింపు వివరములు

అన్నిచోట్ల రెండవ కొనుగోలుల విలువ రూ.18, 19, 415/-లుకి లిస్టను వేరే పేపర్సుపై 2 కాపీలు చొప్పున పార్టీవైడ్‌గా తయారుచేసి దాఖలు చేయవలయును.

దానిని ఈ క్రింది విధముగ చూపాలి.

ఈ కొనుగోలులను ఈ సం॥లో ఉదాహరణకు 25 మంది వేరువేరు డీలర్సు ద్వారా ఈ రాష్ట్రమునందు కొనుగోలు చేసారనుకొందాం. అందుండి ఒక డీలరు వద్ద చేసిన కొనుగోలులను పరిశీలిద్దాం.

**Mohan Med cal Distributors**

D.No. 5-11-57, Museum Road, Governorpet,

Vi,ayawada-2 R.C.No.VJII/05/01/1147

| Date | B.No. | Amount | Particulars |
|---|---|---|---|
| 11-4-2001 | 107 | 20,150.00 | Medicines |
| 21-5-2000 | 214 | 19,400.00 | Medicines |
| 30-6-2000 | 325 | 18,550.00 | Medicines |
| Total | | 58,100.00 | |

ఈ విధముగా 25 మంది డీలర్స్ వద్ద కొన్న వివరములను విడివిడిగా వారి అడ్రసు, ఆర్.సి.నెంబరులతో సహా తెలియపరుస్తూ కొనుగోలుల ఆబ్‌స్ట్రాక్‌ను దాఖలు చెయ్యాలి. (ఈ 25 మంది డీలర్స్ వద్ద నుండి కొన్న కొనుగోలుల ఆబ్‌స్ట్రాక్‌కు ఆ సంవత్సరపు లెక్కల పుస్తకములలోని 2వ కొనుగోలుల ఖాతా టోటల్ విలువకు సరిపడి ఉండాలి అని గమనించాలి)

ఇంతకుముందు పేజీని పరిశీలించినట్లయితే పన్ను రేట్లు ప్రకారము ఖాతాల వారిగా విడివిడిగా రాస్తూ మినహాయింపులున్నచోట్ల మొదటి అమ్మకములపై ఏ నెలకానెల సేల్స్ టాక్స్ చెల్లించబడినది. అందుండి రు.55,500/- ల సరుకులు తిరిగి వాపసు రావడం జరిగింది. (సేల్స్ రిటర్న్) ఇట్టి అమ్మకపు వాపసులపై టాక్స్ మినహాయింపు కోరవలసి ఉన్నది. C లేనిచో యిట్టి వాపసులపై టాక్స్ చెల్లించడం జరుగుతుంది గదా) కావున ఈ వాపసులపై కట్టిన టాక్స్ మినహాయింపు రావలెనన్న అమ్మకములు జరిగిన తేదీనుండి వాపసులు వచ్చిన తేదీలు 6 నెలల కాలవ్యవధిలోపుగా మాత్రమే ఉండి ఉండాలి. ఈ వాపసులు జరిగిన నెలలో ఆ నెల దాఖలు చేసేటి ఎ2 ఫారమ్ నందు ఈ వాపసుల వివరములను క్లైమ్ చేసిఉండాలి. అట్టి సందర్భములలో మాత్రమే టాక్స్ మినహాయింపు రావడం జరుగును.

రూ.55,500/- అమ్మకపు వాపసుల వివరములు ఈ క్రింది విధముగా వ్రాసి దాఖలు చేయాలి.

| Date of Goods returns | B.No. & Date | Name of the Party | Value |
|---|---|---|---|
| 15.6.2000 | 119/10.4.2000 | Aravinda Medicals Euru | 10,750 |
| 30.9.2000 | 175/13.5.2000 | Peoples Medicals Rajahmundry | 12,300 |
| 25.11.2000 | 211/15.6.2000 | Ganesh Medicals Palakollu | 21,200 |
| 30.1.2000 | 373/21.8.2000 | Neveen Medicals Bhimavaram | 11,250 |
| | | Total Rs. | 55,500 |

పై లిస్ట్‌ను పరిశీలించగా సరుకులు వాపసు అయిన తేదికి ముందు, బిల్స్ వ్రాసినతేదీ 6 నెలలలోపుగాఉండి ఉన్నది. కావున మొత్తం రు.55,500/- ల వాపసులపై టాక్స్ మినహాయింపు యివ్వడం జరుగును.

4వ పేజీని పరిశీలించగా నెలవారి సబ్మిట్ చేసిన రిటన్ ఫాంస్ వివరముల ప్రకారము చూపబడినది. అదే AA9 వారయితే Filed AA9 అని వ్రాసి Total values మాత్రం GTO, ETO, NTO, Tax లు మాత్రమే వ్రాసిన సరిపడును.(వీరు నెలవారీ return forms file చేసి ఉండలేదు కాబట్టి)

## CST అమ్మకములు

ఆ సంవత్సరపు CST అమ్మకములు బిల్ నెం. తేదీ, మరి యితర పూర్తి వివరములు చూపుతూ అట్టి అమ్మకములకు సంబంధించిన 'C' ఫారంలు Dealer వద్ద నుండి వచ్చిన వాటిని చూపాలి. ఈ CST అమ్మకపు విలువ అంతటకి 'C' Form లు వచ్చినా సరే, లేనియెడల 'C' Form లు రాని అమ్మకపు విలువపై అదనపు టాక్స్ (అనగా 4% కాక 10% అవుతుంది) చెల్లించవలసి వస్తుంది.

APGST Assessment Order, CST Assessment Order అని విడివిడిగా డిపార్టుమెంటు వారు Seperate Orders Pass చేయడం జరుగుతుంది.

# మొదటి. వాల్యూమ్‌లోని ప్రశ్నా పత్రమునకు జవాబులు

## 1. CASH BOOK FOR "MURARI & CO"

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 190 | StationeryA/C | | |
| a) | | To Cost of Carbon Papers | 20 | |
| b) | 25 | Purchases A/C | | |
| | | To B.No.14 Nagu & Co., | 5000 | |
| | 100 | Nagu & Co. | | |
| | | By B.No.14 | | 5000 |
| c) | 151 | Kesav Industries A/C | | |
| | | By Ch.No.321487 | | 1400 |
| | 51 | Bank A/C | | |
| | | To Ch.No. 321487 | 1400 | |
| d) | 225 | Vehicle Maintenance A/C | | |
| | | To B.No. xx cash paid | | |
| | | For Scootor Petrol | 90 | |

Note:- పైవాటి ద్వారా మనకర్థమైనదేమనగా ట్రాన్‌శాక్షన్ గనుక క్యాష్ ద్వారా జరిగేటట్లయితే ఒకసారి మాత్రమే హెడ్ ఆఫ్ అక్కౌంట్ వస్తుంది. అట్లాకాక క్రెడిట్ ట్రాన్‌శాక్షన్ అయ్యేటట్లయితే హెడ్ ఆఫ్ అక్కౌంట్స్ రెండుమార్లు వ్రాయవలసి వస్తుంది అనేవిషయాన్ని బండగా గుర్తుంచు కోవాలి. (రెండు రెళ్లు నాలుగు అనే ఎక్కాల మాదిరిగా)

# CASH BOOK FOR FATHIMA INDUSTRIES

Page:99

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | | | | |
| a) | 175 | Neelima Devi A/c | | |
| | | To Voucher Towards | | |
| | | Salary Advance | 250 | |
| b) | 255 | Office Maintence (or) | | |
| | | Miscellaneous A/c | | |
| | | To Repair Charges | 100 | |
| c) | 191 | Alankar Theatre A/c | | |
| | | To cash Towards Adv. | | |
| | | For Cinema Slices | 500 | |
| d) | 225 | Salaries A/c | | |
| | | To V.R. Neelima Devi | 1200 | |
| | 175 | Neelima Devi A/c | | |
| | | By Salary Adv. Recovery | | 250 |
| e) | 262 | Advertisement A/c | | |
| | | To Bill No. | | |
| | | Alankar Theater | 3000 | |
| | 191 | Alankar Theater A/c. | | |
| | | By Adv. B.No. xxx | | 3000 |

# LEDGER

## STATIONERY A/C

1(a) Page No. 199

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 1 | To Cost of Carbon Papers | 20 | |

## PURCHASE A/C

1(b) Page No. 25

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 1 | To B.No.14 Nagu & Company | 5000 | |

## NAGU & COMPANY A/C

Page No.100

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 1 | By B.No.14 | | 5000 |

KESAV INDUSTRIES A/C

1(c) Page No. 151

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 1 | To Ch.No. 321487 | | 1400 |

BANK A/C

Page No. 51

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 1 | To Ch.No.321487 | 1400 | |

VEHICLE MAINTENANCE A/C.

Page No. 245

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 1 | To B.No. x x x Petrol | 90 | |

LEDGER
NEELIMA DEVI A/C.

(2)a Page No. 175

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 99 | To Vr. Salary Adv. | 250 | |
| | | By Adv. Recovery | | 250 |
| | | | 250 | 250 |

OFFICE MAINTENANCE A/C

(b) Page No. 255

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 99 | To Vr. repair charges paid | 100 | |

ALANKAR THEATRE A/C.

(C) Page No. 191

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 99 | To Cash towards Adv. for | | |
| | | Cinema Slides | 500 | |
| | | By B.No. x x x | | 3000 |

SALARIES A/C

(d) Page No. 262

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 99 | To Vr. Salary Paid to | | |
| | | Neelimadevi | 1200 | |

ADVERTISEMENT A/C

(e) Page No. 262

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 99 | To Bill No. | | |
| | | Aalnkar Theatre towards | | |
| | | Cinema Slides | 3000 | |

3(a) Page No. 335

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 275 | Sales Tax A/C | | |
| | | To Tax Payable for xxx | 6000 | |
| | 302 | Provision for Expenses A/C | | |
| | | By Sales tax payable | | |
| | | for x x x | | 6000 |
| b) | 291 | Depreciation A/C | | |
| | | To Dep. on Machinery | | |
| | | @ 25% on Rs.45,000/- | 11,250 | |
| | 5 | Machinery A/C | | |
| | | By Dep. @ 25% on | | |
| | | Rs. 45,000/- | | 11,250 |

LEDGER

Sale Tax A/C.

3(a) Page No. 275

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 335 | To Tax Payable for the month of .................. | 6000 | |

Provision for Expenses A/C

Page No. 302

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 335 | By Sales Tax Payable for the month of ......... | | 6000 |

Depreciation A/c

(b) Page No. 291

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 335 | To Dep. on Machinery @ 25% on Rs.45,000/- | 11,250 | |

Machinery A/c

Page No. 5

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 335 | By Depreciation @ 25% on Rs.45,000/- | | 11,250 |

Double Coloumn Cash Book లో ఈ Entry ని Journal ద్వారా Pass చెయ్యాలి

**JOURNAL**

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 1.2.2001 | 275 | Sales Tax A/c Dr | 6000 | |
| | 302 | To Provision for Expenses A/c. | | 6000 |
| | | (towards sales tax Payable for the mont^ of) | | |
| | 291 | Depreciation A/c Dr. | 11,250 | |
| | | To Machinery A/c | | 11,250 |
| | 5 | (Dep. on Machinery @ 25 % on Rs.45,000/- | | |

దీనికి లెడ్జర్ పోస్టింగ్‌పైన చూపిన లెడ్జర్ మాదిరిగానే ఉంటుంది.

4. Purchase Register for the Month of Feb. 20001

Page No.22

| A/c Date | B.No. & Date | Name of the Party & Place | Amount | L.F. |
|---|---|---|---|---|
| 5-2-2001 | 702/1-2-2001 | M/s. Bajanlal & Co., x x x | 7150/- | 282 |

LEDGER

Bajanlal & Co., A/c

Page No.282

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 5.2.2001 | 22 | By B.No. 702 | | 7150 |

5.

| Date | Opeing Stock | Purchases | Total | Sales | Balance | Remarks |
|---|---|---|---|---|---|---|
| 1-2-2001 | 10 | 0 | 10 | 0 | 10 | |
| 2-2-2001 | 10 | 6 | 16 | 3 | 13 | |
| 5-2-2001 | 13 | 0 | 13 | 2 | 11 | |
| 6-2-2001 | 11 | | | | | |

6.

Page No.375

Receipts Payments

| Date | L.F. | P. | Cash | Bank | Date | L.F. | P. | Cash | Bank |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | 3.2.2001 | 142 | Mysore Sandal A/c To D.D. No.164742 | | 1,00,000 |
| | | | | | | 302 | Bank Comm. A/c To D.D. Comm. 100 | | |

LEDGER

Mysore Sandal A/c

Page No. 142

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 3.2.2001 | 375 | To D.D.No.164742 | 1,00,000 | |

Bank Commission A/c

Page No. 302

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 3.2.2001 | 375 | To D.D.Commission Charges | 100 | |

ఇదే Single Coloumn Cash Book లో అయితే

Page No. 297

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| 3.2.2001 | 202 | Bank A/c | | |
| | | By Ch.No.176243 | | 1,00,100 |
| | 142 | Mysore Sandal A/c | | |
| | | To D.D.No. 164742 | 1,00,000 | |
| | 302 | Bank Comm. A/c | | |
| | | To D.D.Comm. Charges | | 100 |

లెడ్జర్ నమోదుచేయుట పై లెడ్జర్‌లోని రెండు పద్దులతో పాటు బ్యాంక్ ఎక్కౌంటును కూడా వేరుగా పోష్టింగ్ చేయవలసి వస్తుంది.

## రెండవ వాల్యూమ్‌లోని ప్రశ్నా పత్రమునకు జవాబులు

Single Coloumn Cash Book

1. a)

Page No.175

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | 115 | Murahari & Co., A/c | | |
| | | To Ch.No. x x Dishonour | [illegible],000 | |
| | 75 | Bank A/c | | |
| | | By Ch. No. x x x | | [illegible]000 |

Double Coloumn Cash Book

b)

Credit | Debit

| Date | L.F. | P. | Cash | Bank | Date | L.F. | P. | Cash | Bank |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | 115 | Murahari & Co,. A/c To Ch.No. x x x | | 11,000 |

Four Coloumn Cash Book

c)

| Date | L.F. | PARTICULARS | Cash Dr | Cash Cr. | Credit Dr | Credit Cr. |
|---|---|---|---|---|---|---|
| | 115 | Murahari & Co.. A/c | | | | |
| | | To Ch. No. x x | | | | |
| | | Dishonour | | | 11,000 | |
| | 75 | Bank A/c | | | | |
| | | By Ch. No. x x x | | | | 11,000 |

# LEDGER

## Murahari & Co., A/c

(a) Page No.115

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | 175 | To Ch.No. x x x dishonour | 11,000 | |

## Bank A/c

(a) Page No.75

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | 175 | By Ch.No. x x x | | 11,000 |

b) Double Coloumn Cash Book కి Ledger Posting వేయునప్పుడు Murahari & Co A/c కి మాత్రం Debit చేసిన సరిపడును. Bank A/c అనునది Cash Book A/c లోనే వేరు కాలమ్‌గా ఉండి ఉన్నందున మరల లెడ్జర్‌లో Bank A/c అని seperate head పెట్టి వ్రాయనవసరము లేదు. Cash Book Page No, ను Ledger లో LF అన్నచోట, Ledger Page No. ను Cash Book లో LF అన్నచోట వేయడం జరుగుచున్నది. గమనించగలరు.

C) Four Coloumn cash book కి Ledger single Entry Cash Book మాదిరిగానే ఉంటుంది. మార్పు ఏమి ఉండదు. (Cash Book లో 4 Coloumns ఉన్నప్పటికిని Ledger లో Debit, Credit అని 2 coloumns మాత్రమే ఉంటాయి అని గ్రహించగలరు)

2. (a) Page No.415

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | 1 | Lavanya Capital A/c | | |
| | | By Interest @ 15% P.a | | 37,500 |
| | 2 | Madhuri Capital A/c | | |
| | | By Interest @ 15% P.a. | | 21,750 |
| | 5 | Tirupal Capital A/c | | |
| | | By Interest @ 15 % P.a. | | 25,500 |
| | 170 | Interest A/c | | |
| | | To Lavanya Capital | 37,500 | |
| | | To Madhuri Capital | 21,750 | |
| | | To Tirupa Capital | 25,500 | |

b) Double Coloumn Cash Book లో ఈ Entry ని Journal ద్వారా వ్రాయడం జరుగుతుంది. Direct గా Cash Book ద్వారా చూపబడదు.

Journal

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | 170 | Interest A/c Dr | 84,750 | |
| | 1 | To Lavanya Capital A/c | | 37,500 |
| | 3 | To Madhuri Capital A/c | | 21,750 |
| | 5 | To Tirupal Capital A/c | | 25,500 |
| | | (Interest onparteners Capital @ 15 % p.a. | | |

Four Coloumn Cash Book

c)

| Date | L.F. | PARTICULARS | Cash Dr | Cash Cr. | Credit Dr | Credit Cr. |
|---|---|---|---|---|---|---|
| | 1 | Lavanya Capital A/c | | | | |
| | | By Interest @15% | | | | 37,500 |
| | 2 | Madhuri Capital A/c | | | | |
| | | By Interest @15% | | | | 21,750 |
| | 5 | Tirupal Capital A/c | | | | |
| | | By Interest @15% | | | | 25,500 |
| | 170 | Interest A/c | | | | |
| | | To Lavanya A/c | 37,500 | | | |
| | | To Madhuri A/c | 21,750 | | | |
| | | To Tirupal A/c | 25,500 | | | |

ఈ Entry ద్వారా Cash Balance కి ఎట్టి Effect ఉండదు కావున దీనిని Credit Coloumn వైపు మాత్రమే ఈ type of Cash Book లో వ్రాయటం జరుగుతుంది.

3) Rs. 12,500 -- 12,455 = Rs. 45

ఈ 45/-లు Cheque Clearing Chargesగా Bank వారు Rs. 12,500/-లలో తగ్గించి రు.12,455/-లు మాత్రమే జయ అండ్ కో వారి బ్యాంక్ పాస్ బుక్‌లో జమచేయడం జరిగింది. కావున ఈ పద్దును ఈ క్రింది విధముగా వ్రాయవలయును.

a) Page No.165

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | 85 | Bank A/c<br>By Cheque Clearing<br>Charges | | 45 |
| | 335 | Bank Commission A/c<br>To Cheque Clearing<br>Charges | 45 | |

Journal ద్వారా కాకుండా direct గానే Double Coloumn Cash Book లో ఈ Entry ని వ్రాయాలి.

| Date | L.F. | P. | Cash | Bank | Date | L.F. | P. | Cash | Bank |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | 355 | Bank Comm. A/c<br>To Cheque Clearing Charges | | 45 |

c)

| Date | L.F. | PARTICULARS | Cash Dr | Cash Cr. | Credit Dr | Credit Cr. |
|---|---|---|---|---|---|---|
| | 85 | Bank A/c | | | | |
| | | By Cheque | | | | |
| | | Clearing Charges | | | | 45 |
| | 335 | Bank Commission | | | | |
| | | A/c | | | | |
| | | To Cheque Clearing | | | | |
| | | Charges | | | 45 | |

4) Opening Stock Trading Account లో Debit Side, Closing Stock ను Trading Account లో Credit Side న మరియు Balance Sheet లో Assets వైపున చూపబడుతుంది.

5) Gross Profit : ఈ స్థూల లాభ నిష్పత్తి ద్వారా గత సంవత్సరపు స్థూల లాభ నిష్పత్తితోపోల్చి చేయుచున్న వ్యాపారము యొక్క లాభశక్తి పెరుగుచున్నదా లేదా అని తెలుసుకొనుటకును, మరియు యితర సంస్థల లాభశాతంతో సరిచూసుకొని మెరుగైన వ్యాపార అభివృద్ధికి తగిన చర్యలు చేపట్టుటకు వీలు పడుతుంది.

Balance Sheet ద్వారా వ్యాపారము యొక్క ఆర్థికస్థితి, ఆస్తి - అప్పుల వివరములు తెలుసుకొని ఆస్తుల అభివృద్ధికి ఏవైనా జాగ్రత్తలు తీసుకొనుటకు దోహదపడుతుంది.

6) Sundry Debtors అనగా సంస్థకు వసూలుకావలసిన బాకీలు ఇవి Ledger లో Individual ఖాతాలలో జమమొత్తం కన్నా ఖర్చుల మొత్తం కనుక అధికముగా ఉన్నట్లయితే అట్టి తేడా మొత్తంను Debtors [illegible] లో [illegible] తీసుకోవలయును.

అదే విధముగా Sundry Creditors అనగా సంస్థ ఇతరులకు చెల్లించవలసినవి. ఇవి Ledger ఖర్చుల మొత్తం కన్నా జమల మొత్తం కనుక అధికముగా ఉన్నట్లయితే అట్టి తేడా మొత్తములను Sundry Creditors List లోకి తీసుకోవలయును.

7. Schedule for fixed Assets

| Name of the Asset | Opening Balance | Additions | Total | Dep % | Depreciation | Closing |
|---|---|---|---|---|---|---|
| Car | 3,25,000 | --- | 3,25,000 | 20 | 65,000 | 2,60,000 |
| Scooter | 32,000 | --- | 32,000 | 20 | 6,400 | 25,600 |
| Furniture | 21,500 | 4,500 | 26,000 | 10 | 2,6000 | 23,4000 |
| Machinery | 1,15,000 | 21,000 | 1,35,000 | 25 | 34,000 | 1,02,000 |
| Typewriter | --- | 6,150 | 6,150 | 10 | 615 | 5,535 |
| Total | 4,93,500 | 31,650 | 5,25,150 | | 1,08,615 | 4,16,535 |

8) Maheswari యొక్క నెల జీతము రూ.8,150/-ల చొప్పున సంవత్సరమునకు అయ్యే జీతము మొత్తం రూ. 97,800/- (8150 × 12 అయినది. ఈ జీతము సంవత్సరమునకు లక్షలోపుగా ఉంది గావున Standard deduction రూ.25,000/-గాని లేదా సంవత్సరపు మొత్తం జీతములో $33_{1/3}$% గాని ఏది తక్కువగా ఉన్నయెడల దానిని మాత్రమే Standard deduction గా తీసుకోవలయును. కాబట్టి రూ. 32,597/- (97800 × 33 1/3%) ల కన్నా రూ.25,000/- తక్కువ కావున 97,800/-ల నుండి రూ. 25,000/-లను మినహాయించగా వచ్చిన రూ. 72,800/-లు Net Taxable amout అవుతుంది.

ఈ Net Taxable amount మొత్తం రూ.60,000/- నుండి 1,50,000ల మధ్య Slab లో ఉందిగావున రూ. 72,800 లో మొదటి 60,000లకు అయ్యే టాక్స్ 1000/- + మిగిలిన 12800/- (72800 - 356 (60,000) లపై 20% చొప్పున అయ్యే టాక్స్ రు. 2560/-లు సర్‌చార్జీ వెరసి రూ. 3916. ఇందులో నుండి L.I.C, U.L.I.P లుగా రూ.3500/- Savings ఉన్నవి గావున దీనిపై 20% చొప్పున రూ.700/-లు (3500 × 20%) టాక్స్ రిబేటును తగ్గించి మహేశ్వరిగారు రూ. 3216/-లు మాత్రం ఇన్‌కంటాక్స్ చెల్లించిన సరిపడును.

ఈ ఇన్‌కంటాక్స్ రిటన్స్ సేలరీన్‌కి సంబంధించినవి గావున సంవత్సరములో జూన్ నెల 30వ తేదీలోగా రిటన్ ఫారంను సంబంధిత ఇన్‌కంటాక్స్ కార్యాలయములో దాఖలు చేయవలసియున్నది.

| | | |
|---|---|---|
| 9. | Net Income for Renuka Enterprises | 1,81,500 |
| | Add. Agricultural Income | 42,000 |
| | Total | 2,23,500 |

ఇది above రూ.1,50,000/- slab ఉండినది గావున రూ.2,23,500/-లలో మొదటి 1,50,000/-లపై అయ్యే టాక్స్ రూ.19,000/-లు + రూ. 22050/- (2,23,500/- 1,50,000/- = 73,500/- లపై 30% చొప్పున అయ్యేటాక్స్) వెరశి రూ. 47,208/-లు అవుతుంది. అయితే అగ్రికల్చరల్ యిన్‌కం రూ.42,000/- + 50,000 (రూ.50,000/-ల వరకు టాక్స్ లేదు కావున) = 92,000/- యిందుపై అయ్యే టాక్స్ రూ. 1000 + 6400 (92000 - 60,000 = 32000 × 20%) = 7400.

దీనికి సేవింగ్ అయిన రూ. 22,150/-లపై 20% చొప్పున అయ్యే రూ.4,430/-ల రిబేటునుకలుపగా వచ్చిన రూ.[illegible]30/-లను రూ.4[illegible]/-ల నుండి మినహాయించగా వచ్చే రూ. 35378/-లు చెల్లించవలసియున్నది ఈ టాక్స్‌ను సెప్టెంబర్, డిసెంబర్, మార్చి, ఇన్‌స్టాల్‌మెంట్స్ ద్వారా చెల్లించవలయును. (టాక్స్ 5000/-లకు పైబడి ఉంది కావున ఈ అకౌంటు బుక్స్‌ను చార్టెడ్

అక్కౌంటెంట్ చేత ఆడిట్ చేయించి అక్టోబరు నెల 31వ తేదీలోగా సంబంధిత ఇన్‌కంటాక్స్ ఆఫీస్‌లో రిటన్ ఫారంను దాఖలు చేయవలయును.

10) అమ్మకపు విలువలోనుంచి అమ్మకములపై అయ్యే సేల్సు టాక్స్‌ను విడదీసి వేరు వేరు ఖాతాలుగా అకౌంట్ బుక్స్‌లో వ్రాసుకోవటం వలన వస్తువు అసలు విలువ + వసూలు చేయబడిన టాక్స్‌ల మొత్తంపై మరల సేల్సు టాక్స్ డిపార్టుమెంటు వారికి టాక్స్ చెల్లించనవసరము పడదు. అటులగాక, అమ్మకపు విలువ దానిపై అయ్యే సేల్సుటాక్స్ కలిపి ఒకే మొత్తంగా సేల్సు అనే హెడ్ ఆఫ్ అకౌంట్‌లో చూపిన యెడల ఈ టాక్స్ వాల్యూపై మరల సేల్సు టాక్స్‌ను చెల్లించవలసి వస్తుంది. ఉదాహరణను పరిశీలిద్దాం.

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | 9. | Sales 12% A/c | | |
| | | By B.No.16 | | 1,500 |
| | 15 | Sales 8% A/c | | |
| | | By B.No. 121 | | 11,000 |
| | 32 | Sales Tax Collection A/c | | |
| | | By B.No. 16 & 121 | | 1060 |

పైవిధముగా అయిన, అమ్మకముల ఖాతాకు రూ.15,000/-, రూ.11,000/-లను క్రెడిట్ అయ్యాయి కావున అట్టి అమ్మకములపై అయ్యే టాక్స్ 180/- + 880/-లు కలిపి రూ. 1060/-లు మాత్రమే సేల్సు టాక్స్ డిపార్టుమెంటు వార్కి చెల్లించిన సరిపడును. ఇదే ఈ క్రింది విధముగా అయిన యెడల

| Date | L.F. | PARTICULARS | Dr. | Cr. |
|---|---|---|---|---|
| | 9. | Sales 12% A/c | | |
| | | By B.No.16 | | 1680 |
| | 15 | Sales 8% A/c | | |
| | | By B.No. 121 | | 11,880 |

సేల్సు టాక్స్ కలెక్షన్స్ విడిగా చూపించలేదు గావున బిల్లు వాల్యూ మొత్తం కూడా సేల్సు ఖాతాకు జమ కాబడినది. యిట్టి సందర్భములో 12% సేల్సు రూ.1680/-లపై 12% చొప్పున రూ.202/-, 18% సేల్సు రూ.11880/-లపై 8% చొప్పున రూ.950/-లు కలిపి రూ. 1152/-లు డిపార్టుమెంటు వారికి చెల్లించవలసివస్తుంది. మొదటి పద్ధతిలో అక్కౌంటు పుస్తకములు వ్రాసుకొనుట మూలకముగా రూ. 92/- (1152 - 1060) లబ్ధి పొందవచ్చును.

11) నిర్గున్ అండ్ కంపెనీ వారి సంవత్సరపు టర్నోవరు రెండు లక్షలు నుండి ఐదు లక్షల మధ్యన ఉన్నందున వృత్తి పన్నుగా ఫరంకు రూ. 550/-లు చెల్లించవలెను. ఇందులో ఉన్న 3 పార్టనర్స్ మరల విడివిడిగా రూ. 500/-లు చొప్పున చెల్లించాలి. అయితే విజయ్ అనే పార్టనర్ వేరొక ఫరంలో కూడా భాగస్తులై ఉన్నారు కావున వారు ఆ ఫరంలో గనుక 500/-లు చెల్లించి ఉన్నయెడల మరల నిర్గున్ అండ్ కంపెనీలో రూ. 500/-లు చెల్లించనవసరము లేదు. యిదే విధముగా మరిన్ని ఫరములలో భాగస్తుడుగా ఉన్నప్పటికిని.

12) లేబర్ ఆక్ట్ ప్రకారము XXII Attendence register, X Salaries register, XI Wages Slips, XXVI Appointment Orders, XXV Leaves register అను 5 రకముల రిజిష్టర్స్‌ను వ్రాయాలి. నర్సింగ్‌హోమ్‌లో నర్సుకు, రూ.2280/-, రెస్టారెంట్‌లో క్యాషియర్‌కు రు.2115/-లు చెల్లించవలెను.

## SALES TAX APPEALS

సేల్సుటాక్స్ అసెస్‌మెంట్సు పూర్తి అయిన తరువాత అట్టి అసెస్‌మెంట్స్‌లో ఏమైనా తేడాలు ఉన్నట్లుగా తెలుసుకొన్నట్లయితే (ఉన్నదానికన్నా ఎక్కువ టర్నోవర్ నిర్ణయించిన లేదా టాక్స్ రేట్లలో తేడాలు ఉన్నా) ఆర్డర్ తీసుకొన్న [illegible] రోజులలో Appliate Deputy Comm ssioner వారికి అప్పీలు చేసుకొనవలయు [illegible]. దీనికి అప్పీల్ ఫీజుగా Disputed Tax పై 2% గాని లేదా Max m [illegible] రూ [illegible] గాని చెల్లించవలయును.

## SALES TO DEPARTMENTS OF GOVERNMENT

G.O.Ms.No. 625 Revenue CT (II) Dt. 31.7.96 ప్రకారము Petrol, Diesel, Motor Vehicles, Chasis of Motor Vehicles కాకుండా మిగిలిన వస్తువులు ఏమైనా సరే APSRTC వార్కి అమ్మకము చేసినట్లయితే అట్టి అమ్మకములపై సేల్సు టాక్స్ రాయితీ 7%గా ఉంటుంది. (సేల్సు టాక్స్ పర్సంటేజి ఎంత ఎక్కువగా ఉన్నప్పటికి)

## SHOP INSPECTIONS

వ్యాపార సంస్థలను కమర్షియల్‌టాక్స్ డిపార్టుమెంటువారు తనిఖీ చేసినప్పుడు (Shop Inspection) కొన్ని సందర్భములలో Deficit Stock; కొన్ని సందర్భములలో Excess Stock వచ్చేటి పరిస్థితులు ఉంటుంటాయి. ఇట్టి డిఫిసిట్ స్టాక్ అమ్మకము బిల్లులు వ్రాయకుండగానే సరుకులు అమ్మకము జరిగినవి అని డిపార్టుమెంటువారు నిర్ణయించి సేల్సుటాక్స్‌ను మరియు అపరాధ రుసుమును ('C' Fee) వసూలు చేస్తూ ఉంటుంటారు. యిట్టి వాటికి అమ్మకపు బిల్లు వ్రాయనవసరము లేకుండగనే విధిగా రోజు పుస్తకములోను మరియు ఆవర్జా పుస్తకములలోను అమ్మకముల ఖాతాకు Sales at the time of inspection అని జమ వ్రాసి ఆ నెల బిల్లుల ద్వారా అమ్మిన అమ్మకములకు ఈ విలువన కలిపి Form - A2 లో చూపి దాఖలు చేయవలెను. స్టాకు విలువలో నుండి కూడా తగ్గించుకోవలయును. అట్లు చేయనిచో ఈ తేడా ఎప్పుడూ కూడా అదే విధముగా వచ్చే అవకాశముంటుంది.